అపరాధ పరిశోధన అనుబంధం—121

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## గుప్పిట్లో గువ్వ
రచన: వాణిశ్రీ

## అమ్మాయిల బందిఖానా
రచన: బి. రాజేశ్వరి

## ప్రాణం వచ్చిన ప్రతిమ
రచన: అజీజ్

## విందు వంటకాలు
రచన: కె. బి. ఎస్. కుమార్

కళ్యాణదుర్గం - రెండవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—121

జనవరి, 1984

వెల: రు. 5-50

ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:

శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:

టెంపోరావ్

శ్యాంబాబు

ఏ. వీ. మోహన్‌రావ్

బొమ్మిడి అచ్చారావు

విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:

అపరాధ పరిశోధన కార్యాలయం

నారాయణగూడ, హైదరాబాదు-29

ఫోన్-64843

ముద్రణ:

క్రాంతి ప్రెస్,

2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# గుప్పిట్లో గువ్వ

వాణిశ్రీ

అనుపమ ఎంటర్ ప్రైజస్ సంస్థలో రెండేళ్ళ నుంచీ పనిచేస్తున్నాడు సురేష్. కాని ఎప్పుడూ యజమాని నరేంద్రభూపతి ఇంటికి వెళ్ళలేదు. వెళ్ళవలసిన అవసరం అతనికి కలగలేదు. రోడ్డుమీద వెళ్తూ ఆ బిల్డింగ్ ని చాలాసార్లు చూశాడు. విశాలమైన ఆవరణలో పూల తోట మధ్య రాజభవనంలా వుంటుంది.

ఇన్నాళ్టికి నరేంద్రభూపతి నుంచి పిలుపు వచ్చింది సురేష్ కి. మేనేజర్ గుండెపోటుతో హాస్పటల్లో చేరాడు. అప్పుడే ముఖ్యమైన అగ్రిమెంట్ చెయ్యాల్సి వచ్చింది. అమెరికానుంచి పార్టీ వచ్చి కూర్చున్నాడు.

మేనేజర్ కి సురేష్ పర్సనల్ సెక్రటరీ. అందువల్ల ఆ బాధ్యత సురేష్ భుజస్కంధాలమీద పడింది. నరేంద్ర భూపతి ఫైల్స్ తీసుకుని ఇంటికి రావల్సిందిగా సురేష్ ని ఆజ్ఞాపించాడు.

కంపెనీనుంచి కారులో అవసరమైన ఫైల్స్ తీసుకుని

బయల్దేరాడు సురేష్. ఆ సమయంలో అతనికి ఎంతో ఆనందం కలిగింది. ఎన్నడూ లేని హుందాతనం ప్రవేశించి నట్లయింది.

తాత్కాలికంగా తను మేనేజర్ బాధ్యత నిర్వహి స్తున్నందుకు గర్వంగా వుంది. మనిషికి హోదావల్ల ఆనందం, గౌరవం, పరపతీ అన్నీ లభిస్తాయి గదా! అను కున్నాడు. తనకీ పదవి శాశ్వతంగా వుంటే యెంతో బాగుండును అని తలపోశాడు. కాని అది అసాధ్యం అని తెలిసి మనసు బాధతో మూలిగింది.

కారు నరేంద్రభూపతి భవనం పోర్టికోలో ఆగింది. యూనిఫారమ్‌లో వున్న నౌకరు కారు డోర్ తెరచి సెల్యూట్ కొట్టాడు. మరొక నౌకరు సురేష్ చేతిలోని ఫైల్స్ అందుకున్నాడు.

"కమాన్ సురేష్! అన్నీ తెచ్చావా?" అని చిరు నవ్వుతో పలకరించాడు నరేంద్రభూపతి.

"యస్సార్!" అన్నాడు సురేష్ వినయంతో.

"మీట్ ది పార్టీ. యురేకా ఎంటర్‌ప్రైజెస్ ఆఫ్ అమెరికా. హీ ఈజ్ అవర్ యాక్టివ్ సెక్రటరీ మిస్టర్ సురేష్" అంటూ పరిచయం చేశాడు నరేంద్రభూపతి.

సురేష్ వారితో కరచాలనం చేసి సంతోషం వ్యక్త పరిచాడు.

నరేంద్రభూపతికి డెభ్భై ఏళ్ళున్నా చాలా యాక్టి వ్‌గా కనిపిస్తాడు. పదేళ్ళు తక్కువ వయస్సువాడిలా చూపరులకు గోచరిస్తాడు. అంత ఆరోగ్యంగాను వుంటాడు. కంపెనీ వ్యవహారాలలో కుర్రవాడిలా హుషారుగా పనిచేస్తాడు.

అమెరికా కంపెనీ పార్టనర్స్‌తో అగ్రిమెంట్ పూర్త

య్యేసరికి రాత్రి తొమ్మిది దాటింది. తర్వాత వారికి భూపతి ఇంట్లోనే డిన్నర్ ఏర్పాట్లు జరిగాయి. స్కాచ్ విస్కీ సర్వ్ చేశారు. రకరకాల వెజ్-నాన్-వెజ్ డిష్‌లు తెచ్చి పెట్టారు. సురేష్‌కి డ్రింక్ చేసే అలవా టున్నా యజమానిముందు తీసుకోవడానికి జంకాడు. తనకి అలవాటులేదని మనవి చేసుకున్నాడు.

పదకొండు గంటలకు పార్టీ ముగిసింది. అమెరికన్స్ వాళ్ళు బసచేసిన హోటల్‌కి వెళ్ళిపోయారు. నరేంద్ర భూపతి బాగా డ్రింక్ పుచ్చుకున్నా నిశ్చలంగా కనిపి స్తున్నాడు. మనిషి తూలడంలేదు. తొణకడంలేదు.

సురేష్‌కి మాత్రం చాలా ఆశ్చర్యంగా వుంది. నరేంద్ర భూపతి, నౌకర్లు తప్ప మరి వేరే కుటుంబ సభ్యులు ఎవరూ కన్పించడంలేదు.

ఫ్యామిలీ మెంబర్లంతా ఎక్కడికైనా వెళ్ళారేమో అనుకున్నాడు. ఇక యజమాని దగ్గర సెలవుతీసుకుని వెళ్ళిపోవాలని ఆయన గదిలోకి వెళ్ళి వాకిట్లో నిల్చు న్నాడు.

నరేంద్ర భూపతి అతన్ని గమనించలేదు. ఆయన చూపులు ఒక ఫోటోమీద వున్నాయి. ఆ ఫోటో పన్నెండేళ్ళ పాపది. ఫుల్ సైజ్‌లో ఎన్‌లార్జ్ చేసి వుంది.

"సార్!...." అన్నాడు సురేష్.

నరేంద్రభూపతి తలతిప్పి చూశాడు.

"నేను వెళ్ళొస్తాను సార్!"

"డిన్నర్ చేశావు గదా!"

"చేశాను సార్!"

"అంతా సక్రమంగా జరిగింది మిస్టర్ సురేష్. మీ నేజర్

లేకపోయినా అన్నీ దగ్గరుండి జరిపించావు. ఐ లైక్ యూ!" అన్నాడు నరేంద్ర భూపతి.

"థాంక్యూ వెరీమచ్ సార్!"

"ఇంత రాత్రివేళ ఇంటికి ఏం వెళ్తావు. ఇక్కడే పడుకో."

"ఫరవాలేదు సార్! సార్ ఇంట్లో ఎవరూ కన్పిం చడంలేదు ఊరు వెళ్ళారా సార్!" అన్నాడు సురేష్.

నరేంద్ర భూపతి ముఖంలో బాధ స్పష్టంగా కన్పిం చింది.

"ఊరెళ్ళడం కాదు సురేష్. శాశ్వతంగా స్వర్గలోకం వెళ్లారు" అన్నాడాయన. ఆయన కళ్ళలోనుంచి కన్నీరు బుగ్గలమీదకు జారింది.

"సార్!...."

"అవును సురేష్. నాకెవరూ లేరు. ఒక్కడే కొడుకు వుండేవాడు. బిజినెస్ మేనేజ్‌మెంట్ చదివాడు అమెరికాలో. వ్యాపారంలో మెలకువలన్నీ తెలుసు కున్నాడు. పెళ్ళిచేశాను. వారికి ఒక అమ్మాయి పుట్టింది. బిజినెస్ అంతా వాడే చూసుకునేవాడు. ఒకసారి ఢిల్లీ నుంచి కొడుకూ, కోడలూ వస్తున్నారు. ట్రెయిన్ యాక్సిడెంట్ జరిగింది. అందులో చనిపోయారు."

"ఐయామ్ సారీ సర్! మరి పాప?"

"చనిపోయే వుంటుంది. కానీ డెడ్‌బాడీ దొరకలేదు. ఆ పాపే అనుపమ. ఆ పేరుతోనే బిజినెస్ చేస్తూ తృప్తి పొందుతున్నాను" అన్నాడు నరేంద్ర భూపతి.

సురేష్ పరీక్షగా ఫోటో వంక చూశాడు. చూడగా చూడగా ఆ ముఖం ఎక్కడో చూసినట్లుగా అనిపించ సాగింది. ఎక్కడ? ఎక్కడ? జ్ఞాపకాల పొరలు వెతక

సాగాడు. గుర్తు రావడంలేదు.

"సార్! ఈ పాపను ఎక్కడో చూసినట్లు అనిపిస్తోంది సార్!" అన్నాడు సురేష్.

నరేంద్ర భూపతి ఉలిక్కిపడ్డాడు. ఆశగా సురేష్ వంక చూశాడు. అంతలోనే అతని ముఖంలో నిరాశ చోటు చేసుకుంది.

"యాక్సిడెంట్ జరిగి పదేళ్ళయింది. నువ్వెక్కడ చూసి వుంటావు? అంతా భ్రమ" అన్నాడు నరేంద్ర భూపతి.

"భ్రమో? నిజమో కాని సార్! ఇరవై ఏళ్ళ యువతిని ఇదే ముఖంగల ఆమెను చూసినట్లు అనిపిస్తోంది. కాని ఎక్కడ చూశానో? ఎప్పుడు చూశానో మాత్రం జ్ఞాపకం రావడంలేదు. ఒకవేళ పాప యాక్సిడెంట్ లో బ్రతికి బైటపడి వుండొచ్చు సార్!" అన్నాడు సురేష్.

"నువ్వు వూహించినట్లు జరగడానికి అవకాశం వుంది! బాగా జ్ఞాపకం తెచ్చుకో. నా అనుపమ యెక్కడుందో వెతుకు. ఎంత డబ్బు కావాలన్నా తీసుకో. అనుపమ దొరికితే నువ్వు కోరినంత డబ్బు ఇస్తాను సురేష్!" నరేంద్ర భూపతి అంతులేని ఆనందంలో అంటున్నాడు.

"మీకోసం నేను ఎంత శ్రమపడి అయినా సరే ఆమె కోసం వెతుకుతాను" అన్నాడు సురేష్.

## 2

వారం రోజులు తీవ్రంగా ఆలోచించాడు సురేష్.

అనుపమ పోలికలుగల యువతిని ఎక్కడ చూశాడు? ఎప్పుడు చూశాడు? తల బ్రద్దలు కొట్టుకున్నా గుర్తు రావడంలేదు.

అతనికి డైరీ రాసుకునే అలవాటుంది. పాత డైరీ

అన్నీ వెతికాడు. పేజీలన్నీ తిరగేశాడు. అలా పేజీలు తిరగేస్తూ వుంటే అతని మనసులో ఒక ఫ్లాష్.

సంవత్సరం క్రితం మేనేజర్‌తోపాటు ఢిల్లీ వెళ్ళాడు. వారం రోజులు వుండాల్సొచ్చింది. ఫైవ్ స్టార్ హోటల్లో బస. రోజూ విస్కీ, బీర్ వగైరాలతోపాటు ఖరీదైన భోజనం. మేనేజర్ కమ్మగా నిద్రపోయేవాడు. అతనికి నిద్రపట్టేదికాదు. నరాలు జివ్వుమనేవి. కోరికలు పురులు విప్పేవి. అర్ధ రాత్రివరకూ క్యాబరేలు చూసి మనసు మరింత రెచ్చిపోయేది.

ఇక లాభంలేదని రూమ్ బాయ్‌ని కదలేశాడు. వాడి పేరు రవీంద్ర.

"ఎందుకు దొరకరు సార్?" అని నవ్వాడు.

"ఈ రాత్రికి తీసుకు రాగలవా?"

తల వూపాడు రవీంద్ర.

"ఎంత?"

"వెయ్యి రూపాయలు. టాక్సీ ఫేర్ మీరే ఇవ్వాలి. రావడానికి పోవడానికి కూడా!"

సురేష్‌కి తల తిరిగింది.

"ఒక్క రాత్రికి వెయ్యిరూపాయలా?" ఆశ్చర్య పోతూ అన్నాడు.

రవీంద్ర సమాధానం చెప్పకుండా నవ్వి వెళ్ళిపోయాడు. హోటల్ రూమ్ రెంట్ భోజనం వగైరాలు కంపెనీ భరిస్తున్నది. ఎంత ఖర్చయినా ఫరవాలేదు. కాని కాల్ గరల్ బిల్లు ఎవరిస్తారు? అందులో ఏ వైకాదు, వందకాదు. వెయ్యి. తన నెల జీతంతో సమానం.

సురేష్ నీరసించి పోయాడు. మేనేజర్ పక్కగదిలో గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. సురేష్ బుక్ స్టాల్లో ఒక

సెక్స్ బుక్ కొనుక్కుని చదవసాగాడు. ఎంతకీ నిద్ర రావడంలేదు. రూమ్ బైటకొచ్చి వరండాలో పచార్లు చేయసాగాడు. చలిగాలి దంచి కొడుతున్నది. స్వెట్టర్ వేసుకున్నా చలిగానే వుంది.

రవీంద్ర డ్యూటీ దిగి వెళ్ళిపోతున్నాడు. హోటల్ యూనిఫారమ్‌లో లేడు.

"గుడ్ నైట్ సార్!" అన్నాడతను సురేష్‌ని చూసి.

"గుడ్ నైట్. డ్యూటీ అయిపోయిందా?"

తల వూపాడు రవీంద్ర. కొన్ని క్షణాలు ఆగాడు.

"సార్ మీరు ఫైవ్ స్టార్ హోటల్లో వుంటున్నారు. కాల్ గరల్ కోసం ఆ మాత్రం డబ్బు ఖర్చుపెట్టలేరా?"

సురేష్ నవ్వి "హోటల్ బిల్లు మా కంపెనీ చెల్లిస్తుంది. కాల్‌గరల్ బిల్లు నేను ఇవ్వాలి. నా జీతమే వెయ్యి. అంత డబ్బు ఒక్క రాత్రికి ఖర్చుచేస్తే నా గతి ఏమిటి?" అన్నాడు.

"సార్ ఒక ప్రైవేట్ కేసు వుంది. కాని ఆ అమ్మాయి హోటల్‌కి రాదు. మినిమమ్ రెండొందలు ఇవ్వాలి."

"ఎవరా అమ్మాయి?"

"మా ఇంటికి వెళ్ళే దార్లోనే వుంది. చాలా అందంగా వుంటుంది. బి.యస్సీ. చదువుతోంది."

"స్టూడెంట్ అన్నమాట."

"అవును సార్! చాలా బీదవాళ్ళు. ఆమెకు తల్లి లేదు. తండ్రి లారీ డ్రైవర్. యాక్సిడెంట్‌లో పోయాడు. ఒంటరిది. అప్పట్నుంచి జరుగుబాటులేక చదువుకుంటూనే చాలా సీక్రెట్‌గా వ్యవహారం జరుపుతోంది" అన్నాడు రవీంద్ర.

"అయితే నన్ను నీతో రమ్మంటావా?"

"రండి సార్!"

"ఆమె పేరు?"

"అనుపమ."

"సరే పద. ఆ అమ్మాయిని చూడాలని నాకు ఎంత గానో వుంది" అన్నాడు సురేష్.

ఇద్దరూ రోడ్డుమీదకు వచ్చారు.

రవీంద్ర ఆటో పిలిచాడు.

ఆటో దిగిన తర్వాత ఒక ఫర్లాంగు దూరం నడిచారు. అదంతా మురికివాడ ప్రాంతం. చిన్న చిన్న రేకుల ఇళ్ళు అక్కడక్కడా వున్నాయి. రవీంద్ర సురేష్ని ఒక స్ట్రీట్ లైట్ దగ్గరున్న కిళ్ళీకొట్టు దగ్గర ఆగమన్నాడు. తను ఒక్కడే ఒక సందులోకి వెళ్ళాడు. పావుగంట తర్వాత తిరిగి వచ్చాడు. రమ్మని సైగ చేశాడు. సురేష్, రవీంద్రను అనుసరించాడు.

ఒక ఇంటిముందు ఆగారు. అదొక రేకుల షెడ్. తలుపు తీసేవుంది. డోర్ కర్టెన్ వ్రేలాడుతోంది.

"అనుపమా!" పిలిచాడు రవీంద్ర.

తెర చీల్చుకుని వచ్చింది అనుపమ.

"లోపలికి వెళ్ళండి" అన్నాడు రవీంద్ర.

సురేష్ లోపలకు వెళ్ళబోతుంటే "ఆమెకు రెండు వందలు ఇవ్వండి" అన్నాడు.

సురేష్ తల వూపాడు.

ముందు చిన్న గది వుంది. వంటపాత్రలు, పొయ్యి అన్నీ అక్కడే వున్నాయి.

లోపల మరొక గది వుంది. మధ్యలో తలుపులేదు. కర్టెన్ వుంది. సురేష్ లోపలకు వచ్చాక కర్టెన్ పూర్తిగా

వేసేసింది అనుపమ. ఆమెను చూస్తుంటే మురికివాడలో అమ్మాయిలా లేదు. అందంగా వుండడమేకాక ఖరీదైన చీర కట్టింది. నీట్‌గా టాయిలెట్ అయివుంది. ఆమె హిందీలోనే మాట్లాడింది.

"నీ పేరు అనుపమా?"

"అవును."

"బి.యస్సీ. చదువుకుంటున్నావటగదా!"

తల వూపింది.

సురేష్ తన గురించి చెప్పాడు. ఆమె మౌనంగా విన్నది. ఏమీ అడగలేదు.

తెల్లవారు జామున సురేష్ అక్కడ్నుంచి బైట పడ్డాడు.

మర్నాడు గూడా అతను అనుపమ దగ్గరకు వెళ్ళా లనుకున్నాడు. కాని మధ్యాహ్నమే తిరుగు ప్రయాణం కట్టాల్సి వచ్చింది.

సురేష్‌కి అదంతా యిప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఆమె పేరు గూడా అనుపమే. రైలు యాక్సిడెంట్‌లో అనుపమ ఆ లారీ డ్రైవర్‌కి దొరికి వుంటుంది. పిల్లలులేని అతను అనుపమను పెంచుకుని వుంటాడు.

ఇదంతా నరేంద్రభూపతికి చెప్పాలి అనుకుంటూ హుషారుగా బయల్దేరాడు సురేష్.

## 3

నరేంద్ర భూపతి భవనంలోకి ప్రవేశించేటప్పటికి అతని ఆలోచనలు తారుమారయ్యాయి. తను అనుపమ వ్యభిచారిణిగా చూశానని చెప్తే ఆయన బాధపడతా డేమో? అటువంటి పిల్ల తన మనుమరాలని ఒప్పుకోవ డానికి ఆయన మనసు అంగీకరించదేమో? కాబట్టి తను

ఆమెను గురించి మరొక విధంగా చెప్పాలి అనుకున్నాడు.

"నమస్తే సార్!" అన్నాడు సురేష్.

"నువ్వా సురేష్! ఏమిటి విశేషాలు?" ప్రశ్నించాడు నరేంద్ర భూపతి.

"సార్! పాపను ఎక్కడ చూశానో గుర్తొచ్చింది."

"ఈజిట్?" ఆయన కళ్ళు మెరిశాయి. ముఖంలో ఆనందం కనిపించింది.

"ఢిల్లీలో చూశాను సార్! షుమారు ఒక సంవత్సరం దాటి వుంటుంది. వారం రోజులు ఆలోచించాక ఇప్పటికి గుర్తొచ్చింది."

"వెరీగుడ్ సురేష్!" అంటూ ఆయన సోఫాలోనుంచి లేచి వచ్చి అతని చేతిని తన చేతిలోకి తీసుకుని ప్రక్కన కూర్చోబెట్టుకున్నాడు.

ఆయన ఆనందం చూసి సురేష్‌కి ధైర్యం వచ్చింది. యజమాని ప్రక్కన మేనేజర్ సహితం కూర్చోగా తను చూడలేదు. అతడు రిజర్వ్‌డ్‌గా వుంటాడు. అటువంటి ఆయన తనను ప్రక్కన కూర్చోబెట్టుకున్నాడు. అతనికి కించిత్తు గర్వం కలిగింది.

"ఇప్పుడు చెప్పు? అనుపమను ఎక్కడ చూశావు?"

"ఢిల్లీలో సార్!"

"అదే. ఢిల్లీలో ఎక్కడ?"

"సామ్రాట్ ఇంటర్నేషనల్ హోటల్ దగ్గర చూశాను. ఆమె నాకు యెందుకు గుర్తున్నదంటే ఆ దగ్గర్లోనే కాలేజీ వుంది. ఆ కాలేజీలో ఆమె చదువుతున్నట్లు వుంది. ఎవడో పోకిరీ వెధవ వచ్చాడు ఆమెను ఏదో అన్నాడు. అంతే లాగి లెంపకాయ కొట్టింది. జనం మూగారు. అప్పుడు నేనక్కడే వున్నాను. ఆమె ధైర్యం

నాకు నచ్చింది. అందుకే నాకామె ముఖం గుర్తుంది."

సురేష్ ఒక కల్పిత కథ చెప్పాడు.

ముసలాయన ముఖంలో సంతృప్తి కనిపించింది.

"సంవత్సరం జరిగింది సార్ ఈ సంఘటన నేను చూసి. ఇప్పుడామె యెక్కడుందో? ఆ కాలేజీలో వున్నదో లేదో?"

"నువ్వు వెంటనే ఢిల్లీ వెళ్ళు. ఎన్నాళ్ళయినా వుండు. ఎంత డబ్బు ఖర్చయినా ఫరవాలేదు. నా మనవరాలిని నాకు చూపించు."

"అలాగే సార్!"

"కోట్ల రూపాయల ఆస్తికి ఇన్నాళ్టికి వారసురాలు దొరకబోతోంది. లేకపోతే ఈ సంపదంతా గుళ్ళకీ, ధర్మకార్యాలకూ ఇవ్వాల్సొచ్చేది" అన్నాడు నరేంద్ర భూపతి.

'కోట్లకొద్దీ ఆస్తి....' సురేష్ గొణుక్కున్నాడు.

## 4

సామ్రాట్ ఇంటర్నేషనల్ హోటల్లో దిగాడు సురేష్. స్నానంచేసి ఫ్రెష్‌గా తయారయ్యాడు. బార్‌లోకి వెళ్ళి చల్లటి బీర్ త్రాగాడు. ప్రయాణ బడలిక కొంచెం తగ్గినట్లు అనిపించింది.

అతను ఢిల్లీ చాలాసార్లు వచ్చినా, ఒంటరిగా రావడం అదే మొదలు. అందుకే అతనికి చాలా ఫ్రీగా వున్నట్లనిపించింది. కొంచెంసేపు లాన్‌లో కూర్చున్నాడు. రూమ్‌కి వెళ్ళి డిన్నర్ తెప్పించుకున్నాడు.

తర్వాత బేరర్ రవీంద్రను పిలిపించాడు.

అతను కుతూహలంతో వచ్చాడు.

"హల్లో మిస్టర్ రవీంద్రా! బాగున్నావా?" అంటూ

నవ్వుతూ పలకరించిన సురేష్‌ని విస్తుపోతూ చూశాడు.

"మీరు....మీరు...." రవీంద్ర అతన్ని గుర్తుపట్టలేక పోయాడు.

"నేను గుర్తు లేనన్నమాట. ఏమిలా వుంటానులే? ఎప్పుడో సంవత్సరం క్రితం చూశావు. రోజూ ఎందరినో చూస్తుంటావు. గుర్తుండడం కష్టం."

"సార్!....మీరెవరో నాకు తెలియడంలేదు. నన్ను వెంటనే కలుసుకోమని చెప్పారట....!"

"అవును. నేను పొరబడడంలేదు. నేను నీకోసమే హైదరాబాద్‌నుంచి ఢిల్లీ వచ్చాను" నవ్వుతూ అన్నాడు సురేష్.

"నాకోసం అంత దూరంనుంచి వచ్చారా?" రవీంద్ర మరింత ఆశ్చర్యపోతూ అన్నాడు.

"అవును. అలా ఆశ్చర్యపోకు. ముందు కూర్చో!" అన్నాడు.

"ఫరవాలేదు సార్!" ఇబ్బందిగా అన్నాడు రవీంద్ర.

"అలా కాదు. కూర్చో!"

"సారీ సార్! నేను డ్యూటీలో అలా కష్టమర్ల ముందు కూర్చోగూడదు. మా హోటల్ రూల్స్ ఒప్పుకోవు. ఎవరైనా చూస్తే ఉద్యోగం కాస్తా వూడుతుంది."

సురేష్ డోర్ లాక్ చేసి వచ్చి, రవీంద్రను బలవంతాన కూర్చోబెట్టాడు.

"నువ్విప్పుడు సర్వర్‌వి, నేను కష్టమర్ని కాదు. అదంతా కాసేపు మర్చిపో. నేను నీ సహాయంకోసం వచ్చాను."

"నా సహాయమా?"

"అవును మిష్టర్ రవీంద్రా!"

"చెప్పండి."

"సంవత్సరం క్రితం నేను ఇదే హోటల్లో పనిచేశాను. అఫ్‌కోర్స్ అప్పుడు నాతోపాటు మా మేనేజర్ గూడా వున్నాడనుకో."

రవీంద్ర గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

"ఒకరోజు నన్నొక కాలేజీ అమ్మాయి ఇంటికి తీసి కళ్ళావు. ఆమె పేరు అనుపమ."

"అనుపమా?"

"అవును."

రవీంద్రకు గుర్తొచ్చింది.

"అవును. గుర్తొస్తోంది."

"అనుపమ కావాలి నాకు. పిలిపించు ఈ రాత్రికి" అన్నాడు సురేష్.

రవీంద్ర పెదవి విరిచాడు.

"సారీ సార్."

"ఏం?"

"ఆమెకి పెళ్ళయిపోయింది."

"వాట్....?" సురేష్ అరిచాడు.

"అవును సార్! ఆమె పెళ్ళిచేసుకుంది."

వుసూరు మన్నాడు సురేష్.

"పెళ్ళిచేసుకున్నాక ఆమె రావడం లేదా?"

"లేదు సార్! ఇప్పుడా ఇంట్లోనే వుండడంలేదు. ఆది అమ్మేసి మేనమామ వెంట వెళ్ళిపోయింది."

"అతను ఏం పని చేస్తాడు."

"డి.సి.యమ్.లో వాచ్‌మాన్."

"చదువుకున్న అమ్మాయి అతన్ని ఎలా పెళ్ళిచేసు కుంది?"

"పరిసితులు సార్!"

"అతను ఎలాంటివాడు?"

"వాడుట్టి వెధవ సార్!"

"డబ్బుకోసం అనుపమను హోటల్‌కి పంపిస్తాడా?"

"తెలీదు సార్! అది కాదు సార్! వాడుట్టి తాగుబోతు."

"ఎన్నేళ్ళుంటాయి?"

"నలభై దాటి వుంటాయి. ఇది మూడో పెళ్ళి వాడికి."

"అయితే అనుపమ ఇష్టం లేకుండానే ఈ పెళ్ళి చేసుకుని వుంటుంది."

"అంతే సార్!"

"అనుపమను ఒకసారి కలుసుకోవాలి. నా కోసం ప్రయత్నించగలవా?"

రవీంద్ర కొంచెంసేపు మాట్లాడలేదు.

"నీకు కావాల్సిన డబ్బు ఇస్తాను."

"అందుకు కాదు సార్! ఇక ఎవర్నీ తీసుకురావద్దని, ఆ జీవితం మానేశాననీ చెప్పింది సార్!" అన్నాడు రవీంద్ర.

సురేష్ నవ్వాడు.

"అది ఆర్నెల్ల క్రితం మాట. ఇప్పుడు ఆమె మనసు మారి వుండొచ్చుగదా! అయినా ప్రయత్నించడంలో నష్టం ఏమిటి? నేను కేవలం ఒక రాత్రి గడపడానికి మాత్రమే రాలేదు."

"మరి?"

"నాకు అదృష్టం కలిసొచ్చి పాతిక లక్షలు లాటరీ తగిలింది. సినిమా తియ్యాలని బుద్ధి పెట్టింది. అనుపమ

అందం నన్ను ఆకర్షించింది. ఆమెను హీరోయిన్ చెయ్యాలని సంకల్పించాను. అందుకే ఇంత ఆరాటం. నువ్వేమంటావు? అనుపమ అందంగా వుంటుంది కదూ!"

రవీంద్ర ఆశ్చర్యంనుంచి కోలుకోలేదు.

"మీరు సినిమా తీస్తున్నారా....?"

"అవును. ఏం....?"

"ఏం లేదు సార్! అనుపమ సినిమాల్లో పనికిరాదు సార్!"

"ఏం?"

"ఆమె బిడియస్తురాలు. మాట్లాడ్డానికే ఎంతో మొగమాట పడుతుంది. పిరికి మనిషి."

సురేష్ నవ్వాడు.

"మొదట్లో అంతా అలాగే వుంటారు. ప్రాక్టీస్‌లో మామూలుగా యాక్ట్ చేసేస్తారు. అదంతా నేను చూసుకుంటాను. అనుపమ నన్ను కలుసుకునే ఏర్పాటు చెయ్యి చాలు" అన్నాడు సురేష్.

సూట్‌కేస్ తెరచి రెండువందల కాగితాలు రవీంద్ర చేతిలో పెట్టాడు.

"ఇది అడ్వాన్స్ మాత్రమే" అని చిరునవ్వు నవ్వాడు.

## 5

రవీంద్ర తలుపు తట్టాడు.

అనుపమ తలుపు తెరిచింది. అతన్ని చూసి ఆశ్చర్యపోయింది.

"ఏమిటిలా వచ్చావు?" అంది.

"నీతో పనుండి వచ్చాను. లోపలకు రానివ్వవా

ఏమిటి? గుమ్మంలోనే నిలబెట్టి మాట్లాడుతున్నావు."

"అదేంలేదు. కిషన్‌కి తెలిస్తే పెద్ద గొడవ" అంది విసుగ్గా.

"కిషన్ వెళ్ళేవరకూ ఆ మూల చెట్టుకింద నిల్చుని వచ్చాను. ఎలా తెలుస్తుంది? మళ్ళీ రేపు ఉదయమేగా డ్యూటీనుంచి వచ్చేది?"

"తెలియడానికేముంది? అతనే చూడాలా? ఇరుగు పొరుగువాళ్ళు ఎవరైనా చెప్పొచ్చు" అంది.

రవీంద్ర ఇల్లంతా కలయజూశాడు. ఒక గదిలోనే సంసారం. దరిద్రం తాండవిస్తోంది ఇంట్లో. అనుపమగూడా ఈ ఆర్నెల్లలో ఎంతో చిక్కిపోయినట్లు కనిపిస్తోంది. ఆమె కళ్ళల్లో దిగులు గూడు కట్టుకుంది.

అతను లోపలకు వచ్చాక ఆమె తలుపు మూసింది.

"చాలా చిక్కిపోయావు అనుపమా?" అన్నాడు ఆప్యాయంగా.

ఆమె సమాధానం చెప్పలేదు. నవ్వి వూరుకుంది.

"సరిగా తిండిగూడా తినడం లేదా?"

"తినడానికేముంది? జీతంలో మువ్పాతిక భాగం అతని తాగుడుకే సరిపోతుంది."

"ఏదైనా జాబ్‌కి ట్రై చెయ్యక పోయావా?"

"పోస్టుగ్రాడ్యుయేట్స్‌కే దిక్కులేదు. కనీసం డిగ్రీ గూడా పూర్తిచేయని నాకెవరిస్తారు జాబ్" అంది విరక్తిగా.

కాసేపు పిచ్చాపాటీ మాట్లాడి అసలు విషయంలోకి వచ్చాడు రవీంద్ర.

"సంవత్సరం క్రితం సురేష్ అని ఒక వ్యక్తి ఒక రాత్రి నీతో గడిపి వెళ్ళాడు."

"అయితే?"

"అతను మళ్ళీ వచ్చాడు ఇవ్వాళ్టికి. మా హోటల్లోనే రూమ్ తీసుకున్నాడు. గమ్మత్తు ఏమిటో తెలుసా? అతను హైదరాబాద్ నుంచి ఢిల్లీ వచ్చింది నీ కోసమే నట."

అనుపమ ఆశ్చర్యంగా చూసింది.

"నిన్ను చూడాలని చచ్చిపోతున్నాడనుకో."

"చెప్పకపోయావా? మా నేకానసీ, పెళ్ళయిందనీ."

"అన్నీ చెప్పాను."

"సారీ రవీంద్రా! నేను రాలేనని చెప్పు."

"అనుపమా బాగా ఆలోచించుకో. అతను వచ్చింది నీ దగ్గర సుఖం పొందడానికి కాదు. నీ అందం అతనికి నచ్చిందట. లాటరీలో పాతిక లక్షలు వచ్చాయట. నిన్ను హీరోయిన్ చేసి సినిమా తీస్తాడట."

అనుపమ పకపకా నవ్వింది.

"అతనెవరో పిచ్చివాడిలా వున్నాడు."

"కావచ్చు."

"దేశం గొడ్డుపోయిందా? నాకంటే అందగత్తెలు ఎందరో వున్నారు."

"వుంటే వుండొచ్చు. అదృష్టం అందరికీ కలిసిరాదు."

"అదృష్టం సంగతి అలా వుంచు. నేను నటనకు పనికి రాను. నలుగుర్లో తిరగడమే నాకు సిగ్గు."

"అదంతా అతను చూసుకుంటాడు. ప్రాక్టీస్ మీద వచ్చేస్తుందని చెప్పాడు."

"అతని మాటలన్నీ నిజమని నమ్ముతున్నావా? సినిమా హీరోయిన్ చేస్తానని నమ్మించి బొంబే తీసికెళ్ళి ఏ బ్రోతల్ హౌస్‌కో అమ్మేస్తే?"

"అతను అలాంటివాడని అనుకోకు. అలా మోసం చెయ్యదలిస్తే నీ దగ్గరికే రావాలని ఏముంది? ఆ గ్లామర్ వున్న వాళ్ళు ఎందరో దొరుకుతారు."

అనుపమ మాట్లాడలేదు కొంతసేపు. ఏదో ఆలోచిస్తూ గడిపింది.

"అనుపమా! అదృష్టం నీ తలుపు తట్టింది. కాదనకు."

"రవీంద్రా! నాకల్లా కాదు ఆ సినిమాల్లో యాక్టు చెయ్యడం. అతనికి ఆ సంగతి చెప్పు." నిష్కర్షగా అంది.

రవీంద్ర ఆమెకు నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. ఆమె వినలేదు.

# 6

సినిమా హీరోయిన్ చేస్తానని ఆశపడితే ఎగిరి గంతేస్తుందని తలపోసిన సురేష్ అనుపమ ఒప్పుకోలేదని వినే సరికి షాక్ తిన్నాడు.

"సార్! మీ పిచ్చిగాని అనుపమకంటే అందగత్తెలు ఎక్కడా దొరకరా? పేపర్లో ఒక ప్రకటన ఇవ్వండి చాలు. మీ గదిముందు క్యూలో నిల్చుంటారు హీరోయిన్లు" రవీంద్ర నవ్వాడు.

"నా పిచ్చి నాకు ఆనందం" అన్నాడు సురేష్.

"సార్! నేను వెళ్ళొస్తాను. డ్యూటీ అయిపోయింది" అన్నాడు రవీంద్ర.

"మిష్టర్ రవీంద్రా! నాకు అనుపమ ఇల్లు చూపించ గలవా?"

"నాకు ఏమీ అభ్యంతరంలేదు. కాని...."

"కాని....ఏమిటి?"

"అనుపమ మొగుడు కిషన్‌గాడుట్టి మూర్ఖుడు.

మిమ్మల్ని చూస్తే ఏమైనా వుందా? అసలే తాగివుంటాడు ఎప్పుడూ!"

"ఫరవాలేదు. నేను అతన్ని మేనేజ్ చేస్తాను" అన్నాడు సురేష్.

ఇద్దరూ హోటల్ దాటి రోడ్డుమీదకు వచ్చారు. ఆటోలో ఎక్కారు.

రవీంద్ర అనుపమ ఇల్లు చూపించి వెళ్ళిపోయాడు.

తలుపు తీసేవుంది.

సురేష్ చొరవగా లోపలకు వెళ్ళాడు.

అనుపమ అతన్ని చూసి భయపడింది.

"ఎవరు మీరు?" అంది.

"నా పేరు సురేష్. రాత్రి రవీంద్ర నీకు అంతా చెప్పేవుంటాడు."

"ఆc— చెప్పాడు. కాని నాకు ఇష్టంలేదు. ఆ సంగతి ఖచ్చితంగా చెప్పాను. మళ్ళీ మీరెందుకు వచ్చారు? దయచేసి వెళ్ళిపోండి. నా భర్త వచ్చే వేళయింది" భయం భయంగా అంది ఆమె.

"భయపడకు అనుపమా! నేను రవీంద్రకు చెప్పినవన్నీ అబద్ధాలే."

"ఏమిటీ?"

"అవును. నేను అతనికి నిజం చెప్పలేదు. సినిమా తియ్యడం, నిన్ను హీరోయిన్ చెయ్యడం అంతా నిన్నెలాగైనా నా దగ్గరకు రప్పించుకోవాలని అలా చెప్పాను."

"ఇక నాతో ఏం పని? నేను అవన్నీ మానేశాను. నాకు పెళ్ళయింది."

"అయితే అయింది. అనుపమా! నేను చెప్పే విషయం

జాగ్రత్తగా విను. ఇది చాలా సీక్రెట్. ముందు తలుపు వేసిరా” అన్నాడు.

ఆమె తలుపు గడియపెట్టి వచ్చింది.

“అనుపమా నువ్వు నీ తల్లిదండ్రులుగా భావించిన వారికి పుట్టలేదు.”

అనుపమ ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసింది.

“నువ్వు కోటీశ్వరుల బిడ్డవు. రైలు ప్రమాదంలో నీ తల్లిదండ్రులు చనిపోయారు. నిన్ను ఒక లారీ డ్రైవర్ పెంచుకున్నాడు. అప్పుడు నీ వయస్సు పదేళ్ళు వుండొచ్చు. జ్ఞాపకం తెచ్చుకో....”

అనుపమ చిన్ననాటి సంగతులు జ్ఞాపకం తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తోంది.

సురేష్ జరిగిన కథంతా చెప్పాడు. ఆమె తాత నరేంద్ర భూపతి కోట్లు సంపాదించాడనీ, ఆ సంపదకు ఆమె ఏకైక వారసురాలనీ నిజం చెప్పేసరికి అనుపమకు మతిపోయింది.

“నా మాట విను. నీ భర్తని వదిలించుకుని నాతో వచ్చేసెయ్! నీకింకా పెళ్ళి కాలేదని మీ తాతతో చెప్పాను. ఆయన ఎంతో సంతోషిస్తాడు. లేకపోతే ఈ తాగుబోతు వాడినీ, వయసు మళ్ళినవాడినీ చూసి ఆయన అసహ్యించుకోవచ్చు” అన్నాడు సురేష్.

సురేష్ చెప్పేమాటలు వింటుంటే ఆమెకు అరచేతిలోనే స్వర్గం కనిపించింది. సినిమాలలో చూసే బ్రహ్మాండమైన సెట్టింగ్ లాంటి భవనం, కారు, నగలు ఆ వైభవం కళ్ళకు కట్టింది. ఆ సంపద అనుభవించాల్సిన తను తిండికి గతిలేక, మూడో పెళ్ళి తాగుబోతుతో జీవితం గడుపుతోందా? ఛీ....అనిపించింది.

"కాని అతన్ని వదిలించుకోవడం ఎలా?" అంది.

"నువ్వు నాతో రావడానికి ఒప్పుకో చాలు. అదంతా నేను చూసుకుంటాను."

"కిషన్ సంగతి మీకు తెలీదు. ఎంత డబ్బిచ్చి వదిలించుకున్నా వదలడు. జీవితాంతం నన్ను బ్లాక్ మెయిల్ చేస్తాడేమో!"

"అతను వుంటేగదా బ్లాక్ మెయిల్ చెయ్యడానికి?"

"అంటే?"

"మర్డర్."

అనుపమ గుండె దడదడలాడింది సురేష్ మర్డర్ అనగానే.

## 7

కిషన్ డ్యూటీనుంచి దిగేటప్పటికి పది దాటింది. అప్పట్నుంచి బస్ కోసం ఎదురుచూస్తున్నాడు. బస్‌లు వస్తున్నాయి, పోతున్నాయి. అన్నీ కిటకిటలాడుతున్నాయి. జనం ఫుట్‌పాతులమీదే నిలబడి పోతున్నారు.

కిషన్ కడుపులో మంటగా వుంది. ఉదయం క్యాంటీన్‌లో తిన్న రెండు పూరీలు ఒక మూలకిరాలేదు. కనీసం పదికిలోమీటర్లయినా పోవాలి బస్‌లో. బస్ దొరికిపోయేటప్పటికి పన్నెండవుతుంది. అతనికి విసుగ్గా వుంది. జేబులో రూపాయి కాగితం గూడా లేదు. నెలాఖరు. రాత్రి మందు లేకపోవడంవల్ల పిచ్చెక్కిపోయి నట్టుంది.

"కిషన్ భాయ్ !" అంటూ భుజంమీద ఎవరిదో చేయి పడేటప్పటికి వులిక్కిపడ్డాడు.

అతను టోపీ పెట్టుకున్నాడు. నల్ల కళ్ళద్దాలు.

లాల్చీ, పైజామా వేసుకున్నాడు.

కిషన్ ఆశ్చర్యంగా చూశాడు. ఎవరో గుర్తు రావడం లేదు.

"బాగున్నావా?" అన్నాడు అతనే మళ్ళీ.

"ఎవరు మీరు?" అన్నాడు కిషన్.

"అరె భాయ్ నన్నే గుర్తుపట్టలేదా! భలేవాడివే. డి.సి.యమ్.లో పనిచేసేవాడిని. నాలుగేళ్ళ క్రితం మానేసి సౌదీ అరేబియా వెళ్ళిపోయాను."

కిషన్‌కి అతనెవరో చచ్చినా గుర్తురావడంలేదు. కాని అలా అంటే బాధపడతాడేమోనని పొడిగా నవ్వి "నువ్వా భాయ్!" అన్నాడు.

"గుర్తుపట్టావు కదా! హమ్మయ్య పద అలా బార్ కెళ్ళి బీర్ కొడదాం. ఎవరూ తోడు దొరక్క చస్తున్నాను. ఒక్కడ్నే మందు కొట్టే అలవాటులేదు నాకు. ఎండ దంచేస్తోంది కదూ!" అన్నాడు అతను.

కిషన్‌కి బ్రహ్మానందం కలిగింది. ఏదెవడో గుర్తు రావడం లేదుగాని సమయానికి దేవుళ్ళా వచ్చాడు. రాత్రి మందు కొట్టకపోయేసరికి నాలిక పీక్కుపోతోంది.

ఏ.సి. బార్‌కి వెళ్లారు ఇద్దరూ.

"భాయ్! ఏమీ అనుకోకు. నీ పేరు గుర్తు రావడం లేదు" అన్నాడు కిషన్.

అతను పకపక నవ్వి "అవునులే ఎలా గుర్తుంటుంది. నేను ఆఫీసులో పనిచేసేవాడిని. నువ్వేమో ఫీల్డులో. అదీగాక నాలుగేళ్ళు దాటింది" అన్నాడు.

కిషన్ ఇబ్బందిగా కూర్చున్నాడు.

"నా పేరు సరే. నా ముఖమైనా గుర్తొచ్చిందా లేదా?"

"భలే వాడివే" అని నవ్వాడు కిషన్.

"నా పేరు రామ్‌లాల్" అన్నాడు.

చల్లటి బీర్ బాటిల్స్ టేబుల్ మీదకు వచ్చాయి. రామ్‌లాల్ గ్లాసుల్లోకి వంచి ఛీర్స్ చెప్పాడు.

చల్లటి ద్రవపదార్థం గొంతులోకి దిగుతుంటే స్వర్గంలో తేలుతున్నట్లుంది కిషన్‌కి. ఎత్తిన గ్లాసు దించకుండా స్వాహా చేశాడు.

"నీకు సారాయి అలవాటు. బీర్ ఏమి ఆనుతుందిలే. మరో బాటిల్ తెప్పించనా?" అన్నాడు రామ్‌లాల్.

"వద్దు భాయ్" మొగమాట పడుతూ అన్నాడు కిషన్.

"భలేవాడివే. నా దగ్గర సిగ్గుపడకు" అన్నాడు.

మరో రెండు బాటిల్స్ వచ్చాయి.

కిషన్ గ్లాసు ఖాళీ అవుతూ వుంటే రామ్‌లాల్ నింపుతున్నాడు.

"ఇక్కడ నౌకరీ మానేసి సౌదీ అరేబియా వెళ్ళి పోయాక దరిద్రం వదిలింది భాయ్. ఈ నాలుగేళ్ళలో ఖర్చులు పోను రెండు లక్షలు మిగిలాయి."

"నిజం?" అన్నాడు కిషన్.

"అబద్ధం చెప్పాల్సిన పనేముంది?"

"అబ్బే అదేం కాదు. అంతంత జీతాలిస్తారా అక్కడ?"

"మరేమనుకున్నావ్?"

"పోనీలే. బాగుపడిపోయావ్. ఇక్కడే వుంటావా?"

"ఎందుకు దరిద్రం. ఎల్లుండి వెళ్ళిపోతున్నాను. నెల సెలవు పెట్టి వచ్చాగాని ఇక్కడేం తోచడంలేదు."

"అలాగా?"

"ఏం నువ్వూ వస్తావా?"

"నేనా?"

"అవును భాయ్! వచ్చేయ్. ఇక్కడ ఎన్నాళ్ళున్నా గాజుల బేరం కూటికి సరి. మిగిలేదీ వచ్చేదీ లేదు."

"నన్ను తీసికెళ్తావా? వీలవుతుందంటావా?" ఆశగా అడిగాడు కిషన్.

"ఎందుకు వీలు కాదు. నాకు అక్కడ కొంచెం పలుకుబడి వుందిలే. నీకు ఏదోక నౌకరీ చూస్తాను."

"ఆ పుణ్యం కట్టుకో రామ్‌లాల్ భాయ్. నీ పేరు చెప్పుకుని బాగుపడిపోతాను" అన్నాడు కిషన్.

"అలాగే మరి నాకేమిస్తావు?"

"ఏం కావాలి?" అన్నాడు కిషన్.

రామ్‌లాల్ పకపక నవ్వి "నీ దగ్గరేముంది చిప్ప ఇవ్వడానికి. నీ సంగతి నాకు తెలీదా? సరదాగా అడిగాను. ఏమీ వద్దుగాని రాత్రికి పార్టీ ఇవ్వు" అన్నాడు.

"పార్టీయా?" కిషన్ గతుక్కుమన్నాడు. నెలాఖరు. జేబులో డబ్బు లేదు. అప్పిచ్చే నాథుడు లేడు.

"ఇదుగో ఈ డబ్బు నీ దగ్గరుంచు. బాభీతో చెప్పి దమ్‌కా ముర్గీ చేయించు. నేను వచ్చేటప్పుడు 'ఏ' క్లాస్ బ్రాందీ తెస్తాను" అన్నాడు రామ్‌లాల్.

రెండువందల కాగితాలు కిషన్ జేబులో కుక్కాడు.

"వద్దులే. భలేవాడివి భాయ్" అన్నాడు కిషన్.

"నా దగ్గర డబ్బు మూలుగుతూ వుంది. నీ దగ్గర పైసా లేదు. ఆ మాత్రం గ్రహించలేననుకున్నావా?"

ఇద్దరూ బార్ లోనుంచి బైటపడ్డారు.

ఆటో పిలిచాడు రామ్‌లాల్.

"ఎందుకూ బస్‌లో పోదాం."

"ఛీ....బస్‌లో వెళ్ళే అలవాటు లేదు" అన్నాడు రామ్‌లాల్.

"మీ ఇంటికి దారి చెప్పు. నిన్ను వదిలేసి నేను పోతాను."

కిషన్ తన ఇంటికి దారి చూపించాడు ఆటో డ్రైవర్‌కి.

ఆటో కిషన్ ఇంటిముందు ఆగింది. కిషన్ దిగాడు. రామ్‌లాల్ దిగలేదు. కిషన్ దిగి భోజనం చేసి వెళ్ళమని బలవంతం చేశాడు. అతను ఒప్పుకోలేదు. రాత్రి తొమ్మిది దాటాక వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు ఆటోలో.

# 8

కిషన్ ముఖం చిటపటలాడుతూ వుంటుంది మామూలుగా. ఈ రోజు ఎందుకో సంతోషంగా వున్నాడు. హుషారుగా వచ్చాడు ఇంట్లోకి.

"అతను ఎవరు?" ప్రశ్నించింది అనుపమ.

"నా దోస్తు. మా మిల్లులోనే పనిచేసేవాడు. నాలు గేళ్ళక్రితం నౌకరీ మానేసి సౌదీ వెళ్ళిపోయాడు. రెండు లక్షలు మిగిలిందట" అంటూ రామ్‌లాల్ తనను గూడా తీసికెళ్తానన్న విషయం చెప్పాడు.

తర్వాత హడావుడిగా మార్కెట్‌కి వెళ్ళి కోళ్ళు పట్టుకొచ్చాడు. రామ్‌లాల్ భోజనానికి వస్తున్నాడని పదే పదే చెప్పాడు. అనుపమ ఏడుగంటలకల్లా అన్నీ సిద్ధం చేసింది. ఆటోరిక్షా వస్తున్న శబ్దంకోసం చెవులు రిక్కించుకుని కూర్చున్నాడు కిషన్.

రాత్రి తొమ్మిదింటికి వచ్చాడు రామ్‌లాల్. ఆటోలో రాలేదు. నడిచే వచ్చాడు. చేతిలో అట్టప్యాకెట్ వుంది.

అది ఫుల్ బాటిల్.

"రా భాయ్! ఇంత ఆలస్యం చేశావేం?" అంటూ ఆహ్వానించాడు కిషన్.

ఇద్దరూ కూర్చున్నారు.

అన్నీ సిద్ధంచేసి ఒక మూల నిల్చుంది అనుపమ.

రామ్‌లాల్ తను నామమాత్రం గొంతులో పోసుకుంటూ అంతా కిషన్‌తోనే త్రాగించాడు. పదకొండు గంటలకు కిషన్ పని అయిపోయింది.

మత్తులోకి జారిపోయాడు.

రామ్‌లాల్ నవ్వుతూ అనుపమ దగ్గరికి వచ్చి భుజం మీద చేతులువేశాడు. ఆమె భయంతో గోడకు కరుచుకుపోయింది.

"నన్ను గుర్తుపట్టలేదా?" అంటూ టోపీతీశాడు.

"మీరా! సురేష్?" ఆశ్చర్యంగా అంది.

"నేనే! ఎలా వుంది నా వేషం?"

ఆమె ఆశ్చర్యంనుంచి తేరుకోలేదు.

"ఇక వీడు లేవడు. తెల్లవారి నువ్వు ఏడ్చి కెంతుకుని గోడవ చెయ్యి. శవాన్ని పూడ్చడానికి ఇదుగో ఈ డబ్బు వుంచు" అంటూ ఆమె చేతిలో కొంత డబ్బు వుంచాడు.

"ఏమిటి? చనిపోయాడా?" భయంగా అంది.

"ఇంకా లేదు. కాని చస్తాడు. జాగ్రత్తగా విను. నేను స్వామాట్ హోటల్ నుంచి మారిపోయాను. అశోక్ హోటల్ రూమ్ నెంబర్ 171. మూడో రోజున రాత్రికి నువ్వు రావాలి. నేను హైదరాబాద్‌కి బెర్తులు రిజర్వుచేసి వుంచుతాను. ఏం?"

ఆమె తల వూపింది.

సురేష్ జేబులోనుంచి సిరంజితీసి చిన్న బాటిల్ నుంచి మందు ఎక్కించి కిషన్ జబ్బలో గుచ్చాడు. కిషన్ కొంచెం కదిలాడు.

"ఇక వీడి పని అయిపోయినట్లే. నేనిక వస్తాను. చెప్పినవన్నీ జాగ్రత్త!" అన్నాడు సురేష్.

తర్వాత వీధిలోకి వెళ్ళిపోయాడు.

## 9

అనుపమ హోటల్ గదిలోకి వచ్చింది.

"హమ్మయ్య! వచ్చావు కదా! వస్తావో రావోనని టెన్షన్‌తో చస్తున్నాను" అన్నాడు సురేష్.

ఆమె నవ్వింది.

సురేష్ ఆమెకోసం తెచ్చిన ప్యాకెట్లన్నీ విప్పాడు. రకరకాల చీరలు, బ్లౌజులు, బ్రాలు, నగలు. సమస్తం వున్నాయి.

"చూడు అనుపమా! నువ్విప్పుడు పాత అనుపమవు కాదు. సరికొత్త రూపం ధరించాలి. నీకింకా పెళ్ళి కాలేదు. గుర్తుంచుకో మిస్ అనుపమా! నువ్వు కోటీశ్వరుడి ఏకైక వారసురాలివి. గతమంతా మర్చిపో" అన్నాడు.

అనుపమ బాత్‌రూమ్‌లోకి వెళ్ళి స్నానం చేసింది. అన్నీ అలంకరించుకుంది. ఆమె రూపం పూర్తిగా మారిపోయింది.

"వెరీ గుడ్!" అన్నాడు సురేష్ సంతృప్తిగా తల ఆడిస్తూ.

ఒక వాచ్‌మాన్‌గాడి పెళ్ళాం క్షణాలలో కోట్లకు అధిపతి కాబోతోంది. ఎంత విచిత్రం! నరేంద్ర భూపతి మనుమరాలిని చూసి ఎంత సంతోషిస్తాడో!

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" అంది ఆమె.

"ఏం లేదు. నిన్ను చూడగానే మీ తాతగారి రియాక్షన్ ఎలా వుంటుందా అని ఆలోచిస్తున్నాను."

"చాలా ఆనందిస్తాడనుకుంటాను" అంది.

"ఆనందంతో మూర్ఛపోతాడు."

ఆమె నవ్వింది.

"జీవితం ఎంత విచిత్రమైంది అనుపమా? యెప్పుడో సంవత్సరం క్రితం శారీరకమైన కోర్కె తీర్చుకోవడానికి నీ దగ్గరకు వచ్చాను. నీ రూపం నా మదిలో ముద్రపడి పోయింది. నీ చిన్నప్పటి ఫోటో చూసి గుర్తించగలిగాను. నా జ్ఞాపకశక్తివల్ల నువ్వు కోట్లకు అధిపతివి కాబోతున్నావు."

అనుపమ కృతజ్ఞతాపూర్వకంగా చూసింది అతన్ని.

"ఇక నీ జీవితం ఎంత మారిపోతుంది? కాలు భూమి మీద పెట్టనవసరంలేదు. పట్టుచీరలే తప్ప నూలుచీరలు ముట్టుకునే పనేలేదు. వజ్రాల నగలు, బంగారు గాజులు, చిటికవేస్తే నౌకర్లు, కార్లు, విమానాలలో ప్రయాణం.... ఓహ్! ఎంత వైభవంగా వుంటుందో....?"

అనుపమకు అవన్నీ కళ్ళముందు సినిమా రీళ్ళలా కదులుతున్నాయి.

"అనుపమా....!" సురేష్ ఆమె దగ్గరగా వచ్చి భుజంమీద చెయ్యివేశాడు.

"వూఁ...." అంది ఆమె.

"ఇప్పుడు ఎంత అందంగా వున్నావో తెలుసా? నిన్నెవరూ గుర్తించలేరు. అంత మారిపోయావు. డబ్బు మనిషి రూపాన్ని ఎలా మార్చేస్తుందో నిన్ను చూస్తే తెలుస్తోంది" అన్నాడు.

ఆమెకు ఏం చెప్పాలో తోచడంలేదు.

"నిన్నా మురికి కూపంనుంచి బైటపడేసి రక్షించాను. నిన్ను మహారాణిని చేశాను. మరి ప్రతిఫలంగా నాకేమి ఇస్తావు?"

ఆమె సురేష్ కళ్ళల్లోకి చూసింది. అతని కళ్ళల్లో కాంక్ష బుసలు కొడుతోంది. అతని మనసు తనను కోరుతోంది.

"మీకేం కావాలి?"

"నీ ప్రేమ!" అన్నాడు సురేష్.

ఆమె వులిక్కిపడింది.

"అవును అనుపమా! నన్ను ప్రేమించలేవా?"

"సురేష్! నా జీవితం మీకు తెలుసు. డబ్బుకోసం శరీరాన్ని అమ్ముకున్నాను. గతిలేక మూడో పెళ్ళి తాగుబోతుతో సంసారం చేశాను. అన్నీ తెలిసి నన్ను ప్రేమిస్తారా? నా గురించి ఏమీ తెలియకపోతే ఆ విషయం వేరు" అంది ఆమె.

"అదంతా గతం అనుపమా! పొరపాటున కూడా గుర్తు తెచ్చుకోకు. నీకు గతంలేదు. భవిష్యత్తు మాత్రమే వుంది."

సురేష్ ఆమెను గాఢంగా తన కౌగిలిలో బంధించాడు.

'అదృష్టమంటే తనదే. కోటీశ్వరుడి ఏకైక వారసురాలు తన గుప్పిట్లో వుంది' అనుకున్నాడు.

గర్వంతో అతని ఛాతీ పొంగింది.

## 10

నరేంద్ర భూపతి భవనాన్ని దిగ్భ్రాంతితో చూస్తోంది అనుపమ. ఆమె మనసులో ఆలోచనలు సుళ్లు తిరుగుతున్నాయి.

సురేష్ ఆమెకు స్వాగతం చెప్తూ ఒళ్ళొక్క అడుగే వేయిస్తూ లోపలకు తీసికెళ్ళాడు.

నరేంద్ర భూపతి ఆఫీస్ రూమ్‌లో కూర్చున్నాడు. అనుపమను తీసికెళ్ళాడు సురేష్.

"సార్! ఇదుగో మీ మనుమరాలు" మెరుస్తున్న కళ్ళతో అన్నాడు.

నరేంద్ర భూపతి అతన్ని చేతితో సైగచేశాడు బైటకు వెళ్ళిపొమ్మని. సురేష్ మనసు చివుక్కుమంది. తను ఎంతో కష్టపడి ఆమెను తీసుకొచ్చాడు, ఎంతో రిస్క్ చేశాడు. ఆఖరికి హంతకుడిగా కూడా మారాడు. ఆ ముసలాయనకి ఏ మాత్రం కృతజ్ఞత లేదే!

అతను చివ్వున గది బైటకు వచ్చాడు.

సురేష్ వెళ్ళిపోయాక నరేంద్ర భూపతి అనుపమ కళ్ళల్లోకి సూటిగా చూశాడు. కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి. ఆమెకు గుండెలో రైళ్ళు పరిగెడుతున్నాయి. భయంతో శరీరం వణుకుతోంది.

నరేంద్ర భూపతి కుర్చీలోనుంచి లేచి నెమ్మదిగా దగ్గరకు వచ్చాడు. ఆమె భుజంమీద చేతులు వేశాడు.

"అమ్మా నీ పేరేమిటి?"

"అనుపమ" ఆమె పెదవులు వణికాయి.

భూపతి ఆమె బ్లౌజును స్పర్శన చించాడు. ఆమె బిత్తరపోయింది. ఆమె వీపు తదేకంగా చూశాడు. లేసె రంగులో గుండ్రటి పుట్టు మచ్చ కనిపించింది. ఆయన మనసు పులకించి పోయింది.

"అమ్మా! అనుపమా! నువ్వేనమ్మా నా తల్లివి" అంటూ కౌగలించుకున్నాడు ఆమెను.

తర్వాత గది బైటకు వచ్చాడు. వస్తూనే అక్కడ

అసహనంగా పచార్లు చేస్తున్న సురేష్‌ని కౌగలించు కున్నాడు.

"సురేష్ నా మనుమరాలిని నాకు తెచ్చి ఇచ్చావు. నీకేమి ఇచ్చినా ఋణం తీరదు. కాని నిన్ను మొదట్లో అనుమానించాను. యెవరో ఒక పిల్లను తెచ్చి నన్ను నమ్మించాలని అనుకుంటున్నావేమోనని సందేహించాను. ఐయామ్ సారీ! సారీ మిస్టర్ సురేష్" భూపతి అతని చేతులు పట్టుకుని ప్రాధేయపూర్వకంగా అన్నాడు.

సురేష్‌కి ఇబ్బందిగా వుంది ఆయనలా తనని ప్రాధేయ పడడం. పెద్దపులిలాంటి అయ్యగారు సురేష్‌ని అలా ప్రాధేయపడడం చూసి నౌకర్లంతా ఆశ్చర్యచకితులై పోయారు.

"ప్లీజ్! సార్! నన్ను అలా అడగకండి. నాకు సిగ్గుగా వుంటుంది. మీరు నన్ను సందేహించడం సహజమే. మీ స్థానంలో యెవరున్నా అలాగే చేస్తారు. మీ రేమీ ఫీలవకండి" అన్నాడు సురేష్.

"సురేష్ ఈ శుభ సందర్భంలో నీకు ఒక కానుక ఇస్తున్నాను తీసుకో" అంటూ ఆఫీసు రూమ్‌లోకి వెళ్ళి చెక్ రాసి, సంతకం పెట్టి తెచ్చి ఇచ్చాడు.

చెక్ మీద అంకె లక్ష వేసి వుంది.

"సార్!" అన్నాడు సురేష్ అయోమయంగా.

"యస్. నా ఆనందంకొద్దీ ఇస్తున్నాను. తీసుకో" గర్వంగా అన్నాడు భూపతి.

సురేష్‌కి మతిపోయినట్లయింది.

## 11

మర్నాడు సురేష్ ఆఫీసుకు వెళ్ళాడు.

అంతా చుట్టుముట్టారు. కంగ్రాట్స్ చెప్తూ చేతులు

కలుపుతుంటే అతనికి మతిపోయింది.

"ఎందుకు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"మీకు తెలీదా? మీకు మేనేజర్‌గా ప్రమోషన్ వచ్చింది."

"మరి మన మేనేజర్?"

"ఆయన గుండె జబ్బుతో పోయారుగా!"

"అరెరె.... నాకు తెలీదే! పాపం...." అంటూ విచారించాడు సురేష్.

తర్వాత మేనేజర్ రూమ్‌లోకి వెళ్ళి కూర్చున్నాడు.

అతని మనసిప్పుడు గాలిలో తేలిపోతున్నది. తను ఈ కంపెనీకి మేనేజర్ అవుతాడని కలలో గూడా వూహించలేదు. ఎంత ఆశ్చర్యం? కారు, మేడ, టెలిఫోన్, టి.వి. అన్నీ ఇప్పుడు తన అందుబాటులోకి వచ్చాయి. మార్పు ఎంత త్వరగా జరిగిపోయింది? మేనేజర్‌కి గుండెపోటు రావడం, తను యజమాని ఇంటికి వెళ్ళడం, అక్కడ అనుపమను గుర్తించడం ...అంతా స్వప్నంలో మాదిరిగా జరిగి తనని వున్నత స్థానానికి తీసికెళ్ళాయి.

పర్సుతీసి బజ్జర్ నొక్కాడు. బంట్రోతు డోర్ నెట్టుకుని వచ్చి వినయంగా నిల్చున్నాడు. స్టాఫ్ మొత్తానికీ స్వీట్స్, కూల్ డ్రింక్‌లు తీసుకురమ్మని డబ్బిచ్చి పంపించాడు.

అందులోనుంచి బైటపడింది చెక్. నరేంద్ర భూపతి మనుమరాలు దొరికినందుకు కృతజ్ఞతపూర్వకంగా ఇచ్చిన చెక్.

అతనికి లక్షాధికారి కావాలని చిన్ననాటి కోరిక. అది ఈ నాటికి తీరింది.

కాని మానవుడికి తృప్తి అనేది లేదు. అది తాత్కాలిక మే. నిరంతరం అసంతృప్తితో సతమతమైపోతుంటాడు. అందని వాటిని సహితం అందుకోవాలని పాట్లు పడుతుంటాడు.

సురేష్ లక్షాధికారి అయినా, కంపెనీకి మేనేజర్ అయినా, అతనికింకా తృప్తిలేదు. ఇంకా చాలా సాధించాలని అనుకున్నాడు. అది అనుపమ. అనుపమ తన గుప్పిట్లో గువ్వ. ఆమెను పెళ్ళిచేసుకోవాలి. కోట్లకు అధిపతి కావాలి. విమానంలో దేశదేశాలు తిరగాలి.

సురేష్ తరచుగా నరేంద్ర భూపతి ఇంటికి రాకపోకలు సాగిస్తున్నాడు. తాతకి, మనుమరాలికి ఆత్మీయుడయ్యాడు. అనుపమ ఇప్పుడు చాలా మారిపోయింది. యువరాణీలా నాజూకుగా తయారైంది. ఆమెకు చదువు చెప్పడానికి గంటకో లెక్చరర్ ఇంటికి వస్తున్నాడు.

"అనుపమా! మనం పెళ్ళి చేసుకోవాలి?" అన్నాడు సురేష్ ఒకరోజు ఆమె ఒంటరిగా దొరికిన సమయం చూసి.

"కాని ఎలా సాధ్యం సురేష్?"

"ఏం?"

"నీకు పెళ్ళయింది. మర్చిపోయావా?" ఆమె గొంతు కఠినంగా పలికింది.

"అఫ్‌కోర్స్! నీ కోసం ఆమెను వదులుకుంటాను. నీ కోసం ఏమైనా చేస్తాను అనుపమా! ఐ లవ్ యూ!" ఆవేశంగా అన్నాడు.

"వద్దు సురేష్. నావల్ల మరొక స్త్రీ జీవితాంతం బాధపడకూడదు. నో.... పెళ్ళి ప్రస్తావన యెప్పుడూ తీసుకురాకు."

విసవిసలాడుతూ వెళ్ళిపోయాడు సురేష్.

'అనుపమ ఎంతలో మారిపోయింది? అగాధంలో వున్నదానిని అందలం యెక్కించాను. కూటికి గతిలేని దాన్ని కోట్లకు అధిపతిని చేశాను. ఏమాత్రం కృతజ్ఞత లేకుండా ప్రవర్తించింది.'

అతని మనసు కుతకుత వుడికింది. అక్కడొక క్షణం వుండలేకపోయాడు. కారులో కూర్చున్నాడు.

"బార్ కి పోనియ్యి" అన్నాడు.

బార్ లో కూర్చుని రెండు పెగ్గులు విస్కీ తాగాక మనసు శాంతించింది. ప్రశాంతంగా కూర్చున్నాడు.

'అనుపమ చెప్పిందిగూడా నిజమే. కోటీశ్వరుడి మనుమరాలు పెళ్ళయిన వాడిని ఎలా పెళ్ళి చేసుకుంటుంది? నరేంద్ర భూపతి మాత్రం ఒప్పుకుంటాడా? తను చేసిన సహాయానికి ఎంత డబ్బయినా ఇవ్వడానికి సిద్ధపడొచ్చు. కాని మనుమరాలినిచ్చి పెళ్ళి చేస్తాడా?'

సురేష్ మనసులో తుఫాన్ చెలరేగుతోంది. అంతులో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి. అందుకు కారణం మానవుడికి తృప్తిలేకపోవడమే.

## 12

కారు నగరం పొలిమేరలు దాటింది.

చీకటి పడొచ్చింది.

అప్పుడప్పుడూ వస్తూ పోతున్న వాహనాల చప్పుడు తప్ప నర సంచారంలేదు.

సురేష్ కారు రోడ్డు దించాడు. ఫర్లాంగు దూరం పోయాక ఆపాడు.

అనుపమ మౌనంగా కూర్చుంది.

"ఇక్కడ ఎంత హాయిగా వుంటుందో? చూడు"

అన్నాడు.

ఇద్దరూ కారు దిగారు.

కొండల నడుమ పెద్ద బండరాయి వేదికలా వుంది. దానిమీద కూర్చున్నారు.

"నిన్నింత దూరం ఎందుకు తీసుకొచ్చానో తెలుసా?" అన్నాడు సురేష్.

"వుహూఁ ..." అంది అనుపమ.

"తెలుసుకో చూద్దాం" అన్నాడు చిరునవ్వుతో.

ఆమె కొన్ని క్షణాలు ఆలోచించి "ఏవుంటుంది? నీకు పెళ్ళి పిచ్చి పట్టింది. అందుకు" అంది.

అతను నవ్వి "కరెక్టు" అన్నాడు.

"అవును అనుపమా! మన పెళ్ళికి ఇక ఏ అడ్డంకీ లేదు" అన్నాడు.

"అంటే?" ఆశ్చర్యంగా అంది ఆమె.

"నా భార్య ఇక లేదు."

"ఏమైంది."

"అడ్డు తొలగించాను."

"అఁ....ఎలా?"

"రేపు బంధువుల పెళ్ళి అని శుభలేఖ వచ్చింది. నాకు కుదరదు తనని వెళ్ళమన్నాను. సరే అంది. తెల్ల వారుజామున నాలుగు గంటలకు కారులో బయల్దేరాం. బస్ స్టాండ్ కి అని తను అనుకుంది. టాంక్ బండ్ మీద కారు ఆపాను. ఏదో రిపేరు అని బోనట్ ఎత్తాను. ఆమె రెయిలింగ్స్ దగ్గర నిల్చుంది. నేను దగ్గరగా వెళ్ళాను. కారు చెడిపోయింది అన్నాను. ఎలా? అంది. అటూ ఇటూ చూశాను. కార్లు, ఆటోలు ఏవీ రావడంలేదు. అమాంతం ఎత్తి హుస్సేన్ సాగర్లో పడేశాను. పీడ వది

లింది. రేపు శవం తేలుతుందనుకుంటాను" సురేష్ చెప్పడం ముగించాడు.

అదంతా విని అనుపమ సీరియస్‌గా అయిపోయింది. హేండ్ బ్యాగ్ తెరిచి పిస్టల్ తీసి గురిపెట్టి అతన్ని కాల్చింది. అంతా క్షణంలో జరిగిపోయింది.

కెవ్వున కేక పెట్టాడు సురేష్.

"అన్యాయం...." అతని పెదవులు హీనస్వరంతో పలికాయి.

ఆమె వికటంగా నవ్వింది.

"దుర్మార్గుణ్ని చంపడం అన్యాయం ఎన్నటికీ కాదు. నువ్వు దుర్మార్గుడివి. డబ్బుకోసం ఎందర్నయినా చంపుతావు. ఆ రోజు కిషన్ని చంపావు. ఈ రోజు నీ భార్యని చంపావు. నిన్ను నమ్మి పెళ్ళిచేసుకుంటే రేపు నన్ను చంపవని గ్యారంటీ ఏముంది? మనిషి నెత్తురు మరిగిన పులివి నువ్వు. నిన్ను బ్రతకనివ్వకూడదు. నీ పంజా నీడలో నాకు దినదిన గండమే. నువ్వు చావాలి."

అనుపమ మరొకసారి కాల్చింది.

సురేష్ దేహంలో చలనం ఆగిపోయింది.

అనుపమ కారు డ్రైవ్ చేసుకుంటూ నగరంవైపు బయ ల్దేరింది.

—: అయిపోయింది :—

# అమ్మాయిల బందిఖానా

బి. రాజేశ్వరి

"ఈ రాత్రికి యీ రహదారి బంగళాలో మన మొదటి మజిలీ. ఉదయం తిరిగి ఏడుగంటలకల్లా బయిల్దేరితే కేదారకోన పన్నెండు గంటలకు చేరుకోగలుగుతాం" అన్నది కౌసల్య. ఆమె బోటనీ లెక్చరర్.

అమ్మాయిలందరు బుద్ధిగా తలలూపారు.

ఉస్మానియా ఉమెన్స్ కాలేజి బొటానికల్ టూర్ కోసం ఫైనలియర్ బి.ఎస్సి. స్టూడెంట్సు కేదారకోనకు ఫీల్డు విజిట్‌కు బయల్దేరారు కౌసల్య సారథ్యంలో. కాలేజి మొత్తంమీద కౌసల్య సీనియర్ కావటమే కాక బొటనీ హెడ్.

మొత్తం అమ్మాయిలు ముప్ఫయి యిద్దరున్నారు. కౌసల్యకాక, మరో యిద్దరు లెక్చరర్సు—హేమలత, జమునాబాయి వెంట వచ్చారు. అకౌంటెంటు పరంధామయ్య, యిద్దరు అటెండర్లు, బస్ డ్రైవరు, క్లీనరు వాళ్ళతోబాటు వున్న తక్కిన సిబ్బంది.

ఉదయం పదిగంటలకు యూనివర్శిటీ కాలేజీనుంచి బయల్దేరిన బస్ రాత్రి ఏడుగంటలకు సింహపురి చేరింది. ముందుగానే సింహపురి రహదారి బంగళాలో ఓ రాత్రి విశ్రయించటానికి అధికారులనుండి అనుమతి తీసుకున్నది కౌసల్య.

వాళ్ళు సింహపురి బంగళా చేరేసరికి బహుశా వాచ్ మన్, యిద్దరు అటెండర్లు వాళ్ళని రిసీవ్ చేసుకోవటానికి సిద్ధంగా వున్నారు.

"మీలో వంట బాగా తెలిసినవాళ్ళు ముందుకురండి. ఓ గంటలో అందరికీ భోజనాలు సిద్ధం చేయాలి!" అన్నది కౌసల్య.

ముప్పయి యిద్దరు అమ్మాయిల్లో నలుగురు మాత్రం వంట చేయటానికి సిద్ధమయ్యారు.

"అరె, తక్కిన వాళ్ళెవరికీ వంట చేయటం చేతకాదా ఏం? చదువుకొంటున్నంత మాత్రాన వంట గది ముఖం చూడకూడదనే నియమం యేదీలేదే!" హేమలత వ్యంగ్యంగా అన్నది.

అమ్మాయిలు సిగ్గుపడ్డారు.

తమ వెంట తెచ్చిన వంటసామగ్రిని, సరకుల్ని బయటికి తీశారు. వంట కార్యక్రమం ప్రారంభించారు.

అందరు తమకు చేతనైన పనిచేసి, వంట తొందరగా పూర్తికావటానికి సహాయపడ్డారు.

సింహపురి రహదారి బంగళా విశాలంగా వుంది. బంగళాకి చుట్టు చక్కటి తోటకూడా పెంచటాన్నిబట్టి, అక్కడి అధికారుల అభిరుచికి చక్కటి నిదర్శనం!

పుచ్చ పువ్వులాంటి వెన్నెల బంగళామీద, పరిసరాల్లోనూ పిండారబోసినట్టు పరుచుకుని వుంది.

భోజనాలయ్యాక అందరు కాసేపు వెన్నెల విహారం చేశారు.

కౌసల్య అమ్మాయిలచేత పాటలు పాడించింది. కొందరు కవితలు ఆశువుగా చెప్పారు. మధ్య మధ్య హేమలత ఛలోక్తులు విసుర్తూ వాతావరణాన్ని మరింత ఆహ్లాదకరంగా చేస్తూ వచ్చింది. జమునాబాయి చిరునవ్వుతో అందర్నీ చూస్తూ వింటోంది. ఆమె స్వతహా రిజర్వుడుగా వుండే వ్యక్తి.

రాత్రి తొమ్మిదిన్నరకు అందరు విశాలమైన హాల్లో తమవెంట తెచ్చుకున్న కేంప్ కాట్స్ పరుచుకుని నిద్ర కుపక్రమించారు.

అకౌంటెంటు రామచంద్ర, అటెండర్లు, బస్ డ్రయివర్ యాదగిరి, బంగళా వాచ్‌మన్ తక్కిన అటెండర్లు బంగళా ముందు వరండాలో పక్కలు పరుచుకున్నారు. క్లీనరు బస్సులోనే పడుకున్నాడు.

"ఉదయం ఆరుగంటలకే అందరు లేచి సిద్ధంగా వుండాలి" అన్నది కౌసల్య అందరితోను.

## 2

ఉదయం స్నానాదికాలు ముగించుకుని, టిఫిన్ చేసుక తిని, సరంజామా అంతా సర్దుకుని బస్‌లో పెట్టుకున్నారు.

కౌసల్య అందర్నీ హడావిడిపెట్టి బయల్దేరతీసింది. ఆడవాళ్ళ అలంకరణ గురించి ఆమెకు బాగా తెలుసు. గంటలతరబడి ముస్తాబు చేసుకోవటానికే వున్న సమయం వ్యర్థం చేసే అమ్మాయిలు కౌసల్య మాట అల్లంతదూరంలో వినపడగానే చటుక్కున లేమిలి బస్ వంక పరుగులు పెట్టారు.

బంగళా వాచ్‌మన్, అటెండర్లు వాళ్ళకు గౌరవ

పురస్సరంగా వాళ్ళకు వీడ్కోలిచ్చారు.

అందరిలోను ఉత్సాహం వెల్లివిరుస్తోంది. కొద్ది గంటల్లో కేదారకోన చేరుకుంటున్నామన్న ఆనందం వాళ్ళను టెన్షన్ కి గురిచేస్తోంది.

బస్ బయల్దేరిన ఓ గంట వరకు ప్రయాణం బాగానే జరిగింది.

ఉన్నట్టుండి బస్ సడన్ గా ఆగిపోయింది.

అందరు ఊహాలోకాల నుంచి వాస్తవానికొచ్చారు. అంతవరకు సరదాగా కబుర్లు చెప్పుకుంటున్న వాళ్ళు మాటలు ఆపేసి రోడ్ వైపు దృష్టిసాగించారు.

ముందుగా కౌసల్య మాట్లాడింది.

“ఏమి యాదగిరీ, బస్ ఆపేశావు?” అన్నది.

యాదగిరి బోనెట్ ఎత్తి కొక్కాం తగిలిస్తూ, “ఇంజన్ లో ఏదో తేడా వచ్చినట్టుందమ్మా. చప్పుడవుతోంది!” అన్నాడు.

అందరు ఉస్సూరంటూ చూశారు అతని వంక.

యాదగిరి ఇంజన్ కాసేపు రిపేరు చేసి, యింజన్ స్టార్టు చేశాడు. బర్రుమంటూ వూరకే చప్పుడయిందేగాని స్టార్టు కాలేదు.

బస్ దిగి, ఆయిల్ టాంక్ టెస్టు చేసుకున్నాడు. ఆయిల్ సరిపడా వుందని నిర్ధారణ చేసుకున్నాడు. బస్ కింద దూరి ఓ పది నిమిషాలు పరీక్షించి బయటికొచ్చాడు క్లీనర్ కుర్రాడు.

“అంతా బానే వుంది గురూగారూ!” అన్నాడు వాడు యాదగిరితో.

యాదగిరి తలూపి, మళ్ళీ బస్ ఎక్కాడు.

స్టార్టు చేశాడు. కాని స్టార్టు కాలేదు.

అందరికీ నిరాశగానే వుంది.

కౌసల్య టెన్షన్ ఫీలవుతోంది. ప్రయాణం తెమలటంలేదు. వచ్చేముందు సర్వీసింగ్‌కి యిచ్చిన కాలేజి బస్ ట్రబులివ్వటం ఆమెకు అమితాశ్చర్యాన్ని కలిగించింది. అదే అడిగింది యాదగిరిని.

"ఇంజన్ ట్రబులిస్తుందని ముందుగా తెలీదా? సర్వీసింగ్ టైంలో దగ్గర లేవన్నమాట!" అన్నది.

యాదగిరి కంగారుపడి, "అదేం కాదమ్మా, నేను దగ్గరే వున్నాను.... నా అనుమానం, రాత్రి మనం బంగళాలో పడుకుని వున్న సమయంలో బస్‌ను యెవరో కావాలని పాడుచేశారని! నా అనుమానానికి ఆధారాల్లేకపోలేదు. ఇంజన్‌లోపల యెవరో కెలికినట్టు స్పష్టంగా కనిపిస్తోంది. స్పీడ్ మీటర్ దగ్గర కనెక్టెడ్ వైర్స్ కూడా రాంగ్ డైరెక్షన్ కలిపి, బండి న్యూట్రల్‌లో పెట్టడానికి వీల్లేకుండా చేశారు. ఇదంతా కావాలని చేసినపని!" అన్నాడు.

కౌసల్యతోపాటు అందరు విస్తుపోయి చూశారు.

"రాత్రి నువ్వు బస్‌లో పడుకోలేదా?" అడిగింది కోపంగా కౌసల్య.

"క్లీనరు బస్‌లో నే పడుకున్నాడమ్మగారూ! కాని, యెందుకో తెలీదుగాని మొద్దు నిద్రపోయాడు. తెల్లారి నేను తట్టి లేపేవరకు లేవలేకపోయాడు!"

ఓ గంట తర్వాత రిపేర్లు పూర్తిచేశాడు యాదగిరి. క్లీనర్, అటెండర్లు అతనికి సహాయపడ్డారు.

కౌసల్య తీవ్రంగా ఆలోచిస్తోంది. హేమలత, జమునాబాయికూడా ఆలోచనల్లో పడ్డారు. తమ బస్‌ను పాడు చెయ్యాల్సిన అవసరం ఎవరికుంది? ఎందుకు పాడుచేశారు?

తమకి ఏదయినా అపకారం తలపెట్టాలనే ఉద్దేశంతో కాదుగదా!

తనవంక సాభిప్రాయంగా చూసిన వాళ్ళిద్దర్నీ ఉద్దేశించి, కౌసల్య, "యాదగిరి ఏదో పొరబడుతున్నాడు. మన బస్‌ని కావాలని యెవరు పాడుచేసారు? అలా చెయ్యటంవల్ల వాళ్ళకొచ్చే ప్రయోజనమేమిటి? లేనిపోని అనుమానాలు పెట్టుకోవటం అనవసరం!" అన్నది.

అమ్మాయిలు ఆ విషయానికంత ప్రాధాన్యత నివ్వలేదు. ఎవరి మట్టుకువాళ్ళు ఏవో విషయాలు చర్చించుకుంటూ కాసేపట్లోనే ఆ సంగతి మరిచిపోయారు.

బస్ బయల్దేరింది. నిర్ణీత గమ్యం చేరేవరకు మళ్ళీ యెలాంటి ట్రబుల్ రాలేదు.

# 3

కేదారకోన సుందరమైన లోయలతోను, ప్రకృతి దృశ్యాలతోను, చెట్టు చేమలతోను చూపరుల దృష్టిని ఆకట్టుకుని కట్టిపడేస్తుంది. అప్పుడప్పుడు అక్కడికి యాత్రికులు వినోదార్థం రావటం కూడా కద్దు. అయితే అది వేసవికాలంలోనే తక్కిన సీజన్‌లలో అక్కడికి రావటానికి ఎవరూ ఇష్టపడరు. ముఖ్యంగా చలికాలం అయితే రక్తం గడ్డకట్టించేటంత చల్లగా వుంటుందక్కడ. వర్షాకాలం దార్లు సరిగ్గా వుండవని, అక్కడ జారుడుగా వుంటుందనీ, నీరు చుట్టూ చేరి అంతా చిత్తడిగా వుంటుందని—రావటానికి సంకోచిస్తుంటారు. వేసవికాలం ఒక్కటే కేదారకోనకు రావటానికి సరైన అదను.

కౌసల్య అందుకనే మార్చినెల మొదట్లో ఈ టూర్ ఫిక్స్‌చేసింది. అప్పటికింకా చలి పూర్తిగా పోలేదు.

ఎండలు ఇంకా ముదరలేదు. కేదారకోన కొండలమీద బాగా చలిగా వుంది.

అసలు కేదారకోనకే టూర్ వేసుకోవటానికి ముఖ్య కారణం లేకపోలేదు. కేదార కోనలో వున్నన్ని వృక్ష జాతులు, వివిధ రకాల మొక్కలు, ఫలపుష్ప వృక్ష సముదాయాలు మరెక్కడా లేవు. బోటనీ స్టూడెంట్సుకి కేదారకోన ఓ వరప్రసాదం! అక్కడ వాళ్ళకు ఉప యోగపడే ఎన్నో రకాల బొటానికల్ స్పెసిమెన్స్ వుండటమే అందుక్కారణం!

కౌసల్య స్టూడెంట్సందరికీ స్పాట్ చూపించి, వివిధ రకాల మొక్కలను, వాటి ప్రాముఖ్యతను క్లుప్తంగా చెప్పి, "మీరు రేపట్నుంచి వారంరోజులపాటు ఇక్కడి మొక్కలను, వాటి బొటానికల్ టరమ్స్‌ను బాగా స్టడీ చెయ్యండి! మీ అబ్జర్వేషన్స్ ఫీల్డు నోట్‌బుక్‌లో వివ రంగా నోట్ చెయ్యండి. మీకు ప్రతిక్షణం సలహా సహా యాలు అందచేసేందుకు నేను, హేమలతా మేడమ్, జమునాబాయి మేడం సిద్ధంగా వుంటాం!" అన్నది.

ఆడపిల్లలందరూ తలలూపారు.

"ఇప్పుడు యిక మన బసకు చేరుకుని మళ్ళీ రేపుదయం వద్దాం!" అన్నది కౌసల్య.

ఈలోపల యాదగిరి వచ్చాడు. అతను కేదారకోనకు వస్తూనే అందర్నీ దింపి, అక్కడకు అయిదు కిలోమీటర్ల మార్గంలో వున్న పల్లెటూరు రామవరం వెళ్ళివచ్చాడు. అక్కడ పంచాయితీ ఆఫీసు వాళ్ళకు బసకోసమని కేటా యించారు అక్కడి సర్పంచ్ రంగనాధరావు.

రంగనాధరావు కుమార్తె కౌసల్యకు ఓల్డు స్టూడెంటు. వాళ్ళ కాలేజిలోనే బి. ఎస్సి. పాసయింది. ఆ పరి

చయంతోనే రంగనాథరావు తమ రామవరంలో కౌసల్య బృందానికి చక్కటి వసతి సదుపాయాలను ఏర్పరిచాడు.

"సర్పంచ్ గార్ని కలిసి వచ్చానండమ్మా! మనకి కావలసిన ఏర్పాట్లన్నీ చేశారు అయ్యగారు" అన్నాడు యాదగిరి.

బస్ యిరవై నిమిషాల తర్వాత రామవరంలో వుంది. రంగనాథరావే స్వయంగా వచ్చి రిసీవ్ చేసుకున్నాడు. వాళ్ళకి మొత్తం పంచాయితీ ఆఫీసునంతా కేటాయించారు.

కౌసల్య రంగనాథరావుతో ముందే చెప్పేసింది.

"మేం యిక్కడ వుండే వారంరోజులు మా భోజన ఏర్పాట్లు మేమే చూసుకుంటాం. అందుకు మీరు అభ్యంతర పెట్టకూడదు!" అని.

రంగనాథరావు నొచ్చుకుని, "అదేమిటమ్మా, ఓ వారంరోజులపాటు యీ పిల్లలకింత అన్నం పెట్టలేక పోతానా? నా రమవంటి వాళ్ళే యీ బిడ్డలూను!" అన్నాడు.

కౌసల్య ఆయనతో సున్నితంగా చెప్పింది. "మీరు మాకు వసతి సౌకర్యం కల్పించటమే గొప్ప విషయం! ఇంక మిమ్మల్ని యిబ్బంది పెట్టడం మాకిష్టంలేదు!" అని.

రంగనాథరావు అయిష్టంగానే ఒప్పుకున్నాడు.

"ఈ రాత్రికి మాత్రం మీరంతా మా ఆతిథ్యం స్వీకరించితీరాలి! రేపట్నుంచి మీ ఇష్టప్రకారమే చేయవచ్చును" అన్నాడు.

కౌసల్య చిరునవ్వుతో తలూపింది.

# 4

మర్నాడుదయం రామవరంనుంచి బస్‌లో కేదార కోన స్పాట్‌కి చేరుకున్నారందరూ.

మొత్తం ముప్పయిరెండుమంది అమ్మాయిల్ని నాలుగు గ్రూపులుగా విభజించి అబ్జర్వేషన్‌కి కొన్ని లొకేషన్సు సూచించింది కౌసల్య. హేమలత, జమునాబాయి వాళ్ళకు ఫైడింగ్సు నోట్ చేయటానికి సహాయపడుతుండగా కౌసల్య అన్ని గ్రూప్సుని సూపర్‌వైజు చేస్తూ తిరిగింది.

మధ్యాహ్నంవరకు అలా సర్వే చేస్తూనే వున్నారు అమ్మాయిలంతా. వంట ప్రయత్నాలు స్పాట్‌లోనే జరిగాయి.

అమ్మాయిలకి యీ టూర్ చాలా ఆనందంగా వుంది.

సాయంత్రం రామవరం తిరిగిపోయారు.

మూడు రోజులు యిదే విధంగా గడిచాయి.

నాలుగోరోజు ఉదయం బస్‌లో స్పాట్ కొచ్చారంతా.

పదిగంటల ప్రాంతంలో కౌసల్య ఇద్దరు అమ్మాయిలు లేకపోవటం గమనించింది. ఓ అయిదు నిమిషాలు చూసింది. కాని, వాళ్ళు కనిపించలేదు.

కౌసల్యకి ఎందుకో అనుమానం వచ్చింది. హేమలతని పిలిచి చెప్పింది. ఆమెకూడా అమ్మాయిలందర్నీ పరీక్షగా చూసి, "అవును మేడం. నళిని, వసుధ కనిపించటంలేదు. నళిని గ్రూప్ టూ, వసుధ గ్రూప్ ఫోర్. ఇందాకటి వరకు నేను వాళ్ళకి కొన్ని ఫైండింగ్స్ నోట్ చేయటం వివరించాను కూడా" అన్నది ఆశ్చర్యంగా.

జమునాబాయి కూడా అంతక్రితం వాళ్ళని చూశానని చెప్పింది.

కౌసల్య కంగారుపడింది. లెక్చరర్సు యిద్దరికిగాని, తనకిగాని చెప్పకుండా ఆ యిద్దరు ఎక్కడికి వెళ్ళినట్లు?

కౌసల్య, హేమలత స్పాట్‌కి రెండు వైపులా పరీక్షగా చూస్తూ గాలించటం మొదలెట్టారు.

ఎక్కడా నళిని, వసుధల జాడ కనిపించలేదు.

బమునాబాయిని స్టూడెంట్సు పర్యవేక్షణ చూడమని కౌసల్య హేమలత కొండకి అవతలిపక్క ఏటవాలుగా వున్న ప్రదేశానికి దిగారు.

అక్కడ కనిపించిన దృశ్యం వారిద్దరిలోను కోపావేశాలను ప్రజ్వరిల్ల చేసింది.

అక్కడ నళిని, వసుధ ఇద్దరు యువకులతో చాదాపు ఒళ్ళో కూచున్నంత సన్నిహితంగా ఒకరినొకరు ఒరుసుకుని కూచుని తన్మయత్వంలో వున్నారు.

కౌసల్య, హేమలత ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

కౌసల్యకు ఆ యిద్దరు యువకులు అక్కడికి యెలా, ఎప్పుడు వచ్చారో, వాళ్ళతో తన స్టూడెంట్సుకి అంత సన్నిహితత్వం ఎలా ఏర్పడిందో బోధపడలేదు.

కోపంగా "నళినీ, వసుధా" అని పిలిచింది కౌసల్య.

ఒక్కసారిగా వాళ్ళు నలుగురు దూరంగా విడిపోయారు. మగాళ్ళు లేచి పరుగెత్తబోయారు.

"స్టాప్ దేర్!" అరిచింది కౌసల్య.

మగ్రాళ్ళిద్దరూ ఆగి వెనక్కి చూశారు.

నళిని, వసుధ ఎర్రగా కందగడ్డలా అయిన ముఖాలతో తల వంచుకుని నించున్నారు.

"ఏయ్ మిస్టర్, ఎవరు మీరు? ఇక్కడికెలా వచ్చారు? కమాన్ టెల్ మీ!" అన్నది కౌసల్య తర్జనితో వాళ్ళను

నూచిస్తూ అధికారపూర్వకంగా.

వాళ్ళిద్దరు నళిని, వసుధల వంక ఓసారి చూసి, "మేమూ యూనివర్సిటీ కాలేజీలోనే చదువుతున్నాం మేడమ్! నళిని, వసుధ మా బంధువులు అందుకని చూసి పోదామని....?"

"ఏమిటయ్యా చూసిపోయేది? వాళ్ళు యిప్పుడు మా ఆధీనంలో వున్నారు. వాళ్ళని కలుసుకోవాలంటే ముందుగా మా అనుమతి తీసుకోవాలనే కనీస జ్ఞానం లేదా మీకు? అయినా బొటానికల్ టూర్ మీద వచ్చిన పిల్లల్ని యిక్కడ కల్సుకోవటం తప్పని తెలీదా? ఇంకెప్పుడూ ఇలాంటి వెర్రిమొర్రి వేషాలు వెయ్యద్దు. మీ ప్రిన్సిపల్‌కి రిపోర్టు చేయవలసి వుంటుంది!" అన్నది కౌసల్య తీవ్రంగా.

"సారీ మేడమ్! ఫస్టెం వదిలెయ్యండి. మాకు నళిని, వసుధలమీద దురభిప్రాయం ఏదీలేదు. మా పెద్ద వాళ్ళు మా జంటలకు త్వరలోనే పెళ్ళిళ్ళు చేయటానికి నిర్ణయించారు...."

"డోంటాక్ అన్నెససరీ థింగ్స్! ప్లీజ్ గెటవుట్!" అన్నది కౌసల్య. ఆ మగపిల్లలిద్దరు తిరిగిచూడకుండా అక్కడ్నుంచి వెళ్ళిపోయారు.

కౌసల్య వసుధ, నళినివంక నిప్పులు రాలుస్తున్న చూపులో చూసి, "ఇది స్టడీ టూరనుకున్నారా, హనీ మూన్ అనుకున్నారా! మీలాంటి క్రమశిక్షణలేని పిల్లల వల్ల తక్కినవాళ్ళు చెడుమార్గాన నడిచే ప్రమాదముంది. మీమీద చర్య తీసుకోవలసి వుంటుంది!" అన్నది.

నళిని, వసుధ నిలువెల్లా వణికిపోతూ "క్షమించండి

మేడమ్! ఇంకెప్పుడూ ఇలాంటి పొరపాటు జరగనివ్వం!" అన్నారు ప్రాధేయపడుతూ.

"మైండ్ యువర్ బిజినెస్!" అన్నది హేమలత. క్షమించి వదిలెయ్యమని కౌసల్యవంక చూసింది.

కౌసల్య గుర్రుగా చూసింది.

నళిని, వసుధ బ్రతుకు జీవుడా అంటూ కొండపైకి ఎక్కిన స్టూడెంట్సుతో కలిసిపోయారు.

## 5

"వారం రోజులపాటు మమ్మల్నెంతో ఆదరంగా చూశారు మీ సహాయం మరచిపోలేను" అన్నది కౌసల్య రంగనాథరావుతో.

ఆయన మందహాసంచేసి, "మేము చేసింది చాలా తక్కువ. మీరే మీ భోజన ఏర్పాట్లు చేసుకున్నారు. ఈసారి ఈ సరంజామా ఏమీ తేనవసరంలేదని ముందుగానే చెబుతున్నాను. మీ తదుపరి ట్రిప్‌కి అన్ని ఏర్పాట్లు మేమే చూసుకుంటాం!" అన్నాడు.

కౌసల్య, హేమలత, జమునాబాయి స్నేహపూర్వకంగా నవ్వారు.

బస్ కదిలింది.

అమ్మాయిలంతా కేదారకోనలో తాము గడిపిన ఆ ఏడురోజాల, తమ అనుభూతుల్ని, అనుభవాల్ని నెమరు వేసుకుంటూ సీట్లోకి చేరగిలబడ్డారు.

ఉదయం ఎనిమిదిగంటలు కావస్తోంది.

"అమ్మా, మధ్యలో సింహపురి బంగళాలో పోట్లుండాలా?" అడిగాడు యాదగిరి తలతిప్పకుండానే.

"అక్కర్లేదు! మనం ఏకబిగిన ప్రయాణంచేస్తే రాత్రి పదకొండు గంటలకంతా హైదరాబాద్ చేరిపోతాం!

ఈమాత్రానికి మధ్యలో హాల్టు అనవసరం! మొన్న వచ్చే టప్పుడు అర్ధరాత్రి రామవరం చేరటం కష్టమని మధ్యలో సింహపురి బంగళాలో ఆగిపోయాం! అదీగాక వాళ్ళకు రిటన్‌లో ఆగుతామని ప్రోగ్రాం కూడా ఇవ్వలేదు" అన్నది కౌసల్య.

యాదగిరి తలూపాడు.

మధ్యాహ్నం లంచ్‌కి ఏదైనా వూళ్ళో హోటల్లో భోం చేయాలని నిర్ణయించుకున్నారు.

మధ్యాహ్నానికి బస్ సింహపురి దాటింది!

అక్కడినుంచి ఘాట్ రోడ్ మొదలవుతుంది. దాదాపు అయిదు కిలోమీటర్ల రోడ్ అది! అన్నీ మెలికలు పాము మెలికలు! ఎగుడుదిగుళ్ళు. అక్కడ ఫారెస్టు తాణా వుంది. రోడ్‌కి అయి యిటు గుబురుగా పెరిగిన చెట్లు, దూరంగా ఆకాశాన్నంటుతున్నాయా అన్నట్టున్న సర్వే చెట్లు!

యాదగిరి చటుక్కున బస్ ఆపాడు.

ఒక్క జర్కుతో బస్ ఆగింది. చల్లటి గాలికి హాయిగా నిద్రలోకి జారిపోయిన అమ్మాయిలంతా త్రుళ్ళిపడి లేచారు.

రోడ్‌కి అడ్డుగా పెద్ద పెద్ద రాళ్ళు పేర్చబడి వున్నాయి!

## 6

సమయం మధ్యాహ్నం పన్నెండు గంటలు! మరో అరగంట ప్రయాణం చేస్తే మాచవరం వస్తుంది. అక్కడ భోజనాలు చేయాలని యోచిస్తోంది కౌసల్య.

ఇంతలో యీ అవాంతరం!

"ఎవరో ఆకతాయి పిల్లలు రాళ్ళు అడ్డం పెట్టారమ్మ

గారూ!" అన్నాడు యాదగిరి కిందికి దిగుతూ. క్లీనర్ కూడా అతనితో దిగాడు.

రాళ్ళు అడ్డు తొలగిస్తూండగా ఒక్కసారిగా పది మంది సాయుధులైన వ్యక్తులు బస్సుని చుట్టేశారు.

కౌసల్య, హేమలత, జమునాబాయి చిన్నగా ఆక్రందన చేశారు. అమ్మాయిల ప్రాణాలు పైనేపోయాయి!

"ఎవరూ పిచ్చి పిచ్చిగా ప్రవర్తించవద్దు! మేం చెప్పినట్టు చెయ్యండి!" అన్నాడు అందులో నాయకుడిలాగా వున్న ఓ వ్యక్తి. అతని చేతిలో గన్ తిన్నగా యాదగిరికి గురిపెట్టబడి వుంది. తక్కినవాళ్ళు కూడా తుపాకీలు వాళ్ళకు గురిపెట్టి నిల్చున్నారు.

కౌసల్య ఆదేశం కోసం అందరు ఆమెవంకే చూస్తున్నారు. ఆమె మెదడు మొద్దుబారిపోయింది. ఈ సంఘటన ఊహించనిది!

దుండగులందరు బస్ యెక్కేశారు. తమ నగలు విలువైన వస్తువులు దోచుకుంటారేమోనని అమ్మాయిలంతా భయపడ్డారు. కౌసల్య కూడా అలాగే భావించింది.

కాని, వాళ్ళందరి ఊహలు తారుమారయ్యాయి.

నాయకుడు చివరగా బస్ ఎక్కాడు. ఎక్కేముందు దారికడ్డుగా వున్న రాళ్ళను తొలగించారు.

నాయకుడు యాదగిరిని బస్‌లోకి ఎక్కించాడు.

"నువ్వు మేం చెప్పినట్టు డ్రైవ్ చెయ్యి. ఏమాత్రం మొరాయించినా నీ చావు తప్పదు!" అన్నాడు.

యాదగిరి నిస్సహాయంగా చూశాడు కౌసల్యవంక.

క్లీనర్, అటెండర్లు, అకౌంటెంటు, అమ్మాయిలు అందరు—కౌసల్యవంకే చూస్తున్నారు.

కౌసల్య యాదగిరివంక సాభిప్రాయంగా చూసింది.

ఇప్పుడు తాము ఎదురుతిరిగి చేసేదేం లేదు. బస్‌ని ఏదో నిర్జన స్థలంలో ఆపి తమవద్దనున్న బంగారు ఆభరణాలు, విలువైన వస్తువులు దోచుకుంటారు. రోడ్ మీద మరే వైనా వాహనాలు వస్తాయేమోనని ముందు జాగ్రత్త కోసం వాళ్ళకు అనుకూలమైన స్థలానికి బస్‌ని తీసుకు పోయి నిలుపుతారు. ఇదివరకూ ఇలాంటి సంఘటనలు పేపర్లో వచ్చాయి.

అయితే అది అర్ధరాత్రి సమయంలో జరిగేది. ఇప్పుడు మిట్టమధ్యాహ్నం, పట్టపగలు జరుగుతోంది.

కౌసల్య నిస్సహాయంగా సీట్లో అసహనంగా కదిలింది.

దొంగల నాయకుడు చెప్పిన డైరెక్షన్స్‌లో యాదగిరి బస్‌ను తీసుకుపోతున్నాడు.

అందరి మనసులు భయంతో గిజగిజలాడుతున్నాయి. ఈ దొంగవెధవలు తమ ఆభరణాలు దోచుకున్నా ఫరవా లేదు, తమని క్షేమంగా వదిలేస్తే చాలునని వేయి దేవుళ్ళకు మొక్కుకుంటున్నారు.

కౌసల్య ఆలోచిస్తోంది! ఎవరో ముందుగా తమ బస్ ఆ దారిన వస్తున్న విషయం దొంగలకు చేరవేసి వుండాలి! అందుకే అంత ధైర్యంగా పట్టపగలు తమని దారి దోపిడీ చేస్తున్నారు. ఆడవాళ్ళు అబలలు అని తెలిసి, పగలే దారికాసి యిలా అఘాయిత్యానికి పూనుకున్నారు!

ఆమె మనసులో వసుధ, నళినీల బోయ్ ఫ్రెండ్స్ మెదులుతున్నారు. ఈ సంఘటనకి, వాళ్ళకి ఏమైనా సంబంధముందా? కాదేమో! వాళ్ళు నాలుగురోజుల క్రితమే కేదార్‌లోన వదిలిపోయారు. అయినా వాళ్ళ ప్రియురాళ్లు కూడా బస్‌లోనే వున్నారు. వాళ్ళకి

అపకారం తలపెడ్తారా? తన అనుమానానికి తనే నిందించుకుంది కౌసల్య.

"ఇక్కడ ఆపు!" అన్నాడు దొంగల నాయకుడు.

యాదగిరి బ్రేక్ వేసి బస్ ఆపాడు. కీచుమన్నాయి చక్రాలు!

అది ఘాట్ రోడ్ వదిలేసి దాదాపు రెండు మూడు ఫర్లాంగులు రాళ్ళు రప్పలతో నిండిన ప్రదేశం! చుట్టూ చెట్లు! బాగా గుబురుగా వున్న ప్రదేశంలో ఆపు చేయించాడు బస్! అక్కడ బస్ ఉనికి ఘాట్ రోడ్డున పోయే వాహనాలకు కనిపించే అవకాశం ఏ మాత్రం లేదు!

"దిగండి!" అన్నాడు నాయకుడు బస్ దిగుతూ. తక్కిన తొమ్మిదిమందీ తుపాకులు ఆడవాళ్ళకు గురిచేసి వుంచి అలాగే వుంచారు. వాళ్ళ టార్గెట్ నుంచి మగ వాళ్ళు కూడా ఎవరూ తప్పించుకుపోకుండా తుపాకులు రెండుగా పట్టుకున్నారు.

కౌసల్యతోబాటు తక్కిన వాళ్ళంతా ఆశ్చర్యంగా దొంగలకంకే చూస్తున్నారు. తాము ఊహించినట్టుగా వాళ్ళు తమ నగలని అడగలేదు! తమ సూట్ కేసుల్ని ముట్టుకో లేదు.

తమని ఏం చెయ్యబోతున్నారు?

ఈ ఆలోచన రాగానే అందరికీ ముచ్చెమట్లు పోశాయి.

కొంపతీసి ఈ దుర్మార్గులు తమని ...

వాళ్ళ ఆలోచనలు మధ్యలోనే ఆగిపోయాయి.

యాదగిరి అకస్మాత్తుగా ఓ అనుచరుడిమీదకు తిరగ బడి గన్ లాక్కున్నాడు.

ఊహించని యీ దాడి నెదుర్కోవటానికి ఆ అను

చరుడు సిద్ధంగా లేకపోయినా, నాయకుడు చాలా చురుగ్గా పని చేశాడు.

తుపాకిని గురిచూసుకోబోతున్న యాదగిరి చేతుల్లోంచి తుపాకి గాల్లోకి ఎగిరిపోయింది.

నాయకుడు విజయగర్వంతో నవ్వాడు.

యాదగిరి కుడిచేతినుండి ధారాపాతంగా నెత్తురు కారిపోతోంది!

."ప్రాణాలతో వదులున్నందుకు సంతోషించరా ఫూల్! బతకాలని లేదా?" అరిచాడు నాయకుడు.

అందరు యాదగిరి చొరవకు, తెగింపుకు ఆశ్చర్య పడ్డారు. అతని పరిస్థితికి బాధపడ్డారు.

"మీరందరూ మా వెంట మాట్లాడకుండా రండి. ఏమయినా వెర్రిమొర్రి వేషాలువేస్తే మావాళ్ళు నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తారు" నాయకుడు హెచ్చరించాడు.

కౌసల్య తన నిస్సహాయతను బయటపెట్టుకోలేక మౌనంగా తల వంచుకున్నది. తక్కినవాళ్ళు ఆమె పరిస్థితి గమనించి తాముకూడా మౌనం వహించారు.

ఇద్దరు అనుచరులు చకచక అందరి కళ్ళకు నల్లటి గంతలు కట్టేశారు. మగవాళ్ళను ఓ పక్కగా నిలబెట్టి చేతులు వెనక్కు తిప్పి వరసగా ఒకరికొకర్ని బంధాలు వేసేశారు. ఒకడు కదిలితే తక్కిన నలుగురు కదలవల సిందే.

ఆ తర్వాత నాయకుని కంఠం ఆజ్ఞాపించింది.

"ఒకరి వెనుక మరొకరు అలాగే నడవండి!" అని.

అందరూ క్యూలో నించున్నట్టు నించుని ఒకరి తర్వాత మరొకరు అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తూ ఓ సమతల ప్రదేశంలోకి వచ్చారు.

ఆ తర్వాత వాళ్ళ కళ్ళ గంతలు తొలగించబడ్డాయి.

అందరు కళ్ళు నులుముకున్నారు. ఓ అయిదు నిమిషాల పాటు ఎవరికీ కళ్ళు కనిపించలేదు.

"దిగండి!" అన్నాడు నాయకుడు.

అప్పుడు చూశారు అందరు అక్కడున్న చెక్క మెట్లను!

కిందికి ఏదో భూగృహంలా వుంది. చెక్కతో కూర్చిన మెట్లున్నాయి.

ఇద్దరు అనుచరులు ముందుగా దిగారు మెట్లుమీదుగా. తర్వాత మగవాళ్ళని దింపారు. ఆ వెనక ఆడపిల్లలంతా ఒకరి తర్వాత ఒకరు దిగారు. అందరు గుండె రాయి చేసుకుని కిందికి దిగారు. వాళ్ళు తమని ఏం చెయ్య బోతున్నారోనన్న వూహ వాళ్ళందరికీ తడుతూనే వుంది!

కౌసల్య మెల్లగా ఓ అమ్మాయి చెవిలో ఏదో వూదింది. అది అలా అలా ముప్పయి యిద్దరు అమ్మాయిలకి హేమలతకీ, జమునాబాయికీ చేరిపోయింది. తమ శీలానికి ప్రమాదం ఏర్పడే పక్షంలో అందరు సామూహికంగా తిరగబడి వాళ్ళని చంపెయ్యటమో తాము చావటమో తేల్చుకోవాలిగాని, యెట్టి పరిస్థితుల్లోను లొంగకూడదని!

అందరిలోను తెగింపు, చొరవ వచ్చేశాయి. విజయమో, వీర స్వర్గమో, అనే నినాదం గుర్తువచ్చి వాళ్ళ దేహాలు రోమాంచితాలయ్యాయి. దొంగలు తమ ఆభరణాలకి ఆశపడటంలేదన్న విషయం అందరికీ అప్పటికే అర్థమైపోయింది. ఇక తామందరు వయసులో వున్న ఆడపిల్లలు! తమ దగ్గర దోచుకునేందుకు కన్యాత్వమే కదా వున్నది—ఆభరణాలు తప్పిస్తే....!

కౌసల్యకు యిలాంటి అనుభవం ఎప్పుడూ యెదురు కాలేదు. అర్ధరాత్రి సమయాల్లో కూడా ఈ రోడ్డున ప్రయాణం చేసిన సందర్భాలున్నాయి. కాని ఎన్నడూ యిలాంటి దోపిడి దొంగల్ని గాని, అవాంఛనీయ సంఘటనల్ని గాని ఎదుర్కోలేదు.

మెట్లు పూర్తయి సొరంగంలోకి దిగారు అందరూ. అక్కడికి ఎక్కడినుంచో వెలుగు రేఖలు వచ్చి పడుతున్నాయి. నేలంతా చిత్తడిగా వుంది.

ఇద్దరు దారి చూపుతున్నారు.

వెనక అందరు అసంకల్పితంగానే కదిలి వెళ్తున్నారు!

చిత్రం! అదో చిన్న సైజు చెరసాలలా వుంది! అక్కడ అప్పటికే కొంతమంది అమ్మాయిలు కటకటాల గదుల్లో బంధింపబడి వున్నారు. వాళ్ళు కౌసల్య బృందాన్ని చూడగానే లేచి కటకటాల దగ్గరకొచ్చి తదేకంగా వాళ్ళనే చూడసాగారు. మీరూ చిక్కారా? అన్నట్టున్నాయి వాళ్ళ చూపులు!

వాళ్ళని చూశాక అందరిలోను తేలుకుండీల్లాంటి ప్రశ్నలు తలెత్తి వేధించాయి.

వాళ్ళు ఎవరు? తమలాగానే వీళ్ళచేతుల్లో చిక్కిన తమలాంటి ఆడవాళ్ళేనా? వాళ్ళని అలా చెరసాలలో బంధించినట్టు ఎందుకు బంధించారు?

అన్నీ ప్రశ్నలే! జవాబులేదు.

నాయకుడు అనుచరులవంక చూసి తలెగరేశాడు.

ఓ అనుచరుడు కుడిపక్కగా వున్న కటకటాల తలుపులు తెరిచాడు. కొంతమందిని ఆ గదిలోకి నడవమని ఆజ్ఞాపించాడు నాయకుడు.

మరో అనుచరుడు ఎడమపక్కగా వున్న కటకటాల తలుపులు తెరిచాడు. తక్కిన వాళ్ళను ఆ గదిలోకి నడిపించారు. తలుపులు మూసి తాళాలు వేశారు.

కౌసల్య, హేమలత ఓ గదిలోను, జమునాబాయి ఓ గదిలోను అమ్మాయిలతోబాటు బంధింపబడ్డారు.

పరంధామయ్యను, యాదగిరిని, క్లీనర్‌ని, యిద్దరు అటెండర్లని అలాగే తాళ్ళతో బంధించి వుంచారు.

అకాంటెంటు పరంధామయ్య అంతదాకా నిగ్రహంగా ఓర్చుకున్నవాడల్లా నాయకుడ్ని అడిగేశాడు.

"మమ్మల్ని ఎందుకు బంధిస్తున్నావు? ఏం కావాలి నీకు? బంగారం, వస్తువులు కోరి నువ్విలా చెయ్యటం లేదని మాకర్థమవుతూనే వుంది. ఇంకేం కావాలి....?"

నాయకుడు సారంగం ఎగిరిపోయేలా ఫెళ్ళున నవ్వాడు.

"ఓ ముసలోడా, యింతదాకా వూరుకుని యిప్పుడు మెరుగుతున్నావేమిటి? మమ్మల్నే ప్రశ్నించేటంత ధైర్యం వచ్చిందా నీకు?" అంటూ నూటిగా పరంధామయ్య దగ్గరకు వెళ్ళి ఫెళ్ళున చెంపలు రెండు వాయించాడు.

పరంధామయ్య బాధతో మూలిగాడు. నోటి చివర్ల నుండి సన్నగా నెత్తురు కారింది.

"పరంధామయ్యగారూ! ఇలాంటి మూర్ఖులతో సంవాదం పెట్టుకోకూడదు!" అన్నది కౌసల్య.

ఆమె నెత్తురు మరుగుతోంది. తమ అందరికన్న వయసులోన, అనుభవంలోను పెద్దవాడైన పరంధామయ్యను నాయకుడు హింసించటం చూసి ఆమె సహించలేకపోయింది.

"ఎవరూ నోళ్ళు మెదపవద్దు. మిమ్మల్ని యిక్కడికి

ఎందుకు తీసుకొచ్చానో, ఏం చెయ్యబోతున్నానో ముందు ముందు మీకే అర్థమవుతుంది అంతదాకా బుద్ధిగా పడున్నారా సరే, లేకపోతే మీ మాన ప్రాణాలు మీవి కావు!" అన్నాడు నాయకుడు అందరివంకా క్రూరంగా చూస్తూ.

ఆడవాళ్ళందరికీ ఆ నాయకుడిలో తాము చిన్నప్పుడు చదువుకున్న కథల్లోని ఒంటి కంటి రాక్షసుడు మెదిలాడు. రాజకుమార్తెలను బంధించి హింసించే రాక్షసుల కథలు కళ్ళముందు కదిలాయి. ఆ రాక్షసులకు ఏ మాత్రం భిన్నంగాలేడు యీ నాయకుడు.

సమయం మధ్యాహ్నం రెండుగంటలు దాటినా ఎవరికీ ఆకలి కావటంలేదు. ఆ స్పృహే లేదెవరికీ. తమ దురవస్థను తామే విలపిస్తున్నట్టు అందరూ మూగగా రోదిస్తున్నారు.

"అక్కడే బస్ దగ్గర ఎదురుతిరిగి చావో బ్రతుకో తేల్చుకోవలసింది మేడం!" అన్నది హేమలత ఉక్రోషంగా. కౌసల్య ఆమెవంక విషాదంగా చూసింది.

"మీరే నా స్థానంలో వుంటే అంతకన్న భిన్నంగా ప్రవర్తించి వుండరని నా నమ్మకం! చేతులారా ప్రాణాలు పోగొట్టుకోవటం తప్పితే వాళ్ళ నెదిరించి ఏం చెయ్యగలం....?" అన్నది కౌసల్య.

అమ్మాయిలంతా కన్నీళ్ళు నిండిన కళ్ళతో జాలిగా తమ ఉపాధ్యాయినులవంక చూస్తున్నారు.

నాయకుడు అందర్నీ ఉద్దేశించి అరుస్తూ చెప్పాడు.

"కాస్సేపట్లో మీకు భోజనాలు పంపించబడతాయి. తిని విశ్రాంతి తీసుకోండి!"

"నీ ఆతిథ్యం తగలడినట్టే వుంది" అన్నది హేమలత

కనిగా. జమునాబాయి, తక్కిన అమ్మాయిలు వాళ్ళ కెదురుగావున్న గదిలోనుంచి దీనంగా కౌసల్య వాళ్ళున్న గదివైపు చూస్తున్నారు. ఎదురుబొదురుగా వున్న కటకటాల గదులు!

మూడువైపులా కటకటాల గదులే! తాము లోపలికి ప్రవేశించిన సమతల ప్రదేశం మెట్ల దగ్గర్నుంచి ప్రారంభమయింది. అది మాత్రమే ఓపన్‌గా వుంది.

మూడోవైపు కటకటాల గదిలోని అమ్మాయిలు కూడా దాదాపు తమ వయసువాళ్ళే కావటం వాళ్ళకు ఆశ్చర్యంగా వుంది.

అందరు ఒకే వయసువాళ్ళని ఎత్తుకు తీసుకురావటంలో వీళ్ళ ఉద్దేశ్యం ఏమై వుంటుంది?

# 7

సాయంత్రం ఎప్పుడయిందో ఎప్పుడు చీకటిపడిందో గుర్తించే స్థితిలో లేరు వాళ్ళు. కాగడాల వెలుగు సొరంగంలో పరుచుకోవటాన్నిబట్టి చీకటిపడి వుంటుందన్న భావన వచ్చి వాచీలు చూసుకున్నారు.

సాయంత్రం అయిదు కావస్తోంది. బయటకన్న లోపలి వెలుగు తగ్గిపోవటం సహజం! అందునా సొరంగంలో పగలు రాత్రిళ్ళు ఒకేలా వుంటాయి! కాని ఈ సొరంగంలోకి ఎక్కడినుంచో పగలు వెలుగు వచ్చేలా ఏర్పాటు చేసుకున్నట్టుంది!

దొంగలు తెచ్చిపెట్టిన అన్నం పళ్ళాలు అలాగే వున్నాయి. మట్టి మూకుళ్లాంటి పాత్రల్లో కొంత అన్నం, సాంబారు ఏదో కూర వేసి అచ్చం ఖైదీలకు పంచినట్టే పంచారు దొంగలు.

ప్రస్తుతం వాళ్ళు దొరలు, తాము దొంగలు!

ఈ ఆలోచన రాగానే నీరసంగా నవ్వుకుంది కౌసల్య!

"వీళ్ళు మనల్ని ఏం చెయ్యబోతున్నారోనసే ఆలోచిన పక్కన పెట్టి, యిక్కడ్నుంచి తప్పించుకునే మార్గమేదన్నా వుందా అని ఆలోచించాలి!" అన్నది హేమలత.

కౌసల్య, తక్కిన పిల్లలు ఆమెవంక చూశారు.

"మనం వచ్చిన దారి గుర్తున్నది కదా. ఆ దారమ్మటే రోడ్ చేరిపోతే ఘాట్ రోడ్ వస్తుందని నా అంచనా. ఘాట్ రోడ్ చేరిపోతే ఏదో విధంగా మనకి సహాయం అందకపోదు!" అన్నది హేమలత.

కౌసల్య ఆమెవంక విడ్డూరంగా చూసి, "మనం ఈ రాక్షసుల బారినుండి తప్పించుకోగలమని మీకింకా నమ్మకం పోలేదన్నమాట!" అన్నది.

"ఆత్మవిశ్వాసం వుంటే ఏదైనా సాధించగలుగుతాం మేడం! మనమందరం తప్పించుకోనవసరంలేదు. యే ఒక్కరు తప్పించుకోగలిగినా, ఈ దుర్మార్గులు మనల్ని ఏమైనా చేయకముందే అందరికీ విముక్తి దొరుకుతుంది!"

కౌసల్య సాభిప్రాయంగా చూసిందామెవంక. కనీసం ఆ ఒక్కరైనా తప్పించుకోవటానికి కవకాశమేది? ఓ పక్క వేటకుక్కల్లా పదిమంది దొంగలు కాచుకుని వున్నారు. నలుగురు బయటకు వెళ్ళినా తక్కినవాళ్ళు అనుక్షణం తమని కావలి కాస్తూనే వున్నారు.

"నేను ప్రయత్నిస్తాను మేడమ్!" అన్న అమ్మాయి వంక కళ్ళు పెద్దవి చేసుకుని చూసింది కౌసల్య.

ఆమె వసుధ! తను చివాట్లు వేసిన అమ్మాయి.

"ఏమిటి నువ్వా నేది?"

"అవును మేడం! నేను తప్పించుకునే యత్నం చేస్తాను. ఆ ప్రయత్నంలో విజయం సాధించగలిగితే అందరకూ విముక్తి కలుగుతుంది. ఫెయిలయితే, నే నొక్కదాన్నే చస్తాను. నాకు చావంటే భయంలేదు!"

అంత నిబ్బరంగా చెప్తున్న ఆ పిల్ల మాటలు వింటున్న కౌసల్య విస్తుపోయి, ఆప్యాయంగా, ఆత్మీయంగా చూసింది వసుధవైపు. ఈ పిల్లని తను అపార్థం చేసుకుంది. బాధ్యతలేకుండా అల్లరిచిల్లరిగా అబ్బాయిలతో తిరిగే రకంలా నిర్ధారించుకుంది.

కౌసల్య కళ్ళు ఆనందంతో చెమ్మగిల్లాయి. వసుధను పక్కన చేర్చుకుని, "నిజంగానే అంటున్నావా యీ మాట?" అన్నది. ఆమెకు చాలా ఆనందంగా వుంది. తన అంచనా తప్పయినందుకు బాధకన్న, రాబోయే ప్రమాదంనుంచి తమను రక్షించేందుకు ఓ అమ్మాయి సిద్ధపడటం సంతోషాన్ని కలిగించింది.

"ఎలా వెళ్తావు? వాళ్ళందరు కాపలా వున్నారుగా!" అన్నది హేమలత వాళ్ళవంక చూస్తూ.

"అదే ఇప్పుడు ప్లాన్ చెయ్యాలి మేడం!" అన్నది వసుధ.

అందరూ దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టు ముఖాలే చెప్తున్నాయి.

రాత్రి భోజనాల సమయంలో నాయకుడు మళ్ళీ అందర్నీ ఉద్దేశించి చెప్పాడు.

"మీరు నిరాహార దీక్షలు సామూహికంగా చేసి సాధించేదేమీ లేదు. కడుపు మాడితే మీరే తింటారు, మిమ్మల్ని బతిమాలే ప్రసక్తి లేదు!"

అతని మాటలు విన్నాక తిండిలేక చావనైనా

చావాలిగాని, ఏం తినకూడదని నిర్ణయించుకున్నారందరూ.

ఖైదీలకు సరఫరా చేసినట్టు మట్టి మూకుళ్ళలో మళ్ళీ ఇంత అన్నం, సాంబారు, ఏదో కూరా తెచ్చి పదేశారు. కటకటాల తలుపులు తియ్యకుండానే కిందనున్న ఖాళీల గుండా మూకుళ్ళు లోపలకు తోసేశారు.

అకౌంటెంటు పరంధామయ్యా, డ్రైవర్ యాదగిరీ తక్కిన ఆరెండర్లు — ఆలాగే బంధింపబడి వున్నారు. వాళ్ళకి కూడా అన్నం పళ్ళేలు సరఫరా చేయబడ్డాయి. కాని ఎవ్వరూ ఆ మూకుళ్ళ జోలికి పోలేదు.

# 8

రాత్రి పదిగంటలు దాటి పదినిమిషా లయింది.

వసుధ లేచి నిలబడింది. అక్కడ కాపలా కోసమని యిద్దరు అను-చరులు వుంచబడ్డారు. తక్కిన ఎనిమిదిమంది-నాయకుడితోసహా ఎక్కడికి వెళ్ళారో తెలియదు.

వసుధ ఓ అనుచరుణ్ని సైగచేసి పిలిచింది.

వాడు దగ్గరగా వచ్చి నించుని ఏం కావాలన్నట్టు చూశాడు.

వసుధ సిగ్గు నటించి, "బయటకు వెళ్ళాలి! మళ్ళీ అయిదు నిమిషాల్లో వచ్చేస్తానుగా!" అన్నది.

అనుచరుడు వెనక్కు వెళ్ళి రెండో అనుచరుడితో ఏదో మాట్లాడి వచ్చాడు. చేతిలో తాళాలగుత్తి వున్నది. దాంతో ఓ తాళం వెతికి కటకటాల గది తెరిచాడు.

వసుధ బయటికి కాలుపెట్టగానే మళ్ళీ తాళం వేసేశాడు. ఆమెని అనుసరించబోయాడు.

వసుధ అతినిశంక కోపంగా చూసింది. "ఏమిటి నీ ఉద్దేశ్యం? నేను ఎందుకు బయటికొచ్చానో ఆ మాత్రం

అర్థం కాలేదా?" అన్నది.

అనుచరుడు వెనక్కి తగ్గాడు. "సరే! ఓ అయిదు నిమిషాలే, ఎక్కువసేపు వుంటే కుదరదు!" అన్నాడు.

వసుధ తలాడించింది.

అనుచరుడు అక్కడే నిల్చుండిపోయాడు. అయిదు నిమిషాలు....పది నిమిషాలు.

అనుచరుడికి అనుమానం వచ్చింది. చకచక వసుధ వెళ్ళినవైపు అడుగులు వేశాడు.

వసుధ కనిపించలేదు.

అనుచరుడు పిచ్చిగా అటు ఇటు పరుగులుపెట్టి వెతుకుతున్నాడు. వసుధ జాడలేదు.

అనుచరుడు భయపడుతున్నాడు. నాయకుడికి తెలిస్తే తన ప్రాణాలకు ముప్పు తప్పదని అతనికి తెలుసు! అందుకే హడావిడిగా సొరంగమంతా వెతికేస్తున్నాడు.

"ఇదిగో, దీని కోసమేనా వెతుకుతున్నావు?" అన్న మాటలు విని ఉలిక్కిపడి అటు చూశాడు అనుచరుడు.

తమ నాయకుడు! ఓ చేతిలో తుపాకీ, మరో చేతిలో వసుధ జుట్టు! వసుధని జుట్టుపట్టి బరబర లాక్కొస్తున్నాడు.

అనుచరుడితోబాటు కటకటాల గదుల్లో వున్న వాళ్ళందరు విస్తుపోయి చూస్తున్నారు.

నాయకుడు వసుధను ఒక తోపుతోశాడు. అమాంతం నేలమీద పడిపోయిందామె. మోకాళ్ళు మోచేతులు నేలకి కొట్టుకుని చెక్కుకుపోయాయి.

"ఏమే, ఇక్కడినుంచి తప్పించుకుపోగలననే అనుకున్నావా? ఈ అర్థరాత్రి నిన్నెవరు రక్షిస్తాడనుకున్నావు?" వ్యంగ్యంగా అంటున్నాడు నాయకుడు.

అతని పదజాలం అసహ్యంగా వుంది. వినేవాళ్ళకు జుగుప్స కలిగించేలా వుంది!

కౌసల్య, హేమలత తక్కిన ఆడవాళ్ళందరూ వసుధ వంక జాలిగా చూస్తున్నారు.

నాయకుడు వసుధ దగ్గరకొచ్చి మళ్ళీ జుట్టుపట్టి పైకి లేవతీశాడు. రెండు చెంపలు చెళ్ళు చెళ్ళున చరిచాడు. వసుధకి కళ్ళు తిరిగాయి. తూలి కిందపడిపోయింది.

"జాగ్రత్త. పిచ్చివేషాలువేస్తే ప్రాణాలు దక్కవు. బయటికి పోవటం అంత తేలికనుకున్నావా? ఫో లోపలికి!" అంటూ ఓ అనుచరుడికి సైగచేశాడు. ఎప్పుడు వచ్చారో తక్కిన ఏడుగురు అనుచరులు కూడా బిలబిలమని అక్కడ ప్రత్యక్షమయ్యారు.

వసుధని, తాళంతీసి కటకటాల గదిలోకి నెట్టేశాడు.

నాయకుడు వసుధని బయటకి వదిలిన అనుచరుడి దగ్గరకు అడుగులు వేశాడు. వాడు భయపడిపోయి నాయకుడి కాళ్ళమీద పడ్డాడు. నాయకుడు వాణ్ని పైకి లేపాడు. వికటంగా నవ్వాడు.

మరుక్షణం తుపాకీతో వాడిని కాల్చేశాడు. అనుచరుడు అమాంతం నేలకూలి ప్రాణాలు వదిలాడు.

తక్కిన అనుచరులు తలలు వంచుకుని నించున్నారు.

"జాగ్రత్త నాకు కోపం తెప్పించటానికి ప్రయత్నించవద్దు!" అన్నాడు.

• • •

"కాస్తలో తప్పించుకునే అవకాశం పోయింది. మెట్లెక్కి అవతలకి చేరిపోయాను. సరిగ్గా ఎక్కడ్నించి వూడిపడ్డాడో—తన అనుచరులతో వచ్చేశాడు. నన్ను

పట్టేసుకున్నారు" అన్నది వసుధ.

కౌసల్య బాధగా చూసింది. "చక్కటి అవకాశం చేజారిపోయింది. ఇక తప్పించుకోగలమన్న ఆశలేదు" అన్నది.

"ఏ మాత్రం అవకాశమున్న నేను పారిపోతాను" అన్నది వసుధ.

"ఈసారి దొరికిపోతే నిలువునా ప్రాణాలు తీసేస్తాడు దుర్మార్గుడు!" హేమలత అన్నది.

"నాకే భయం లేదు. మనవాళ్ళందరికోసం నా ప్రాణాలు బలిచేయటానికి సిద్ధంగా వున్నాను, అవకాశం రావాలిగాని!" అన్నది వసుధ.

"వీడు చాలా క్రూరుడు—తన మనిషినే నిలువునా చంపేశాడు. మనల్ని వదుల్తాడా?" కౌసల్య అన్నది.

ఇంతలో చిన్నరాయి దొర్లుకుంటూ వాళ్ళ మధ్యకు వచ్చి పడింది.

రాయికి చుట్టి ఓ చీటీ వుంది.

కౌసల్య చీటీ విప్పి చదివింది.

అందులో రెండే వాక్యాలున్నాయి.

"వీళ్ళు అమ్మాయిల్ని ఎందుకు నిర్బంధిస్తున్నారో తెలిసిపోయింది. అరబ్ దేశాలకు అమ్మాయిల్ని దొంగచాటుగా రవాణా చేస్తున్నారు. ప్రస్తుతం షిప్పు రావటంకోసం ఎదురు చూస్తున్నారు. రాగానే అందర్నీ అందులో రవాణా చేసేస్తారు!" అని వున్నది అందులో.

కౌసల్య చదివి, పరంధామయ్యవైపు చూసింది. ఆ దస్తూరీ ఆయనదే! కౌసల్యకి తెలుసు.

పరంధామయ్య మౌనంగా తలూపాడు.

క్షణాలమీద విషయం అందరికీ తెలిసిపోయింది. అందరు భయభ్రాంతులై దీనంగా ఒకరినొకరు చూసుకుని మౌనంగా రోధిస్తున్నారు.

అర్థరాత్రి అయినా యెవరూ నిద్రపోవటంలేదు. కటకటాల గదుల్లో కటిక నేలమీద కూలబడి విలపిస్తున్నారు.

## 9

"సార్, మనం కట్లు తెంచుకుంటే, వీళ్ళమీద అకస్మాత్తుగా దాడిచేసి తుపాకీలు వశపరచుకోవచ్చు. కనీసం రెండు తుపాకీలు దొరికినా చాలు, ఎలాగో బయటపడి మనవాళ్ళకి పోలీసు రక్షణ సంపాదించవచ్చు" అన్నాడు యాదగిరి గుసగుసగా.

పరంధామయ్య, అటెండర్లు, క్లీనరు అతని మాటలు జాగ్రత్తగా విన్నారు.

"అది అంత తేలికని నేననుకోవటంలేదు. ఏమాత్రం తేడాపాడా వొచ్చినా నిర్దాక్షిణ్యంగా కాల్చి పారేస్తారు వీళ్ళు" పరంధామయ్య అన్నాడు.

"మనకెలాగూ చావు తప్పదు. చచ్చేలోపల మన వాళ్ళను విడిపించి రక్షించగలిగితే చాలు!"

పరంధామయ్య తల విదిలించాడు.

"అ కాగడా దాకా వెళ్ళగలిగితే కట్లు కాల్చెయ్య వచ్చును. ప్రయత్నిద్దాం" అన్నాడు.

అయిదుగురికీ లింకు బంధం వేసేశారు. ఒకడు కదిలితే అయిదుగురూ కదలాల్సిందే!

పరంధామయ్య చుట్టూ పరికించి చూశాడు.

నాయకుడు, ఆరుగురు అనుచరులు యెక్కడికో వెళ్ళారు. బహుశా చచ్చిన అనుచరుడ్ని పూడ్చెయ్య

టానికి పోయారేమో! ఇద్దరు అనుచరులు మళ్ళీ యథా విధిగా కాపలా వున్నారు. చచ్చినవాడి స్థానంలో మరొక డున్నాడు.

పరంధామయ్య యాదగిరి తక్కిన ముగ్గురు కాగడా వైపు కదిలారు. ఒక్కో అడుగే అటు వేస్తున్నారు. అనుచరులు నిద్రమత్తులో జోగుతున్నారు.

కాగడా దగ్గరకు చేరుకున్నారు. కాగడా ఎత్తులో వుంది. ఏదయినా ఎత్తయిన రాయో మరేదో వేసుకుంటే గాని కాగడా అందదు

యాదగిరి చుట్టూ చూశాడు. దూరంగా బండరాయి వున్నది. కాని దాన్ని దొర్లించి తెచ్చుకునేంగు కవకాశం లేదు—అనుచరుల దృష్టిలో పడక తప్పదు!

కౌసల్య—యాదగిరి, పరంధామయ్యల ప్లాన్ అర్థం చేసుకున్నది. యాదగిరికి సంజ్ఞ చేసింది.

అయిదుగురు కౌసల్య వున్న కటకటాల గదివైపు జరిగారు. అనుచరులు చూస్తున్నపుడు ఆగిపోయి, వాళ్ళు గమనించనప్పుడు ఒక్కో అంగుళమే జరుగుతూ కటకటాల గది చేరుకున్నారు. కటకటాల వెనక్కు తమ బంధనాలు వచ్చేలాగా నిల్చున్నారు.

క్షణాల మీద కౌసల్య, తక్కిన అమ్మాయిలు వాళ్ళ బంధనాలు విప్పేశారు.

అంతే, యాదగిరి తక్కిన వాళ్ళకు సైగచేసి ఒక్క సారిగా నిద్రమత్తులో జోగుతున్న అనుచరు లిద్దరిమీదికి దాడిచేశారు. వాళ్ళు తుపాకులు చేతుల్లోకి తీసుకునే లోపలే వాళ్ళిద్దర్నీ తాళ్ళతో బంధించేశారు.

అనుచరులు అరవబోయారు. యాదగిరి సంకోచించ కుండా యిద్దర్నీ కాల్చేశాడు.

అదే అతనుచేసిన పొరపాటు!

బుల్లెట్ల శబ్దం సారంగంలో మారుమ్రోగింది.

మరుక్షణం ఎక్కడినుంచో నాయకుడు ఆరుగురు అనుచరులు బిలబిలమంటూ వచ్చేశారు.

వాళ్ళని చూస్తూనే యాదగిరి గురిచూసి కాల్చాడు. కాని ఏడు తూటాలు ఒకేసారి అతని శరీరాన్ని తూట్లు పొడిచాయి.

'అబ్బా' అంటూ నేలవాలిపోయాడు యాదగిరి.

అనుచరులు యిద్దర్ని నేలకూల్చాడు తనతోపాటు.

ఇక నాయకుడు, అయిదుగురు అనుచరులు మిగిలారు.

యాదగిరికి తప్ప తక్కిన నలుగురికీ తుపాకీ పట్టడం రాదు. పరంధామయ్య, అలెండర్లు, క్లీనరు నిస్సహాయంగా నిల్చుండిపోయారు.

నాయకుడు వాళ్ళ నలుగుర్నీ సమీపించి, "ఏరా మిమ్మల్ని యెవర్రా విడిపించింది? ఈ ఆడవాళ్ళేనా! వీళ్ళని మిమ్మల్ని కూడా అంత తేలిగ్గా వదలను. నలుగురు మెరికల్లాంటి నా వాళ్ళను చంపాడు మీ డ్రయివర్. నేను తల్చుకుంటే ఈ క్షణమే మీ అందర్నీ ముక్కలు ముక్కలుగా కోసి, చిత్రవధ చేసి చంపగలను. కాని మిమ్మల్ని చంపటం నా ఉద్దేశ్యంకాదు! నా క్కావల సింది అమ్మాయిలు. ఆ ముగ్గురు ముసలమ్మల్ని, మీ మగ వెధవల్ని నా పనయిపోయాక వదిలేద్దామనుకున్నాను. కాని మీలో ప్రతిఒక్కడూ, ప్రతి ఆడదీ ప్రమాదకరమైన వ్యక్తుల్లాగా నే కనిపిస్తున్నారు!"

అంటూ కౌసల్య వాళ్ళున్న గది దగ్గరకు చేరి, "వీళ్ళ బంధాలు ఎవరు విప్పారు? చెప్పండి, లేకపోతే మీ ఆడవాళ్ళందర్నీ ఈ క్షణమే నగ్నంగా నించోబెట్టి మీ

పరువుతీస్తాను!" అన్నాడు క్రూరంగా.

అమ్మాయిల గుండెలు గుబగుబ లాడాయి. యిలాంటి అవాంతర పరిస్థితిని ఎప్పుడో అప్పుడు ఎదుర్కోవలసి వస్తుందని వాళ్ళు ఎదురుచూస్తూనే వున్నారు.

నాయకుడి మాటలు వాళ్ళమీద బాగా పనిచేశాయి.

అన్నట్టుగానే వాడు, వాడి అనుచరులు తమని నగ్నంగా చేసి....

గుండెలమీద చేతులు వేసుకున్నారు భయంగా.

"చెప్పరేం? ఎవరు వీళ్ళ కట్లు విప్పదీసింది?" గర్జించాడు నాయకుడు.

"నేనే!" అన్నది గంభీరంగా కౌసల్య.

"ఓ ముసలిదానా, నువ్వా? నువ్వొక్కదానివేకాదు. ఇంకా తక్కినవాళ్ళు కూడా వుండివుంటారు. వాళ్ళెవరో చెప్పండి. లేకపోతే మొత్తం మీ అందర్నీ గుడ్డలూడదీసి నేలమీద పార్లిస్తాను."

అమ్మాయిలు వినలేనట్టు చెవులు మూసుకున్నారు.

నాయకుడు కటకటాల్లోంచి చెయ్యిచాచి కౌసల్య చెంపలు చెళ్ళు మనిపించాడు.

బాధని పళ్ళబిగువున ఆపుకున్నదామె.

"ఏమే. తక్కిన వాళ్ళెవరంటే చెప్పరేం? అందర్నీ నేలమీద పార్లించేవరకు చెప్పరా?"

నాయకుడు ఓ అమ్మాయి చీరపట్టుకుని లాగేశాడు.

అమ్మాయిలంతా భయంగా ఆర్తనాదాలు చేశారు.

నాయకుడు వికటంగా నవ్వాడు. తక్కిన అనుచరుల వంక చూసి సైగచేశాడు. వాళ్ళు కూడా నాయకుడి పక్కకువచ్చి కటకటాల్లోనుంచి చేతులు చాచారు.

సరిగ్గా అదే సమయంలో చెక్కమెట్ల దగ్గర చప్పు

డయింది.

నాయకుడితో బాటు అందరి దృష్టి మెట్లవైపు మళ్ళింది. మెట్ల దగ్గర ఎవరో వ్యక్తి నించున్నాడు.

"దొరా, ఓపెప్పొచ్చింది!" అన్నాడా వ్యక్తి.

నాయకుడు తను చేస్తున్నపని వదిలేసి, "అలాగా! మంచి కబురు తెచ్చావు. మనవాళ్ళు వస్తున్నారా?" అన్నాడు చకచక ఆ వ్యక్తివైపు కదుల్తూ.

రేపు వస్తారు. ఓప్పు రేపు రాత్రికి తిరిగి బయల్దేరుతుంది..."

నాయకుడు అనుచరులవంక సైగ చేసి, "మీరు ఎక్కడకీ పోకుండా జాగ్రత్తగా కాపలా వుండండి. నేనిప్పుడే వస్తాను" అని చెప్పి వచ్చిన వ్యక్తితో వెళ్ళిపోయాడు.

అమ్మాయిలందరి ప్రాణాలు కుదుటపడ్డాయి.

అనుచరులు పరంధామయ్యను, ఆ టెండర్లను, క్లీనర్ని మళ్ళీ తాళ్ళతో బంధించేశారు.

## 10

"కాస్తలో మనకు విముక్తి కలగాల్సింది తప్పిపోయింది" అన్నది హేమలత విచారంగా.

అమ్మాయిలందరు కౌసల్యను సమీపించి, "మేడం, మా గురించి ఆ రాక్షసుడి చేతిలో దెబ్బలు తిన్నారు" అంటూ కన్నీళ్ళు పెట్టుకున్నారు.

"దట్సాల్ రైట్! మనం బయటపడే దారి యిక శాశ్వతంగా మూసుకుపోయింది. మనకోసం పాపం మన యాదగిరి ప్రాణత్యాగం చేశాడు. అతను చేసిన సేవ సామాన్యమైనది కాదు" అన్నది కౌసల్య నెత్తుటి మడుగులో పడున్న యాదగిరిని చూస్తూ.

అందరు యాదగిరికి శ్రద్ధాంజలి ఘటించారు.

ఎదుటి గదినుంచి జమునాబాయి, తక్కిన అమ్మాయిలు యాదగిరినే చూస్తున్నారు.

కౌసల్య అమ్మాయిలవంక తిరిగి, "మీకు షూట్ చెయ్యటం వచ్చుకదా!" అన్నది.

"వచ్చు మేడమ్! ఎన్.సి.సి.లో నేర్పించారు కదా!" అన్నారు అందరు ఏకకంఠంతో.

"నెమ్మదిగా మాట్లాడండి. ఆ రాక్షసులు యిటే చూస్తున్నారు....వినండి....ఏమాత్రం వీలున్నా వాళ్ళ దగ్గర్నుంచి తుపాకీలు లాక్కుని వాళ్ళని ఎదుర్కొందాం. షిప్పు వచ్చిందని వార్త వచ్చింది. మీ అందర్నీ షిప్పులో అరబ్ కంట్రీస్‌కి రవాణా చేయటం ఖాయం! మాన ప్రాణాలు పరాయివాళ్ళకి తాకట్టు పెట్టుకునే కన్న ప్రాణాలు త్యాగం చెయ్యటమే మేలు! ధైర్యంగా ఎదుర్కొని పోరాడదాం. శత్రువుల్ని చంపలేకపోయిన పక్షంలో ఆత్మ త్యాగం చేద్దాం!" కౌసల్యలో ఉద్రేకం పొంగిపోయింది.

"అలాగే మేడం! మేము సిద్ధంగా వున్నాం!" అందరిలోను ఉత్తేజం ఉప్పెనలా ఉప్పొంగింది.

ఓ గంట తర్వాత నాయకుడు తిరిగొచ్చాడు.

అనుచరుల్ని పిలిచి మంతనాలాడాడు. మధ్య మధ్య కొన్ని మాటలు కౌసల్య వాళ్ళకు వినిపించాయి.

"సరుకు కొనుగోలుకి ఫారూక్ వస్తున్నాడు. ఈసారి మనకి బాగానే గిడుతుంది. సరుకు హేండోవర్ చేసి మనం కూడా యిక్కడ్నుంచి దుబాయి వెళ్ళిపోదాం!" అంటున్నాడు నాయకుడు ఉర్దూలో.

అనుచరులు "అచ్ఛాసాబ్" అన్నారు.

కౌసల్యకు మధ్య మధ్య కొన్ని మాటలు అర్థమయ్యాయి. వాళ్ళ మాటల్నిబట్టి వాళ్ళు కూడా విదేశీయులని, వాళ్ళలాంటి ముఠాలు కొన్ని అంతర్జాతీయ స్మగ్లింగ్ చేస్తున్నాయనీ, ముఖ్యంగా అమ్మాయిలను ఎగుమతి చేస్తున్నారనీ గ్రహించిందామె.

ఆమె పిడికిళ్ళు బిగుసుకున్నాయి. వీళ్ళను ఎలాగైనా ప్రభుత్వానికి అప్పచెప్పాలి. అది సాధ్యమా? ముందు తనకి వీళ్ళనుంచి తప్పించుకునే దారి కనిపించటంలేదు. వీళ్ళని ప్రభుత్వానికి పట్టించటం కూడానా....!

తన అవివేకానికి తనకే నవ్వొచ్చింది.

ఆమె ఆలోచనలు చెదిరిపోయాయి.

నాయకుడు మంతనాలు పూర్తిచేసి లేచాడు.

కాసేపట్లో తమని కొనుక్కోవటానికి ఆ ఫారూక్ ఎవడో వస్తాడు. తమని యీ రాక్షసుడు నిర్దాక్షిణ్యంగా వాళ్ళకు అమ్మేస్తాడు! ఆ తర్వాత తాము తప్పించుకునే దార్లు శాశ్వతంగా మూసుకుపోతాయి! త్వరపడాలి!

కౌసల్యకి మరో విషయం కూడా అర్థమయింది. తమ కోసం ఈ రాక్షసులు సింహపురిలో తాము బయల్దేరినప్పట్నుంచీ వేటాడుతూనే వున్నారు. బహుశా వీళ్ళే బంగళాముందున్న బస్ ఇంజన్ పాడుచేసి, వైర్లు రాంగ్ కనెక్షన్స్ యిచ్చారు. అయితే ఎందుకో తమని బంధించలేకపోయారు. బహుశా తమ బస్ ఆగిపోయిన ప్రదేశం వాళ్ళ స్థావరానికి దూరంగా వుండటం కారణం కావచ్చు! ఇప్పుడు తమ తిరుగు ప్రయాణంలో అందుకే తేలిగ్గా తమని బంధించగలిగారు.

కౌసల్యకి మబ్బు తెర విడిపోయింది.

కౌసల్య అటు యిటు చూసింది. యాదగిరి అనుచరుల దగ్గర్నుంచి లాక్కున్న రెండు తుపాకీల్లో ఒకటి కట కటాలకి పక్కనే పడుంది. మరో తుపాకీ యాదగిరి చేతుల్లోనే వుందింకా. బహుశా అందులో బుల్లెట్సు అయిపోయుంటాయి.

కౌసల్య దృష్టి తమకు సమీపంలో పడున్న తుపాకీ మీదనే వుంది! దాన్ని స్వాధీనం చేసుకోగలిగితే కొంత వరకు పరిస్థితి అదుపు చేయవచ్చు.

ఎవరూ చూడకుండా నెమ్మదిగా తుపాకీని కటకటాల గదిలోకి లాక్కుంది కౌసల్య.

ఆమెకు కొండంత ధైర్యం వచ్చింది.

నాయకుడు కౌసల్య వున్న గది దగ్గరకు గర్వంగా నడుస్తూ వచ్చి, "మిమ్మల్ని ఏం చెయ్యబోతున్నామని సస్పెన్స్‌లో వున్నారు కదూ మీరంతా! తెల్లారేసరికి మీకు బాగా తెలుస్తుంది. ఓ.కే....!?" అన్నాడు వికటంగా నవ్వుతూ.

కౌసల్య వచ్చిన అవకాశాన్ని వదులుకోలేదు. కిందనుంచి చటుక్కున తుపాకీ తీసుకుని అతనికి గురిచేసింది.

"కదలొద్దు. నాకు షూట్ చేయటం రాదనుకోకు. నా గురి తప్పదు. కాల్చడానికి వెనకాడను...." అన్నది కౌసల్య.

నాయకుడు విస్తుపోయాడు. అనుచరులు తుపాకులు కౌసల్యకు గురిచేయబోయేంతలో కౌసల్య అరిచి చెప్పింది. "నీ వాళ్ళని తుపాకులు కిందపడేయ్యమను, లేకపోతే నిన్ను కాల్చేస్తాను."

నాయకుడు అనుచరులకు సైగచేశాడు. వాళ్ళు ఆయుధాలు నేలమీద పడేశారు. అమ్మాయిలందరూ టెన్

పన్‌తో చూస్తున్నారు.

"వెంటనే మమ్మల్ని వదిలిపెట్టు. మేము మా బస్ చేరుకు నేవరకు ఎలాంటి పిచ్చి వేషాలు వెయ్యొద్దు. నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తాను" హెచ్చరించింది కౌసల్య.

నాయకుడి ఆదేశంమీద అనుచరులు రెండు కటకటాల గదుల తలుపులు తెరిచేశారు. బిలబిలమంటూ, అమ్మాయిలు గదుల బయటికి వచ్చేశారు. కొందరు వాళ్ళ దగ్గరున్న ఆయుధాలను స్వాధీనం చేసుకున్నారు.

"ఆ మూడో గది కూడా తెరవండి" ఆజ్ఞాపించింది కౌసల్య. వాళ్ళు మూడో కటకటాల గది కూడా తెరిచారు. అందులో బంధింపబడ్డ ఇరవైమంది అమ్మాయిలు బయటికొచ్చారు. కౌసల్యవంక కృతజ్ఞతగా చూశారు. వాళ్ళు వైజాగ్‌నించి వస్తూండగా దొంగలు ఎత్తుకొచ్చి బంధించారట.

పరంధామయ్య, ఆ టెండర్లు, క్లీనరు అమ్మాయిల సాయంతో బంధాలు విప్పదీసుకుని, అదే తాడుతో దొంగల నాయకుడ్ని, అతని నలుగురు అనుచరుల్ని వెడరెక్కలు విరిచి కట్టేశారు.

నాయకుడు గుర్రుగా చూశాడు అందరివంకా. వైజాగ్ అమ్మాయిలు కౌసల్యకు, మిగతా వారికి కృతజ్ఞతలు చెప్పుకుని, సెలవు తీసుకొని వెళ్ళిపోయారు.

కౌసల్య ప్రశంసగా చూసింది తన విద్యార్థినులవంక. దొంగల్ని నాయకుడితోబాటు బస్ ఎక్కించేశారు. యాదగిరి స్థానం క్లీనర్ తీసుకున్నాడు. బస్ హైదరాబాదువైపు దూసుకుపోయింది.

—: సమాప్తం :—

# ప్రాణం వచ్చిన ప్రతిమ!

**అజీజ్**

"ఎస్, ప్లీజ్!"

"ట్రంకాల్ ఫ్రం హైదరాబాద్!" అన్నాడు టెలిఫోన్ ఆపరేటర్ అవతలనించి.

వినడానికి సిద్ధపడుతూ, "ఆఁ!" అన్నాను.

"మాట్లాడండి" చెప్పాడు ఆపరేటర్.

"హలో, హు ఈజ్ స్పీకింగ్?" అడిగాను.

"డిటెక్టివ్ దుర్యోధన్ గారి అసిస్టెంట్ అర్జున్ గారితో మాట్లాడాలి" వినిపించింది అవతలినించి సుమధుర స్త్రీ కంఠం.

"అర్జున్ హియర్! మీరెవరు?"

"నా కంఠాన్ని పోల్చుకోలేదా అర్జున్? నేను, విశాలిని!"

"సారీ, అయామ్ వెరీ సారీ! నీ కంఠంలో మునుపటి చలాకీతనం, మాధుర్యం లోపించింది. విచార జీరలు వినిపిస్తున్నాయి...."

"నెలరోజుల క్రితం జరిగిన మా నాన్న హత్య సంగతి తెలుసుకదా మీకు?"

"తెలుసు. పేపర్లో చదివాను. వెంటనే నా ప్రగాఢ సంతాపాన్ని తెల్పుతూ టెలిగ్రాం కూడా ఇచ్చాను. అందలేదా?"

"అంది వుండాలి. చాలామంది పంపారు టెలిగ్రాంలు."

"హంతకుడి ఆచూకీ ఏమైనా తెలిసిందా?"

"పోలీసుల దర్యాప్తు కొనసాగుతోంది. ఇంకా ఏమీ తెలీలేదు. ఐతే, ఈమధ్య నన్నూ నాన్నలాగే హత మార్చడానికి హంతకులు పటిష్టమైన ఓ పథకం వేశారు.

"మై గాడ్! ఎలా?"

"నాన్న మరణంతో నేను అనారోగ్యం పాలయ్యాను. మా ఫ్యామిలీ డాక్టర్ రాసిచ్చిన టానిక్ తెప్పించి, రెండు రోజులు వాడాను. బాగానే వుంది. కానీ మూడో రోజు రాత్రి తాగి పడుకున్నానో లేదో, ఎడ తెరిపిలేని వాంతులూ, విరేచనాలూ ప్రారంభమై మూర్ఛ పోయినంత పనైంది.

దాంతో, డాక్టర్ గారికి ఆ టానిక్ విషయంలో అనుమానంవచ్చి, లేబొరేటరీలో రసాయన పరీక్ష జరి పించారు. అప్పుడు తెలిసింది అసలు విషయం! అందులో విషం కలిపివుందని! దాన్ని తాగాక, అదృష్టవశాత్తూ వాంతులై నా జీర్ణకోశంలో చేరిన ఆ విషమంతా బైట పడి బ్రతికిపోయాను. ఇంట్లోనే యెవ్వరో ఆ టానిక్‌లో విషం కలిపి వుంటారని నా అనుమానం!"

"మీతో బాటు ఇంట్లో ఇంకెవరున్నారు?"

"చిన్నాన్న వెంకట్రావూ, పిన్ని భానుమతీ, ఇద్దరు

నాఖర్లు మాత్రమే! దయచేసి మీరూ, డిటెక్టివ్ దుర్యోధన్ గారూ ఇక్కడికి వచ్చి, కొంతకాలం మా ఇంట్లో వుండి, హంతకుల్ని పట్టుకోవలసిందిగా అభ్యర్థిస్తున్నాను."

"దుర్యోధన్ గారు ఓ కేసు పనిమీద రెండురోజుల క్రితమే బెంగుళూరు వెళ్ళారు. నేనొక్కణ్ణే రాగలను. మనం పరాయివాళ్ళం కాము. యూనివర్సిటీ సహాధ్యాయులం! మంచి మిత్రులం! మీ గురించి మీకన్నా నాకే ఎక్కువ ఆందోళనగా వుంది.

కాయశక్తులా ప్రయత్నించి, మీ శత్రువుల్ని పట్టి చట్టపుకోరల కప్పగించే వరకూ విశ్రమించను. సరేనా?"

"థాంక్స్! మెనీ మెనీ థాంక్స్! ఎప్పుడు బైలుదేరుతున్నారు మరి?"

"వీలైతే ఈ రోజే బైలుదేరేవాణ్ని. కానీ, ఇంత త్వరగా విమానానికి టికెట్ దొరకడం కష్టం గనుక, ఈ రోజు సీటు రిజర్వు చేసుకుని, రేపుదయం ఫ్లైట్ ఎక్కుతాను. మధ్యాహ్నానికల్లా మీ ఇంట్లో వుంటాను."

"ఆల్ రైట్! మీకోసం ఎదురుచూస్తుంటాను."

"ఓ.కే! సీయూ!" అంటూ రిసీవర్ దించి, ఆలోచనలో పడ్డాను.

## 2

మధ్యాహ్నం మూడుగంటల ప్రాంతంలో బేగంపేట ఏర్‌పోర్టులో దిగింది విమానం!

సూట్ కేస్‌తో ఏర్‌పోర్టు బైటికి వచ్చి, టాక్సీ ఎక్కి, "బంజారా హిల్స్!" అన్నాను డ్రైవర్‌తో.

బైలుదేరింది టాక్సీ.

సాధారణంగా హైద్రాబాద్‌లోని అనేకమంది ధన

వంతులు ఆ ప్రాంతంలోనే నివసిస్తుంటారు. అక్కడే వుంది విశాలి ఇల్లు. ఆమె తండ్రి మధుసూధనరావు గారికి ఇటు సికింద్రాబాదులోనూ, అటు హైద్రాబాదులోనూ నాలుగు పెద్ద బట్టలషాపు లున్నాయి.

విశాలి ఆయన ఒక్కగానొక్క కూతురు. లేత వయసులోనే తల్లిని కోల్పోయిన విశాలిని ఎంతో అపురూపంగా చూసుకునేవారాయన. ఉస్మానియా యూనివర్సిటీలో నేను ఎమ్.ఏ. చేస్తున్నప్పుడు ఆమె నా క్లాస్ మేట్!

అపరాధ పరిశోధనలో మొదటినించీ నాకున్న ఆసక్తి దృష్ట్యా ఆ తరవాత నేను క్రిమినాలజీలో డిప్లొమా తీసుకుని, ప్రఖ్యాత డిటెక్టివ్ సుయోధన్ గారివద్ద అసిస్టెంటుగా ఉద్యోగం సంపాదించుకోగలిగాను.

టాక్సీ బంజారా హిల్స్ చేరుకుంది. డ్రైవర్ కు సూచనలిస్తూ విశాలి ఇంటికి తీసికెళ్ళాను. చాలా ఎత్తయిన ప్రదేశంలో వుంది వారి బంగళా. బంగళాముందు విశాలమైన కాంపౌండూ, అందమైన పూలతోటా వున్నాయి.

మెయిన్ గేటుగుండా కంపౌండ్లోకి తిరిగింది టాక్సీ. అక్కడ ఇంకా చాలా కార్లు ఆగివున్నాయి. ఎంతోమంది ఇంట్లోకి వెళుతూ, వస్తూ కనిపిస్తున్నారు. లోపల ఏదైనా పార్టీ జరుగుతోందా?

ఆలోచిస్తూ టాక్సీ దిగి, డ్రైవర్ కు బిల్ పేచేసి, సూట్ కేస్ తో ఇంటివైపు నడిచాను. పోర్చ్ లో అడుగు పెడుతుండగా ఇంట్లోంచి బైటికివస్తూ కనిపించాడు ప్రదీప్! విశాలిలాగే అతనూ యూనివర్సిటీలో నా సహాధ్యాయుడే!

నన్ను చూడగానే, "అర్జున్! ఎప్పుడొచ్చావ్?"

అడిగాడు సంభ్రమంతో.

"ఇదే రావడం! ఇంట్లో చాలా సందడిగా వున్నట్టుందే. ఏదైనా విందు జరుగుతోందా? విశాలి ఎక్కడ?" అడిగాను అతనితో కరచాలనం చేస్తూ.

"లోపలుంది. రా, చూపిస్తాను" అంటూ నా భుజం మీద చెయ్యి వేసి లోనికి తీసికెళ్ళాడు ప్రదీప్.

హాలు కుడిపక్కన ఓ గది వుంది. అతిథులు ఆ గదిలోకే వస్తూ పోతున్నారు. నన్నూ ఆ గదిలోకి తీసికెళ్ళి, "చూడు, విశాలిని మన స్నేహితురాలిని" అంటూ నేలమీదికి చూపాడు ప్రదీప్.

అంతే! నా చేతిలోంచి సూట్ కేస్ జారి కిందపడింది!

నేలమీద మెడవరకూ దుప్పటి కప్పి, పడుకోబెట్టి వుంది విశాలి శవం!

తలకటూ, ఇటూ అగరవత్తులు వెలుగుతున్నాయి. పండితులు భగవద్గీత పఠనం చేస్తున్నారు తగ్గు స్వరంలో.

నిన్న నాతో ఫోన్‌లో మాట్లాడిన నిండు ప్రాణి ఇంత త్వరగా నిర్జీవమై పోయిందా? ఎలా నమ్మడం?

"అర్జున్! విశాలి ఇక లేదు మనకు" అన్నాడు ప్రదీప్ గద్గద స్వరంతో.

"ఎప్పుడు జరిగింది? ఎలా జరిగింది?" అడిగాను అయోమయంగా.

"ఆశ్రయమిచ్చినవారే కాలసర్పాలై కాటు వేస్తే ఇలాగే జరుగుతుంది. ఇలారా, చెబుతాను" అంటూ నన్ను డ్రాయింగ్ రూంలోకి తీసికెళ్ళి, తలుపు మూశాడు ప్రదీప్.

"అర్జున్ కాసేపట్లో వాళ్ళు కర్మకాండకోసం విశాలి శవాన్ని స్మశానానికి తీసికెళ్ళవచ్చు. నువ్వు ఎలాగైనా

వాళ్ళనాపి, శవాన్ని పోస్టుమార్టం చేయించమని వత్తిడి చెయ్యి" అన్నాడు ప్రదీప్ ప్రాధేయపడుతూ.

"పోస్టుమార్టమా! ఎందుకూ?" అడిగాను నివ్వెరబోయి.

"విశాలి మరణం సహజమైంది కాదు!"

"మరి?"

"ఆమె హత్య చెయ్యబడిందని నా అనుమానం!"

"అందుకు ఆధారం ఏమిటి?"

"కొంత కాలంనించీ ఆమె అనారోగ్యంతో బాధపడుతోంది. అందుకే, ప్రతిరోజూ క్రమం తప్పకుండా వచ్చి ఆమెను చూసి పోతున్నాను. కాలేజీ స్థాయినించీ మా మధ్య ఎంతటి ప్రగాఢ స్నేహముందో నీకు బాగా తెలుసు. నిజానికి మేమిద్దరం ప్రేమించుకున్నాం! ఆమె ఆరోగ్యం కుదుటపడ్డాక పెళ్ళి చేసుకుందామని నిర్ణయించుకున్నాం! అంతలో ఊహించని విధంగా నెల రోజుల క్రితం విశాలి తండ్రి దుర్మరణం పాలయ్యారు. ఇంటి వెనక భాగంలో ఎన్నో అడుగులకింద బండ రాళ్ళమధ్య ఆయన శవం కనుగొనబడింది. యెన్నడూ ఇంటి వెనక్కి వెళ్ళని మనిషి, ఆ అవసరమే లేని మనిషి అక్కడ చచ్చిపడున్నాడంటే ఎవరికైనా అనుమానం వేస్తుంది కదా?

అందుకే విశాలి పోలీసుల్ని పిలిపించి రిపోర్టిచ్చింది. ఆయన్నెవ్వరో అక్కణ్నించి కిందికి తోసివుంటారని నిర్ణయించుకుని దర్యాప్తు ప్రారంభించారు పోలీసులు. తండ్రి మరణంతో విశాలి పూర్తిగా ధైర్యాన్ని కోల్పోయింది. నిన్న సాయంత్రం వచ్చి ఆమెకు అన్ని

విధాలా ధైర్యం చెప్పి, నీ విషయం కదిపాను. నువ్వు పాత మిత్రుడివే కాదు, ప్రఖ్యాత డిటెక్టివ్ దుర్యోధన్ గారివద్ద పనిచేస్తూ అపరాధ పరిశోధనలో అనేక మెళకువలు ఆకళింపు చేసుకున్నవాడివనీ, ట్రంకాల్ చేసి, నిన్నూ, దుర్యోధన్ గార్నీ ఇక్కడికి పిలిపించి, ఆమె నాన్న మరణం గురించి దర్యాప్తు జరిపించమనీ సూచించాను.

సరేనంది. ఉదయం వచ్చి చూస్తే ఇలా శవరూపంలో స్వాగతమిచ్చింది. ఆమె చిన్నానాన్న, పిన్నీ మొసలి కన్నీళ్ళు కారుస్తూ కనిపించారు."

"ఆమె మరణం గురించి డాక్టరూ, వాళ్ళూ ఏమన్నారు?"

"రాత్రి పడుకున్న మనిషి పడుకున్నట్టే గుండె బలహీనతవల్ల ఆగి మరణించిందని వారి ఫామిలీ డాక్టర్ చెబుతున్నాడు. అతని పేరు సంజీవరావు. అర్ధరాత్రి కలలోనో, భ్రాంతిలోనో తండ్రి ప్రతిరూపాన్ని చూసి వుంటుందనీ ఆమె చిన్నాన్న వాదం!

నెలరోజుల క్రితమే ఆమె తండ్రి చనిపోవడం, ఆ వెంటనే ఆమె మరణించటం అనుమానాస్పదంగా లేదూ? ఇప్పుడు విశాలి శవాన్ని సాధ్యమైనంత త్వరగా దహనం చెయ్యడానికి తొందరపడుతున్నారు వాళ్ళు. ఆ విధంగా ఆధారాలు రూపుమాసిపోతాయని.

అందుకే అంటున్నాను. శవాన్ని పోస్టుమార్టం చేయిస్తే అసలు రహస్యం బైటపడుతుందని. ఈ రెండు మరణాల వెనక విశాలి చిన్నాన్న వెంకట్రావూ, అతని భార్యల హస్తం వుందని నా గట్టి నమ్మకం!"

"ఆ మరణాలతో వారికి ఒరిగేదేమిటి?"

"మరీ అంత అమాయకంగా మాట్లాడక! విశాలి తండ్రి పుట్టుకతో ధనవంతుడు కాదు. స్వయంకృషితో, నిరంతర దీక్షతో ఈ స్థితికి ఎదిగాడు. తమ్ముడు వెంకట్రావుని మొదటినించీ తన దగ్గరే వుంచుకుని పోషించాడు. పెళ్ళి చేశాడు.

అతను అన్నకు వ్యాపారంలో చేదోడు వాదోడుగా వుంటే, అతని భార్య ఇంటిపనులు చూసుకునేది. మధుసూధనరావూ, విశాలీ ఇద్దరూ మరణిస్తే ఆస్తి యావత్తూ దగ్గరి బంధువులైన వాళ్ళకే గా లభించేది?"

"నీ అనుమానాన్ని డాక్టర్ ముందు వ్యక్తం చెయ్యలేదా?"

"చేశాను. విశాలి మరణం సహజమైనదే అంటున్నాడతను. ఆ భార్యా భర్తలిద్దరూ అతన్ని బుట్టలో వేసుకుని, డబ్బుతో నోరు నొక్కేశారని నా అనుమానం!"

"వాళ్ళను హంతకులుగా నిరూపించడానికి బలీయమైన ఆధారాలు కావాలి కదా?"

"పోస్టుమార్టంలో ఆ ఆధారాలు లభించి తీరతాయి."

"చట్టపరంగా విశాలి శవాన్ని పోస్టుమార్టం చెయ్యమని కోరే ఏ అధికారమూ ఆమె ఫామిలీ డాక్టర్‌కూ, చిన్నాన్నకూ తప్ప! వారు నిరాకరించిన పక్షంలో యే న్యాయమూర్తి కూడా శవాన్ని పోస్టుమార్టం చెయ్యమని ఆదేశించజాలడు."

"తెలుసు. అందుకే నేను ఏ న్యాయమూర్తి సహాయంగానీ, పోలీసుల సహకారంగానీ అర్థించలేదు. నిన్ను వేడుకుంటున్నాను. ఈ రంగంలో నీకు మంచి అనుభవం వుంది. చట్టపరమైన లొసుగులు బాగా తెలుసు నీకు.

ఏదో ఒక మార్గం వెదకమని వేడుకుంటున్నాను"
అన్నాడు ప్రదీప్ చేతులు జోడిస్తూ.

అతనిమీద జాలేసింది నాకు. మనసారా ప్రేమించి, పెళ్ళిచేసుకోవాలనుకున్న ప్రేయసి ఇలా అర్థాంతరంగా చనిపోతే, యెంతటివాడికైనా మనసు చలించడం సహజం! ప్రదీప్ విషయంలోనూ అదే జరిగింది. అతని అవతారం చూస్తోంటే మతి చలించినవాడిలా కనిపిస్తున్నాడు.

"ఏ వైపునించి ఆలోచించినా అది సంభవంగా తోచడంలేదు ప్రదీప్! ఐనా నేను వెంకట్రావుతో మాట్లాడి ఒప్పించడానికి ప్రయత్నిస్తాను."

"ఆ విధంగా తన నేరంమీది ముసుగు తొలిగిపోవడానికెవరొప్పుకుంటారు? నీకన్నా ముందు నేనే అతనితో మాట్లాడి ఒప్పించడానికి ప్రయత్నించాను. ఏమన్నాడో తెలుసా? విశాలి మరణానికి మూలకారణం మ్యూజియం గదిలో వున్న ఆమె బొమ్మేనట!"

"బొమ్మా! అదేమిటి?" అడిగాను నోరు తెరుస్తూ.

"నీకు తెలీదా? పోనీ, విశాలి నాన్నకు ఈ జంట నగరాల్లో నాలుగు పెద్ద బట్టల షాపులున్న సంగతైనా తెలుసు కదా? నగరంలోని ప్రతి బట్టల షాపులముందు నిలువెత్తు అద్దాల బీరువాలూ, వాటిలో కస్టమర్లనాకర్షించడానికి, మనిషిని పోలిన, ఐమాన్ అందమైన స్త్రీలను పోలిన బొమ్మలుంచి, వాటికి విలువైన చీరలు చుట్టి నిలబెడతారు కదా?

అలాటి అందమైన బొమ్మలెన్నో మధుసూధనరావుగారి బట్టలషాపుల ముందూ వున్నాయి. అలాటి బొమ్మలంటే ఆయనకెంతో మక్కువ వుండేది. అందుకే ఒకో

షాపులో నాలుగు బొమ్మలవసరమైతే వివిధ భంగిమల్లో ఎనిమిదేసి చేయించి, మిగతా వాటికి ఖరీదైన చీరలు చుట్టి, ఇంట్లో ఓ గదిని బొమ్మల మ్యూజియంగా మార్చి అందులో వాటిని అందంగా అమర్చారు.

అప్పుడే ఆయనకో ఐడియా వచ్చి, మూసపోసినట్లు తన కూతుర్ని పోలిన బొమ్మను చేయించి, దానికి విశాలి లాగే బట్టలు తొడిగించి, మ్యూజియం గదిలో మిగతా బొమ్మలమధ్య వుంచి చూసుకుంటూ మురిసిపోయేవాడు.

ఐతే, ఆ బొమ్మను చూసినప్పుడల్లా అది తనను తీవ్రంగా అసహ్యించుకుంటున్నట్టు స్ఫురిస్తుందనీ, ఏదో ఒకరోజు అది తన ఆత్మను కబళిస్తుందేమోనన్న భ్రాంతి కలుగుతుందనీ చెప్పింది విశాలి నాతో.

నవ్వి, అటువంటి అర్థంలేని భ్రమలు పెట్టుకోవద్దని కొట్టిపారేశాను. ఆ సంగతి ఆమె నాతో నేకాదు ఇంట్లో అందరితోనూ చెప్పిందేమో, ఇప్పుడామె చనిపోయింది. గనక వెంకట్రావు ఆ విషయాన్ని ఆధారం చేసుకుని ఆమె చావుకు కారణం ఆ బొమ్మే అయుంటుందని అర్థం లేని అనుమానం వ్యక్తం చేస్తున్నాడు.

లేదా, ఇంట్లో ఇద్దరు ఆత్మీయులు వెంట వెంటనే మరణించినందుకు తన మస్తిష్కం దెబ్బతిని అలా మాట్లాడుతున్నట్టు అందరూ అనుకోవాలని నాటకమాడు తున్నాడేమో!"

"ఆ విషయం తరవాత! ముందొకసారి నేనా మ్యూజియంని చూడాలి" అన్నాను ఆసక్తిగా.

"పద, చూపిస్తాను" అంటూ తలుపు తెరిచాడు ప్రదీప్.

అతన్ని అనుసరిస్తూ బైటికి నడిచాను.

# 3

హాలు చివర వున్న ఓ గది దగ్గరికి తీసికెళ్ళాడు ప్రదీప్. నెమ్మదిగా దాని తలుపులు తోసి, లోన అడుగు పెట్టాడు.

గది నాలుగు గోడలకూ వరసగా నిలువెత్తు అద్దాల బీరువాలు అనించి వున్నాయి. వాటిలో వివిధ భంగిమల్లో సజీవమూర్తులా అన్న భ్రాంతిని కలిగించే రకరకాల స్త్రీ ప్రతిమలు అమర్చి వున్నాయి.

ఒకదాంట్లో అధునాతన స్త్రీ అందమైన జుత్తుముడి వేసుకుని చేతిలో వేనిటీ బాగ్ పట్టుకుని నిల్చుంటే, మరొకదాంట్లో పదహారణాల కుటుంబ స్త్రీ తలపై నిండుగా కొంగు కప్పుకుని అణకువగా నిల్చుంది.

వేరొక షో కేస్‌లో లంబాడీ స్త్రీ తమ ఆచార దుస్తులు ధరించి అమాయకంగా నవ్వుతోంటే, మరొకదాంట్లో నల్లని ఆదివాస స్త్రీ బ్లౌజు లేకుండా ఒంటిపై కోక చుట్టుకుని, పసివాడికి పాలిస్తూ కూర్చునుంది....

అలా ఒక్కో ప్రతిమను పరిశీలిస్తూ చివరికి విడిగా, ప్రత్యేకంగా తయారుచేసిన ఓ షో కేస్ మీద నిలిచాయి నా చూపులు. అంతే! రెప్పవెయ్యడం మరచి అలా చూస్తుండిపోయాను చాలాసేపు.

అంతక్రితం విశాలి శవాన్ని నా కళ్ళారా చూసి వుండకుంటే, అందులో నిల్చున్నది విశాలే అని భ్రమించే వాణ్ణేమో! అంత నాచురల్‌గా పోతబోసినట్టు విశాలిలా వుంది అందులోని బొమ్మ!

సాధారణంగా గొప్పింటి ఆధునిక యువతులు ఇళ్ళల్లో తొడుక్కునే పాదాలవరకూ వేళాడే గౌన్ తొడిగి వుంది ఆ బొమ్మకు. తెల్లని గౌన్ మీద చిన్నచిన్న లేత

నీలిరంగు పూలు అద్ది వున్నాయి. అప్పుడే స్నానం చేసినట్టు తడులుగా వెనక్కి జాలువార్చిన శిరోజాలు. బహుశా, నాచురల్ ఎఫెక్టు కోసం బొమ్మ తలకు ఆడవారి విగ్గు పెట్టినట్టున్నారు.

"ఇక వెళదామా?" అడిగాడు ప్రదీప్ వెనకనించి.

"పద!" అంటూ వెనుదిరగబోయి, చటుక్కున ఆగిపోయాను.

కారణం, అదే సమయంలో విశాలి బొమ్మ కళ్ళూ, కనురెప్పలూ కదిలినట్టు కనిపించాయి నాకు. దిగ్భ్రాంతిలో అవాక్కయి చూస్తుండిపోయాను. అంతక్రితం ప్రదీప్ అన్న మాటలు జ్ఞాపకం వచ్చాయి.

ఆ బొమ్మను చూసినప్పుడల్లా అది తన ఆత్మను కబళిస్తుందేమోనన్న భ్రమ కలుగుతున్నట్టు చెప్పిందిట విశాలి. ఇప్పుడామె మరణించింది గనక, ఆమె ఆత్మ నిజంగానే ఈ నిర్జీవ బొమ్మను ఆవహించిందా?

నెమ్మదిగా దాన్ని సమీపించి, జాగ్రత్తగా పరిశీలించాను. ఇప్పుడు నిశ్చలంగానే వున్నాయి బొమ్మ కళ్ళు! బహుశా, బైట ఏదో పక్షి ఎగిరిపోతే, కిటికీలగుండా గదిలో పడుతున్న వెలుగు చెదిరి, కళ్ళు కదిలినట్టు కనిపించాయా నాకు?

లేకుంటే బొమ్మను ఆత్మ ఆవహించడం ఏమిటి? అనుకుంటూ ప్రదీప్ వెంట బైటికి నడిచాను. "వెంకట్రావూ, అతని భార్యా, డాక్టర్ ఎక్కడ?" అడిగాను.

"దహనానికి ఏర్పాట్లు చేస్తున్నారు. పిల్చుకొస్తాను" అంటూ ఇంట్లోకి నడిచాడు ప్రదీప్.

కాసేపయ్యాక ముగ్గురూ వచ్చారు నా దగ్గరికి. వారి మొహాలు విషాదానికి బదులు తొణకని నిండుకుండల్లా

గంభీరంగా వున్నాయి. నన్ను చూడగానే డాక్టర్ మొహంలో ఎందుకో చిరాకు ద్యోతకమయింది!

విశాలి చిన్నాన్న వెంకట్రావుకి సుమారు నలభై ఏళ్ళుంటాయి. సామాన్యమైన ఒడ్డూ పొడుగు. చామన ఛాయ. మనిషిలో డాంబికం కనిపించడంలేదు. ఐతే, భర్తకు భిన్నంగా భారీకాయురాలు అతని భార్య భానుమతి.

తొలిచూపులోనే తెలుగు సినిమాల్లో కనిపించే గయ్యాళి పాత్రల నటీమణుల్ని జ్ఞప్తికి తెచ్చే ముఖం! ముప్ఫైఅయిదేళ్ళుంటుంది వయసు.

ప్రదీప్ వాళ్ళకు నన్ను పరిచయంజేసి, ప్రైవేట్ డిటెక్టివ్ అసిస్టెంటుననీ, విశాలి స్నేహితుణ్ణని చెప్పగానే వారి మొహాల్లో లేత ఎరుపురంగు సంతరించి మాయ మైంది!

"విశాలి మరణం సహజమైంది కాదనీ, అనుమానాస్పదంగా వుందనీ, పోస్టుమార్టం జరిపిస్తే అసలు విషయం తెలుస్తుందనీ అంటున్నాడు ప్రదీప్. ఈ విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?" అడిగాను వాళ్ళని.

భర్త నోరు విప్పకముందే అందుకుంది భానుమతి. "మీరూ ఆ గాలి మాటల్ని నమ్ముతున్నారన్నమాట!"

"అవి గాలి మాటలని ఎలా చెప్పగలం? పోస్టు మార్టం జరిపిస్తే నలుగురి మనసుల్లో నాటుకున్న అను మాన బీజాలు తొలగిపోతాయి కదా?"

"ఎవరో, ఏదో అంటున్నారని పుత్తడి బొమ్మలాటి విశాలి శరీరాన్ని ముక్కలు చేయించమంటారా?" అంది భానుమతి తీక్షణంగా.

"దహనంచేస్తే ఆ పుత్తడి బొమ్మ కాలి బూడిద

కాదా?"

"అది ఆచారానికి సంబంధించిన విషయం! ఐనా, మాకు లేని ఉబలాటం మీ కెందుకూ అంట? ముందే ధర్మరాజులాంటి బావగారూ, బంగారంలాంటి అమ్మాయి పోయినందుకు మేమేడుస్తోంటే, మధ్య మీ రోకటి పోట్లేమిటీ?

మా ఫామిలీ డాక్టర్ గారు విశాలి మరణం సహజమైనదేనని నిర్ణయించారు. ఏది ఏమైనా నేను అమ్మాయి శరీరాన్ని ఖండాలు చెయ్యటానికెంతమాత్రం ఒప్పుకోను" అంది ఆమె కుండ బద్దలుకొట్టినట్టు.

"వాళ్ళతో పేచీ ఎందుకు భానూ! ముందే వర్షాకాలం! పైన మబ్బులు ముసురుకుంటున్నాయి. వర్షం వస్తే చితి అంటుకోదు. శవాన్ని త్వరగా తీసికెళ్ళడం మంచిది" అన్నాడు అంతవరకూ మౌనంగా వున్న వెంకట్రావు.

భానుమతి విజయగర్వంతో చూసింది మా వైపు. దమ్ములుంటే ఆపుకోండి చూద్దాం! అన్నట్టున్నాయి ఆ చూపులు.

"విశాలి శవంతోబాటు ఆమె బొమ్మను కూడా దహనం చేస్తే బావుంటుంది భానూ!" అన్న వెంకట్రావు మాట విని, డాక్టర్ కనుబొమలు ముడివడ్డాయి.

"ఎందుకూ?"

"మీకు తెలీదు డాక్టర్! విశాలి బ్రతికుండగా అప్పుడప్పుడూ నాతో అనేది. ఆ బొమ్మను చూస్తే తనలో తెలియని భయం పుడుతుందనీ, అది తన ఆత్మను కబళిస్తుందేమోనని గుండె ఝల్లుమంటుందనీ చెప్పేది. నాకూ ఆ బొమ్మంటే అదోరకం జలదరింపు!"

నవ్వాడు డాక్టర్. "అతన్నీ అర్థంలేని భయాలు. నిరాధారమైన ఆపోహాలు. ఈ ఇంట్లో మీ అన్నయ్యకు సంబంధించిన ఆయన కూతురు విశాలికి చెందిన ఏకైక జ్ఞాపకచిహ్నం ఆ బొమ్మ. దాన్ని కూడా చేజేతులా రూపుమాపడం వివేకం కాదు!"

"నాది అర్థంలేని భయంకాదు డాక్టర్! ఆ బొమ్మ సామాన్యమైంది కాదని రూఢిగా చెప్పగలను ఎప్పుడైతే మీరు విశాలిని పరీక్షించి, మరణించిందని ప్రకటించారో, ఆమె శవాన్ని బంధుమిత్రుల సందర్శనార్థం మేడమీది పడగ్గదిలోంచి కిందికి తెచ్చి హాలు పక్కగదిలో వుంచి, ఐనవాళ్ళందరికీ ఫోన్లుచేసి, శవం వున్న గదిని సమీపిస్తుండగా, నా కళ్ళముందే ఆ గదిలోంచి ఆ బొమ్మ చకచకా ఇవతలికి వచ్చి, మ్యూజియం గది తలుపు తెరుచుకుని లోపలికెళ్ళిపోయింది.

ఆ దృశ్యం చూసి, దిగ్భ్రాంతితో నా కాళ్ళూ, చేతులూ ఆడలేదు చాలాసేపు. అప్పుడు మీరూ, నాఖర్లూ మేడమీద కన్నీరుమున్నీరుగా ఏడుస్తున్న భానుమతిని ఓదారుస్తున్నారు.

ఆశ్చర్యంలోంచి తేరుకుని, గబగబ శవం వున్న గదిలోకెళ్ళి చూశాను. విశాలి శవం ఎక్కడ యెలా పడుకోబెట్టామో, అలాగే వుంది. మరి నేను చూసింది భ్రమో, వాస్తవమో సరిగ్గా తేల్చుకోలేకపోయాను. ఆ సంగతి మీకు చెబితే నమ్ముతారో లేదోనని చెప్ప లేదు."

"చూడండి వెంకట్రావుగారూ! ఏ కోణంనించి పరిశీలించినా మీ కథనం వాస్తవానికి చాలా విరుద్ధంగా తోస్తోంది. నేను అన్నివిధాలా పరీక్షించే విశాలి మర

ణాన్ని ధృవీకరించాను.

బహుశా, ఆ బొమ్మ గురించి విశాలి మీతో చెప్పిన మాటలూ, దానిమీద మీరు ఏర్పరుచుకున్న భావాలూ కలగాపులగమై, ముందే అమ్మాయి చనిపోయిన సడన్ షాక్‌లో వున్న మీకు అలా బొమ్మ నడిచివెళ్ళినట్టు భ్రాంతి కలిగి వుంటుంది" అన్నాడు డాక్టర్ కొట్టి పారేస్తూ.

"డాక్టర్ గారు చెప్పింది నిజమే అయుంటాలండీ! విశాలిలేని లోటును ఆ బొమ్మలో పూడ్చుకోవచ్చు. ఈ ఇంట్లో అది వున్నంతకాలం విశాలి మరణించిందన్న భావమే కలగదు మనకు....అవతల మబ్బులు ఉరుముతున్నాయి. ముందు దహన సంస్కారాల సంగతి చూద్దాం పదండి" అంది భానుమతి తొందరపెడుతూ.

వారి నక్కజిత్తులు చూస్తుంటే ఒళ్ళు మండిపోయింది నాకు. కానీ, ఏం చెయ్యాలి? ఏం చెయ్యడానికీ చట్టపరంగా నాకు అధికారం లేదాయె. వాళ్ళు వెళ్ళిపోగానే చివరి ప్రయత్నంగా డాక్టర్ని వేడుకుందామని అతనివైపు తిరిగాను.

నేను పెదవి కదపకముందే అతను నిట్టూర్చి, "విశాలిని కాపాడటానికి శక్తివంచనలేకుండా ప్రయత్నించాను. ప్చ్! లాభం లేకపోయింది. ఈ వయసులోనే భగవంతుడామె ఆయుఃషుకు ఫుల్‌స్టాప్ పెట్టేశాడు. చావు పుట్టుకలు మన చేతిలోనివా?" అన్నాడు వేదాంత ధోరణిలో.

"నిజమే! కానీ, ఒకరి చావుకు కారణాలు కనుగొనే అధికారం చట్టరీత్యా మీ చేతిలో వుంది. విశాలి శవాన్ని పోస్టుమార్టం చేయించి, ఆమె చావుకు కారణం ఏమిటో

తెలుసుకుంటే బావుండేది."

"అంటే, మీ ఉద్దేశంలో నేను నా విద్యుక్త ధర్మంలో నిర్లక్ష్యంగా వుంటాననా? ఎప్పుడు యేది చెయ్యాలో, ఏది చెయ్యకూడదో మీరు నాకు నేర్ప నవసరంలేదు. పోస్టుమార్టం అవసరమైతే ఇంతవరకూ రానిచ్చేవాణ్ణా? విశాలి మరణం గుండె ఆగిపోవడంవల్ల జరిగింది. దట్సాల్!" అంటూ చరచరా శవం వున్న గదివైపు నడిచాడు డాక్టర్.

ప్రదీప్ వైపు చూసి నిట్టూర్చాను ఇక చేసేదేమీ లేనట్టు!

# 4

స్మశానంలో విశాలి శవానికి దహన సంస్కారాలు పూర్తిజేసి, ఇల్లుజేరేసరికి సంజెచీకట్లు ముసురుకున్నాయి. అప్పటికే ఆ ఇంట్లో అల్ప వ్యవధిలోనే అనూహ్య స్థితిలో తండ్రీ కూతుళ్ళ మరణాలు సంభవించడంతో బంధు మిత్రులు జడిసి, ఆ ఒక్క రాత్రి కూడా అక్కడ బస చెయ్యడానికి భయపడి మూటా ముల్లె సర్దుకుని వెళ్ళి పోయారు.

ఏడున్నర ప్రాంతంలో ప్రారంభమైంది వర్షం!

భారీ వర్షం!!

ఇక ఆ ఇంట్లో నేనూ, ప్రదీప్, వెంకట్రావూ, భాను మతీ తప్ప మరెవ్వరూ లేరు. ప్రదీప్ పరిస్థితి చాలా దయనీయంగా వుంది. కళ్ళు గుంటలుపడి, మొహం పీక్కుపోయి, జుత్తంతా చెదిరి పిచ్చివాడిలా కనిపి స్తున్నాడు.

అందరిలా మేమిద్దరమూ యెప్పుడు బైటకెళతామా అని ఎదురుచూస్తున్నారు వెంకట్రావూ, భానుమతీ!

డిటెక్టివ్ దుర్యోధన్‌గారి సాంగత్యంవల్ల సంతరించు కున్న నా అనుభవం, ఆ ఇంట్లో ఎక్కడో, యేదో అనూహ్యమైన మర్మం దాగివుందని పదేపదే హెచ్చ రిస్తోంది నన్ను.

అందుకే అన్నాను కావాలని. "నేను వెళ్ళాల్సిన మద్రాసు విమానం రేపుదయం తొమ్మిది గంటలకు బైలు దేరుతుంది. అందులో వెళ్ళిపోవాలనుకుంటున్నాను. ఈ రాత్రి ఇక్కడే గడిపి."

భానుమతి మొహం చిటపటమంది అయిష్టంతో. ఐనా, మర్యాదకోసం నోరు విప్పలేదు.

"అలాగే, దానికేం భాగ్యం! మరో రెండు రోజు లుండి వెళ్ళండి. మేడపైన అన్నయ్యగది ఖాళీగా వుంది. మీ బసకోసం వాడుకోండి" అన్నాడు వెంకట్రావు.

"థాంక్స్!" అంటూ ప్రదీప్ వైపు తిరిగి, "నువ్వు బాగా అలిసిపోయినట్టున్నావు. ఇంటికెళ్ళి విశ్రాంతి తీసుకో. రేపుదయం కలుసుకుందాం!" అన్నాను.

"అలాగే! వస్తాను. గుడ్‌నైట్" అంటూ నీరసంగా బైటికి నడిచాడు ప్రదీప్.

"మా ఆకలి చచ్చిపోయింది. మీరు భోంచేస్తానంటే ఏర్పాటుచేస్తాం! సమయానికి నౌఖర్లు కూడా లేరు. స్మశానంనించే ఇంటికెళ్ళిపోయారు" అన్నాడు వెంక ట్రావు.

"అబ్బే, ఈ పరిస్థితిలో ఆకలి కూడానా! స్నానంచేసి, విశ్రాంతి తీసుకోవాలి. గది చూపించండి" అన్నాను.

"మీరు స్నానం చేసేలోగా పాలుకాచి పంపిస్తాను" అంది భానుమతి. వెంకట్రావు మేడమీదికి దారితీశాడు. సూట్‌కేస్ అందుకుని, అతన్ని అనుసరించాను. మేడమీది

ఓ గదిలోకి తీసికెళ్ళి, "అదే అన్నయ్య గది, బాత్ రూం కూడా వుంది లోపల" అన్నాడు.

సూట్ కేస్ టేబిల్ మీద పెట్టి, "థాంక్స్!" అన్నాను.

"స్నానం చెయ్యండి. పాలు పట్టుకొస్తాను" అంటూ వెళ్ళిపోయాడతను. తలుపు దగ్గరగా వేసి, బట్టలు విప్పి, లుంగీ చుట్టుకుని, టవల్, సోప్ తో బాత్ రూంలోకి నడిచాను. షవర్ కింద తృప్తిగా స్నానంచేసి, చారల చొక్కా నైట్ పైజామా తొడుక్కున్నానో లేదో, ట్రేలో పెద్ద సైజు పాలగ్లాసూ, ఓ బిస్కెట్ పాకెట్టూ పట్టుకొచ్చి, "ఈ రాత్రికి వీటితో సరిపుచ్చుకోండి" అన్నాడు వెంకట్రావు.

"ఫరవాలేదు. అనవసరంగా మిమ్మల్ని శ్రమ పెడుతున్నాను."

"ఇట్స్ ఆల్ రైట్! గుడ్ నైట్!" అంటూ బైటికి నడిచాడు.

తలుపు మూసి, పాలగ్లాసందుకున్నాను. బిస్కెట్లు తినబుద్ధి కాలేదు. పాలు తాగి, సిగరెట్ అంటించి' బాల్కనీవైపు నడిచాను. అక్కణ్నించి చూస్తే ఇంటి వెనకభాగం, దూరాన కనుచూపుమేరవరకూ నగరంలో వెలుగుతున్న విద్యుద్దీపాలూ కనులకింపుగా కానవస్తున్నాయి.

ఇప్పుడు వర్షం తగ్గుముఖం పట్టింది. సన్నని తుంపరగా పడుతోంది. చేతి గడియారం చూసుకున్నాను. ఎనిమిదిన్నర. సిగరెట్ పీకను బాల్కనీగుండా అవతలికి విసిరి, మంచంవైపు నడిచాను. గదిలోని లైటార్పి, జీరోవాల్టు వెలిగించి, పక్కమీద వాలాను.

ముందే కొత్త ప్రదేశం! పైగా అనూహ్య ఘటనలతో నిండిన గృహం! ఎలా పడుతుంది నిద్ర? తీవ్రాలోచనలతో సతమతమౌతూ, పక్కపై అటూ ఇటూ వత్తిగిలుతూ దాదాపు రెండుగంటలు తంటాలుపడ్డా నిద్రపట్టకపోయేసరికి, ఇహ లాభంలేదని లేచి కూర్చున్నాను మంచంమీద.

అక్కణ్ణించి బాల్కనీగుండా బైటి దృశ్యం స్పష్టంగా కనిపిస్తోంది. ఇప్పుడు ఆకాశంలో మబ్బులు పూర్తిగా పల్చబడ్డాయి. ఆ మబ్బుల్లోంచి వెన్నెలకూడ వెలికివచ్చి, పరుచుకుంది పరిసరాలపై.

మసకచీకట్లో కూర్చుని అటు చూస్తున్న వాణ్ణలా ఒక్కసారి ఉలిక్కిపడ్డాను! కారణం, బైట ఇంటివెనక ఏదో తెల్లని ఆకారం కదులుతున్నట్టు కనిపించింది! ఒక్క ఉదుటున మంచం దిగి బాల్కనీ దగ్గరికి నడిచాను. ఇప్పుడా ఆకారం స్పష్టంగా కనిపిస్తోంది.

నడకను బట్టి ఇట్టే పోల్చుకున్నాను. అది స్త్రీ ఆకారం! ఇప్పుడా ఇంట్లో నేనూ, వెంకట్రావూ, భానుమతీ తప్ప మరెవ్వరూ లేరు. కొంపదీసి భానుమతి గాక ఇంట్లో మరో స్త్రీ కూడా వుందా? లేక ఆమె భానుమతేనా?

ఔను. భానుమతే! ఒడ్డూపొడుగు అలాగే వున్నాయి రోడ్ రోలర్లా! అర్ధరాత్రిపూట ఇంటివెనక్కి ఎందుకొచ్చిందామె? ఏం చెయ్యడానికి? ఊపిరి బిగబట్టి ఆశ్చర్యంతో అటే చూడసాగాను. గదిలో లైటార్పడం చాలా మంచిదయింది. లేకంటే, బాల్కనీలో నిల్చున్న నన్ను ఆమె తప్పక చూసివుండేది.

వడివడిగా నడుస్తూ కొంత దూరంలో అడ్డదిడ్డంగా పెరిగిన సీతాఫలాల చెట్లవైపు వెళుతోంది భానుమతి.

సరిగ్గా అక్కడే, కింద అగాధంలోపడి చనిపోయాడట విశాలి తండ్రి మధుసూధనరావు. ఆ సంగతి తెలిసీ, అర్ధరాత్రి అంత నిర్భయంగా భానుమతి అక్కడికెందుకెళుతోంది?

ఆలోచిస్తున్న వాణ్ణల్లా ఒక్కసారి తృళ్ళిపడ్డాను. భానుమతిని అనుసరిస్తూ ఇప్పుడు మరో ఆకారం వచ్చింది ఇంటి వెనక్కి! కళ్ళు చిట్లించి చూశాను. అది కూడా స్త్రీ ఆకారమే!

పాదాలవరకూ వేళ్ళాడుతున్న తెల్లని గౌను. భానుమతికన్నా రెండు మూడంగుళాలు పొట్టిగా, సన్నంగా వున్న ఆ ఆకారాన్నీ ఆ గౌన్నీ అదివరకెక్కడో.... గుర్తురాగానే గుండె ఝల్లుమంది!

విశాలి!!

కొన్ని గంటలక్రితం నా కళ్ళముందు స్మశానంలో దహనం చెయ్యబడ్డ విశాలి, ఇప్పుడు సజీవంగా.... ఏమిటీ మాయ? ఎలా సంభవమిది? కళ్ళు నులుపుకుని చూశాను. సందేహానికి ఆస్కారంలేదు.

విశాలే!

అప్పుడు గింగురుమన్నాయి నా బుర్రలో వెంకట్రావు అన్న మాటలు.

'విశాలి ఆత్మ ఆ ప్రతిమను ఆవహించింది....'

చూస్తుండగానే ఆ రెండు ఆకారాలూ ఒకదాని వెనక ఒకటి సీతాఫలచెట్ల వెనక్కి వెళ్ళిపోయాయి. అంతే! మరుక్షణం దిక్కులు పిక్కటిల్లేలా పెద్ద ఆర్తనాదం వినిపించింది! నా గుండెలో గుర్రాలు దౌడు తీశాయి.

మరేమీ యోచించకుండా వెనుదిరిగి, తలుపువైపు

పరుగెత్తాను. గడియతీసి, భళ్ళున తలుపు తెరిచి, వేగంగా మెట్లు దిగి హాల్లోకి చేరుకున్నాను. ఆ ఖంగారులో తెరిచి వున్న హాలు తలుపు నన్ను ఆశ్చర్యపర్చలేదు.

ఒక్క ఉదుటున బైటపడి, కుడివైపునించి చుట్టు తిరిగి మేడ వెనక్కి పరిగెత్తాను. సరిగ్గా అదే క్షణంలో గౌన్ తొడుక్కున్న తెల్లని ఆకారం ఎడంవైపునించి వేగంగా మేడ ముందుభాగంవైపు వెళుతూ కనిపించింది.

"ఏయ్ .... యెవరు నువ్వు .... ఆగు ...." అరిచాను గట్టిగా.

ఆ ఆకారం ఆగలేదు. వెనుదిరిగి చూడలేదు. త్వర త్వరగా నడుస్తూ నా దృష్టికి దూరమైపోయింది. అప్పుడు తెలిసి వచ్చింది నేను చేసిన పొరపాటు. హడావుడిలో సూట్ కేస్‌లోంచి నా రివాల్వర్, టార్చిలైటూ తేవడం మర్చిపోయాను.

ఆ గావుకేక ఎవరిది? భానుమతిదా? ఏం జరిగిందా మెకు? ఇప్పుడా ఆకారాన్ని వెంబడిస్తూ పోతే, అవతల భానుమతికేదైనా అవాంతరం ముంచుకొచ్చి వుంటే సమయానికి ఆదుకోలేను. అందుకే మరేమీ ఆలోచించకుండా సీతాఫలాల చెట్లవైపు పరుగుతీశాను.

ఆ చెట్లకు నాలుగడుగుల అవతలే ఉంది అగాధం! భానుమతి జాడ లేదక్కడ! జాగ్రత్తగా చూసుకుంటూ కొండ చివర నిల్చుని, కిందికి చూశాను. మరీ అంత లోతు లేకున్నా అక్కణ్నించి ఎవరైనా తలకిందులుగా పడితేమాత్రం బ్రతకడం కష్టం!

నా అనుమానం నిజమే అయింది. కింద తొలచిన బండరాళ్ళమీద పడుంది ఓ ఆకారం! "భానుమతిగారూ!

భానుమతిగారూ!" పిల్చాను గట్టిగా.

జవాబులేదు.

అటూ ఇటూ చూశాను. ఓ చోట కిందికి దిగడానికి అనువైన చోటు కనిపించింది. అటువెళ్ళి జాగ్రత్తగా రాళ్ళను పట్టుకుంటూ అతికష్టంమీద చేరుకోగలిగా నక్కడికి. ఆ ఆకారం పడున్న ప్రదేశాన్ని సమీపించి, వంగి చూశాను పరీక్షగా. భానుమతే!

బోర్లా పడుంది రాళ్ళపై. తల చితికి రక్తం మడుగు కట్టింది. చటుక్కున చెయ్యందుకుని పల్స్ చూశాను. గుండె గుభిల్లుమంది. అది చెయ్యికాదు. ఐస్ ముద్ద! మెడ ఎముక విరిగిందేమో! వెంటనే ప్రాణం పోయింది.

ఇంత రాత్రివేళ ఆమె ఇక్కడికి రావడానికి కారణం? అదే అంతుచిక్కని మర్మం! ఆలోచిస్తూ అనవసరంగా కాలయాపన చెయ్యకూడదు. వచ్చిన దారినే తిరిగి పైకి చేరుకుని పరుగుతీశాను ఇంటివైపు.

హాల్లో అడుగుపెట్టి, గబగబ మ్యూజియం గదివైపు నడిచాను. దగ్గరగా వేసున్నాయి తలుపులు. బైటగడియ పెట్టలేదు. దడదడలాడే గుండెతో మెల్లగా తోశాను. కిర్రుమంటూ తెరుచుకుంది.

అగ్గిపుల్ల గీసి, నెమ్మదిగా అడుగుపెట్టాను లోన. తలుపు పక్కనే వున్న స్విచ్ వత్తి లైటు వెలిగించాను. యెదురుగా షో కేస్‌లో యధాప్రకారం నిశ్చలంగా నిల్చున్న విశాలి బొమ్మను చూడగానే, నేనూ కాసేపు కొయ్యబారి పోయానా ప్రతిమలా!

తరవాత తేరుకుని, షో కేస్‌ని సమీపించి, ఆ ప్రతిమ పాదాలను పరిశీలించాను. ఎటువంటి మట్టిమరకలూ లేవు! మరి నేను చూసిందేమిటి? కలగన్నానా? ఆలోచిస్తూ

వెనుదిరిగి, హాల్లోకి నడిచాను.

సరిగ్గా ఆదేసమయంలో పెనించి ఖంగారుగా మెట్లు దిగుతూ కనిపించాడు వెంకట్రావు. "భానుమతి ఎక్కడ? ఆ కేకేమిటి? వెళ్ళి చూశారా?" అడిగాడు ఆందోళనగా.

"మీ భార్య బైటికెళ్ళిన సంగతి తెలియదా మీకు?" అడిగాను అతన్ని పరీక్షగా చూస్తూ.

"తెలీదు. నిద్రలో వున్నాను. హఠాత్తుగా ఏదో అలికిడై నిద్ర మేల్కొని చూస్తే పక్కలో లేదు. అనుకోకుండా బాల్కనీలోంచి బైటికి చూసి ఆశ్చర్యపోయాను. భానుమతి ఇంటి వెనక చెట్లగుబురు వైపు వెళుతోంది...."

సాలోచనగా తలూపాను. "డాక్టర్ సంజీవరావుకు ఫోన్ చెయ్యాలి. నెంబర్ చెప్పండి."

"సిక్స్ వన్ డబుల్ త్రీ ఫోర్ నైన్!"

ఫోన్ వైపు అడుగువేశాను.

"అర్జున్ గారూ!"

ఆగి, అతనివైపు చూశాను.

"విశాలి బొమ్మ భానుమతిని ఎందుకు వెంబడించింది? ఆ గావుకేక ఎవరిది?"

"తెలుస్తుంది. కొద్దిసేపట్లో అంతా తెలుస్తుంది. ఓపిక పట్టండి," అంటూ ఫోన్ దగ్గరికి నడిచి, దానిపక్కనే వున్న టెలిఫోన్ డైరెక్టరీ అందుకుని స్థానిక పోలీస్ స్టేషన్‌కూ, డాక్టర్‌కూ, ప్రదీప్‌కూ ఫోన్లు చేశాను.

## 5

"అదే ప్రదేశంలో మరో మరణం! అదీ అర్ధరాత్రి వేళ ఆవిడ అక్కడికెందుకెళ్ళింది?" అడిగాడు ఇన్

స్పెక్టర్ అయోమయంగా.

నేను ఫోన్ జేసిన అరగంట తరవాత ముందు పోలీసులూ, తరవాత ప్రదీప్, డాక్టర్ హుటాహుటిన వచ్చేశారక్కడికి. పోలీసులు ఇంటి వెనక భాగాన్నీ, భానుమతి పడున్న ప్రదేశాన్నీ క్షుణ్ణంగా పరిశీలించారు.

ఇంటి వెనక నేలపై తివాసీ పరిచినట్టు పచ్చగడ్డి ఉన్నందువల్ల భానుమతి అడుగుల గుర్తులుగానీ, ఆమె ననుసరించి వెళ్ళిన స్త్రీ పాద ముద్రలుగానీ యెక్కడా కనిపించలేదు. శవాన్ని పైకి తెచ్చి, అంబులెన్స్‌లో పోస్టుమార్టంకోసం పంపేశారు పోలీసులు.

భార్య మరణించిన సంగతి తెలియగానే గుండెలు బాదుకుంటూ రోదించాడు వెంకట్రావు. అతన్ని శాంత పర్చడానికి మా తల ప్రాణం తోకొచ్చింది.

ఇన్‌స్పెక్టర్‌కు వివరించాను, నేను చూసిందీ, జరిగిందీ.

అది విన్నాక అతని కళ్ళు మెరిశాయి. "ఆమెను అనుసరిస్తూ ఆ చెట్లవైపు మరో స్త్రీ ఆకారం కూడా వెళ్ళిందంటున్నారు. ఎవరామె? ఈ ఇంట్లో మరో స్త్రీ కూడా ఉందా?"

"లేదు! బొమ్మే....ఆ బొమ్మే నా భార్య ప్రాణం తీసింది...." అన్నాడు వెంకట్రావు రుద్ధ కంఠంతో.

"బొమ్మా! ఎవరా బొమ్మ?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ ఆశ్చర్యంగా.

వెంకట్రావు తన ధోరణిలో చెప్పుకుపోతున్నాడు. "నేను ముందే హెచ్చరించాను. ఎవ్వరూ నమ్మలేదు నా మాట. భానుమతి కూడా! విశాలి చనిపోగానే ఆమె ఆత్మ ఆ బొమ్మను ఆవహించింది. ఇప్పుడది మామూలు ప్రతిమ కాదు. ప్రాణం వచ్చిన ప్రతిమ!"

"మీరు చెప్పేదేమిటో నాకర్థం కావడంలేదు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ అయోమయంగా.

"వాస్తవాన్ని కప్పిపుచ్చడానికీ, మిమ్మల్ని తప్పుదోవ పట్టించడానికీ ఏదో కాకమ్మ కథ కల్పించి చెబుతున్నాడండి. బొమ్మేమిటి? ప్రాణం రావడం ఏమిటి? ఆయన భార్యను చంపడమేమిటి? రండి చూపిస్తాను మీకా బొమ్మను. అప్పుడైనా తెలుస్తుంది ఆయన చెప్పేదేమిటో!" అంటూ గబగబ మ్యూజియం గదివైపు నడిచాడు ప్రదీప్.

అందరం అతన్ని అనుసరించాం! మ్యూజియం తలుపు తెరిచి, లోన లైటు వేశాడు ప్రదీప్. అందులో అడుగు పెట్టాక, "అదుగో, ఆ బొమ్మ గురించే ఇందాక ఈయనగారు చెప్పింది" అన్నాడు ప్రదీప్ షో కేస్‌వైపు చూపుతూ.

ఇన్‌స్పెక్టర్ అడుగులో అడుగు వేసుకుంటూ దాన్ని సమీపించి, అందులోని ప్రతిమను కాసేపు పరిశీలించి, వెంకట్రావువైపు చూశాడు అనుమానంగా.

తరవాత నా వైపు తిరిగి, "భానుమతిగార్ని వెంబడిస్తుండగా మీరు చూసిన బొమ్మ ఇదేనా?" అడిగాడు వ్యంగ్యంగా.

"ఇదేనని నేనవలేదు. ఒడ్డూపొడుగూ, తొడుక్కున్న గౌనూ అచ్చం ఇలాగే వున్నాయన్నాను."

"మీరుగాక కేవలం వెంకట్రావే తన భార్యనెవ్వరో వెంబడించడం చూశానని చెప్పివుంటే, మతి స్థిమితం తప్పి అతనలా అంటున్నాడనుకు నేవాణ్ని. మీరూ అతని వాదనను బలపరుస్తున్నారు గనక అంతా అయోమయంగా వుంది.

ఈ ప్రాణంలేని ప్రతిమ ఏమిటి? ఆయన భార్యను వెంబడించడం ఏమిటి? ఇది కేవలం అపోహ అయితే, మరి మీరిద్దరూ చూసిన ఆ రెండో స్త్రీ ఎవరు? ఆ మెడు భానుమతిని చంపే అవసరం ఏమిటి?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"మీ ప్రశ్నలకు వీళ్ళెవరూ జవాబివ్వలేరు. జరిగిందేమిటో నేను చెబుతాను వినండి. ఒక పద్ధతి ప్రకారం తండ్రీ కూతుళ్ళని హతమార్చి, ఆ ఆస్తినంతా హస్తగతం చేసుకోవాలని వెంకట్రావూ, భానుమతీ కలిసి పథకం వేశారు.

నెలరోజుల క్రితం విశాలి తండ్రిని ఏదో నెపంతో ఇంటి వెనక్కి తీసికెళ్ళి, కిందికి తోసి చంపేశారు. తరవాత నిన్న విశాలికి విషం పెట్టి చంపేశారు.

స్త్రీలలో సహజ సిద్ధంగా పాపచింతన రొుక్కువ. భానుమతి అంతరాత్మ పదేపదే చేసిన పాపాన్ని కెలుకుతూ, ఏదో ఒకరోజు తగిన ప్రాయశ్చిత్తం అనుభవించక తప్పదని హెచ్చరించి వుంటుంది.

ఆ మానసిక వత్తిడిని తట్టుకోలేక, ఆమె స్వయంగా లేచివెళ్ళి, ఇంటి వెనక అగాధంలోకి దూకి ఆత్మహత్య చేసుకుందేమో .... లేదా, వెంకట్రావే ఆమెను అక్కడికి పదమని చెప్పి తానే వెనకనించి తోసి చంపి వుంటాడు.

మొదటినించీ ఆమె ముక్కోపి. మొుంటిఘటం. అతన్ని రాచి రంపాన పెట్టేది. ఆమెతో వేగలేక, రెండు హత్యల రహస్యం తెలిసిన తన భాగస్వామిని మట్టు పెట్టాలనీ అతనే ఆమెను చంపినా ఆశ్చర్యంలేదు" అన్నాడు ప్రదీప్ ఉద్వేగంతో.

అటువంటి నిందారోపణలు విన్నాక ఎంతటి బల

హీనుడైనా ఎగిరి తంతాడు ఎదటి మనిషిని. వెంక ట్రావులో కోపతాపాలు ఉత్పన్నం కావడానికి బదులు-

"నా భార్యను ఆ బొమ్మే చంపింది. అర్జున్ గారు కూడా చూశారు అది భానుమతి వెనక వెళ్ళడం!" అన్నాడు రుద్ధ కంఠంతో.

తలూపాడు ఇన్‌స్పెక్టర్. "ఔను. హంతురాలిని వెంబడిస్తూ గౌను తొడుక్కున్న మరో స్త్రీ కూడా వెళ్ళడం ఈయన కళ్ళారా చూశానంటున్నారు. మరి ఆ మిస్టరీ ఏమిటి?"

"వెరీ సింపుల్! వెంకట్రావుని చూడండి. అతి సామాన్యమైన ఒడ్డూపొడుగు. నెత్తిన లేడీస్ విగ్ పెట్టుకుని, గౌను తొడుక్కుని దూరాన చీకట్లో నడిస్తే ఎవరైనాసరే స్త్రీగా భ్రమిస్తారు. అలాగే, అర్జున్ని మభ్యపెట్టడానికి విగ్గు పెట్టుకుని, గౌను తొడుక్కుని, భానుమతి వెనక వెళ్ళుంటాడు."

"అసంభవం! వెంకట్రావు దగ్గర అంత వ్యవధి లేదప్పుడు. పైగా, ఆయన నడకకూ, నేను చూసిన స్త్రీ నడకకూ చాలా వ్యత్యాసం వుంది" అన్నాను మధ్యలో.

రిస్టువాచీ చూసుకున్నాడు ఇన్‌స్పెక్టర్. "రాత్రి రెండుదాటింది! మీ ఇద్దరి వితండ వాదాన్ని చాలా కూలంకషంగా పరిశీలించాకనే సరైన అవగాహనకు రావాలి. ఉదయం క్రైం బ్రాంచి ఇన్వెస్టిగేటర్లతో సహా మా ఉన్నతాధికార్లు చాలామందే రావచ్చిక్కడికి.

అంతవరకూ మీలో ఎవ్వరూ అనుమతిలేనిదే నగరం విడిచి వెళ్ళకండి. వస్తాను" అంటూ మా వద్ద సెలవు తీసుకుని బైటికి నడిచాడు ఇన్‌స్పెక్టర్. పోర్టికోలో ఆగి వున్న పోలీస్ జీప్ స్టార్టయి వెళ్ళిపోయింది.

6

డాక్టర్ నన్నూ, ప్రదీప్‌నూ పక్కకి తీసికెళ్ళి, "వెంకట్రావు మానసిక స్థితిబాగా బ్రేక్‌డౌన అయినట్టుంది. అతన్ని పైకి తీసికెళ్ళి, నిద్రపోడానికి మందిచ్చి పడుకోబెట్టి వస్తాను" అన్నాడు.

"అంతా నాటకం! మనల్ని బోల్తా కొట్టించటానికి ఆడుతున్న బూటకం!" అన్నాడు ప్రదీప్ మొహం చిట్లిస్తూ.

"విశాలి మరణంతో నీ మస్తిష్కం ఎలా బ్రేక్‌డౌన్ అయిందో, భార్య హఠాన్మరణం అతని మనసును కూడా అలాగే దెబ్బతీసింది. పరిస్థితిని సరిగ్గా అర్థంచేసుకోడంలేదు నువ్వు. అతన్ని మేడమీద పడుకోబెట్టి వస్తానుండండి" అంటూ వెంకట్రావు భుజంమీద చెయ్యివేసి, మెట్లవైపు నడిచాడు డాక్టర్.

"ఎంతైనా వాళ్ళ తొత్తువే కదా నువ్వు. వాణ్ని వెనకేసుకురాక ఏం చేస్తావు!" అంతవరకూ మనుగుతున్న డాక్టర్ మీది అక్కసంతా వెళ్ళగక్కాడు ప్రదీప్.

అతన్ని డ్రాయింగ్ రూంలోకి తీసికెళ్ళి కూర్చోబెట్టాను.

"అరుణ్! ఇన్‌స్పెక్టర్ ముందు వెంకట్రావు కట్టుకథను ఎందుకు బలపర్చావో నాకర్థంకావడంలేదు. ఇంట్లో భానుమతి తప్ప మరో స్త్రీ లేనప్పుడు ఆమెను వెంబడిస్తూ ఎవరు వెళతారు?"

"నువ్వు నమ్మినా, నమ్మకున్నా నేను చూసింది మాత్రం నిజం! ఇన్‌స్పెక్టర్ ఎగతాళి పట్టిస్తాడని చెప్పలేదు కానీ, భానుమతిని వెంబడించిన ఆకారాన్ని చూసిన మరుక్షణం విశాలి బ్రతికి వచ్చిందా అన్న భ్రమ కలిగింది నాకు.

ఆమెను మన కళ్ళముందే దహనం చేశారు గనక, వెంకట్రావు అన్నట్టు ఆ బొమ్మకే ప్రాణంవచ్చి భాను మతిని చంపేసిందా అనిపిస్తోంది!"

"అర్థంపర్థం లేకుండా వాగి, నాకు కోపం తెప్పించక! నీ వాదాన్ని ఈ ఆధునిక జగత్తులో ఎవరైనా నమ్ము తారా? నమ్మడం అటుంచి పగలబడి నవ్వుతారు. నువ్వు చదువుకున్న వాడివి. పైగా, అపరాధ పరిశోధకుడివి. నువ్వే ఇలా మాట్లాడుతుంటే, నీ తెలివితేటలమీద జాలే స్తోంది నాకు."

నేను జవాబిచ్చేలోగా డాక్టర్ వచ్చాడక్కడికి. "వెంకట్రావుకు మత్తుమందిచ్చి పడుకోబెట్టాను. అల సటగా వుంది. వెళ్ళి విశ్రాంతి తీసుకుంటాను. ప్రదీప్! ఇక్కడే వుంటావా నువ్వు?" అడిగాడు.

"అర్జున్‌తో మాట్లాడి వస్తాను. మీరు వెళ్ళండి."

డాక్టర్ నా వైపు చూసి, "మిస్టర్ అర్జున్! ఇలా రండి!" అన్నాడు.

లేచి ఆయన వెంట బైటికి నడిచాను. పోర్టికోలో ఆగి వుంది ఆయన కారు.

సిగరెట్ అంటించి, రెండు దమ్ములులాగి, అడిగాడు, "మీరు నిజంగా భానుమతిని వెంబడిస్తూ ఏదైనా ఆకా రాన్ని చూశారా?"

"ఔను. అంతేకాదు. ఆ ఆకారం విశాలి బొమ్మదేనని కూడా అనుమానంగా వుంది."

డాక్టర్ నవ్వి—"చూడండి. ఈనాటి విజ్ఞానం ఎట్టి పరిస్థితిలోనూ మీ వాదాన్ని నమ్మదు. ఐతే, ఈ విష యంలో ఓ సూచన మాత్రం ఇవ్వగలను. కొందరు ఒక రకం మానసిక రుగ్మత కారణంగా తాము ఊహించు

కుంటున్నదల్లా ప్రత్యక్షంగా వీక్షిస్తున్నట్టే అనుభూతి చెందుతారు.

ఇంట్లో విశాలి శవాన్ని మీరు కళ్ళారా చూశారు. తరవాత స్మశానంలో ఆమె అంత్యక్రియలు కూడా చూశారు. కాలి బూడిదైన మనిషి ఆత్మ జీవంలేని బొమ్మలో విలీనం కావడం హాస్యాస్పదం కాదా?"

"మరి వెన్నెల వెలుగులో నేను చూసిందేమిటి?"

"గదిలో మీరు ఒంటరిగా వున్నారు. మీ మస్తిష్కంలో విశాలి రూపమూ, ఆమె గురించిన ఆలోచనలు తప్ప మరో ధ్యాసలేదు. భానుమతి కనిపించిన వెంటనే ఆమె వెనక విశాలి కూడా నడిచివెళ్ళినట్టు మిమ్మల్ని భ్రాంతికి గురిచేసింది మీ మస్తిష్కం! వెంకట్రావు విషయంలో కూడా సరిగ్గా ఇలాగే జరిగుంటుంది. సరే, వస్తాను. సీయూ!" అంటూ కారెక్కి స్టార్టుచేశాడు డాక్టర్.

కారు మెయిన్ గేటుదాటి నా దృష్టికి దూరమయ్యే వరకూ అక్కడే నిల్చున్నాను.

## 7

నెమ్మదిగా హాల్లోకెళ్ళి, డ్రాయింగ్ రూంలో అడుగు పెట్టాను. ప్రదీప్ నీరసంగా అలాగే కూర్చునున్నాడు సోఫాలో.

నన్ను చూడగానే, "ఏమన్నాడు డాక్టర్?" అడిగాడు.

నేను చెప్పడానికి నోరు తెరిచాను. అంతే!

పైన మేడమీంచి ఒళ్ళు జలదరించి గావుకేక వినిపించింది!

ఇద్దరం తృళ్ళిపడ్డాం!! అది వెంకట్రావు కంఠం!

"ప్రదీప్! హారియప్!" అంటూ తలుపువైపు పరుగు తీశాను.

ఇప్పుడు పైనించి గట్టిగా మూలుగులు వినిపిస్తున్నాయి. ప్రదీప్ కూడా భయ విహ్వలుడై నా వెనక పరుగుత్తు కొచ్చాడు. ఇద్దరం ఆదరాబాదరా మెట్లెక్కి మేడ మీదికి చేరుకున్నాం! వెంకట్రావు గది తలుపు మూసి వుంది. అంతవరకూ వినిపిస్తున్న మూలుగులు ఇప్పుడు స్తంభించిపోయాయి.

గట్టిగా తోశాను తలుపుని. భళ్ళున తెరుచుకుంది. ఇద్దరం లోనికరికి నిర్ఘాంతబోయాం! వెంకట్రావు మంచం మీద వెల్లకిలా పడున్నాడు. గుండెలో పిడివరకూ దిగి వుంది బాకు! అతని కుడి చెయ్యి ఆ బాకు పిడిని పట్టుకు నుంది.

మెరుపులా మంచాన్ని సమీపించి అతని పల్స చూశాను.

స్తంభించి పోయింది!

"ఆత్మహత్య!" ప్రదీప్ కంఠం వణికింది. "అన్ననూ, విశాలినీ, భార్యనూ, చంపాక పట్టుబడతానేమోనన్న భయంతో, పాప భీతితో ఇతని మతి చలించింది. ఈ రాత్రి భార్యను చంపాక తన అంతరాత్మ నోరు నొక్కడంలో విఫలుడై విరక్తి చెంది తననుతానే పొడుచు కున్నాడు."

"డాక్టర్ ఇందాకే చెప్పి వెళ్ళాడు కదా ఇతనికి మత్తుమందిచ్చి నిద్రపుచ్చానని! మత్తుమందు ప్రభావంతో నిద్రపోతున్న వ్యక్తి ఆత్మహత్య ఎలా చేసుకోగలడు? నిస్సందేహంగా ఈ పని విశాలి ప్రతిమే చేసివుంటుంది!" అంటూ గబగబ తలుపు దగ్గరికి పరుగెత్తి, నడవాలో

ఆటూ ఇటూ తొంగిచూశాను, ఎవరూ లేరు!

ప్రదీప్ వైపు తిరిగి, "నేను డాక్టర్ వెంట పోర్చులో వెళ్ళినంత సేపూ నువ్వు డ్రాయింగ్ రూంలోనే వున్నావా?" అడిగాను.

తలూపాడు. "నువ్వు తిరిగి వచ్చేవరకో లోపలే కూర్చున్నాను."

"అదే అనువుగా భావించి విశాలి బొమ్మ మ్యూజియం గదిలోంచి బైటికివచ్చి, నిశ్శబ్దంగా మేడమీదికిచేరి, నిద్రలో వున్న వెంకట్రావుని పొడిచేసుండాలి. గావు కేక వినిపించగానే మనం క్షణంకూడా వృధాచెయ్యకుండా పైకి వచ్చాం! మధ్యలో ఆ బొమ్మ మనకు ఎదురుపడలేదు.

అంటే, అది ఇంకా మ్యూజియంలోకి వెళ్ళలేదన్న మాట. పద. దానికన్నా ముందు మనం అక్కడికెళ్ళి కాచుకుందాం! అది రాగానే రంగుచేతులతో పట్టుకోవచ్చు!" అన్నాను ఉద్వేగంతో.

నాకు పిచ్చిపట్టిందేమో అన్నట్టు అనుమానంగా చూశాడు ప్రదీప్.

"అనవసరంగా ఆలస్యం చెయ్యక పద" అంటూ బైటికి నడిచాను.

వెంకట్రావు శవం వున్న గదిలో ఇక వుండలేక, గబగబ నన్ను అనుసరించాడు ప్రదీప్. ఇంట్లో సూదిపడితే వినిపించే నిశ్శబ్దం ఆవహించి వుంది. బొమ్మ ఉనికి కూడా లేదు ఎక్కడా! క్షణాల్లో మెట్లు దిగి మ్యూజియం గదిని సమీపించాం!

తలుపు ఎప్పటిలాగే వేసివుంది. తోశాను. తెరుచుకుంది. లోన అడుగుపెట్టి నిర్ఘాంతబోయాం! షో కేస్

ఖాళీ!! ప్రతిమ లేదు!!!

అది చూడగానే భయంతో ప్రదీప్ కళ్ళు విప్పారాయి.

తలుపుల్ని తిరిగి యథాప్రకారం దగ్గరగా మూశాను.

"చూశావా? నా అనుమానం వట్టి అనుమానం కాదని ఇప్పుడైనా నమ్మకం కుదిరిందా నీకు?"

"లేదు! మనల్ని తప్పుదారి పట్టించడానికి ఎవ్వరో దాన్ని బైటికి తీసికెళ్ళుంటారు" అన్నాడు ప్రదీప్ కంఠంలో ఆత్మ విశ్వాసాన్ని అరువు తెచ్చుకుంటూ.

"ఇంట్లో వున్నది మనమిద్దరమే! డాక్టర్ నా కళ్ళ ముందే కార్లో వెళ్ళిపోయాడు."

"మనకు తెలీకుండా ఇంట్లో ఎవ్వరో ఉన్నారేమో!"

అతని మాటల్ని పట్టించుకోకుండా గదిలో వున్న లైటార్పడానికి స్విచ్ మీద చెయ్యివేశాను.

"లైటెందుకు కార్పుతున్నావ్?" అడిగాడు ప్రదీప్ భయంగా.

"ష్....మాట్లాడక! అదుగో, బైటినించి యెవ్వరో ఇటే వస్తున్న అడుగుల చప్పుడు వినిపిస్తోంది!" అంటూ చటుక్కున స్విచ్ ఆఫ్ చేశాను.

గదిలో అంధకారం! గాఢాంధకారం!!

ప్రదీప్ ఏదో అనడానికి నోరు తెరిచి, వెంటనే మూసుకున్నాడు. ఆ అడుగుల చప్పుడు తలుపును సమీపించింది అప్పటికే! ఆ నిశ్శబ్ద వాతావరణంలో మెల్లిగా తెరుచుకుంటున్న తలుపు శబ్దం ఒళ్ళు జలదరింప జేసింది.

బాగా బెదిరిపోయినట్టు వేగంగా పీల్చి వదులుతున్న ప్రదీప్ ఉచ్ఛ్వాస నిశ్వాసలు స్పష్టంగా వినిపిస్తున్నాయి

నాను. తలుపు పూర్తిగా తెరుచుకుంది. యెవ్వరో లోన అడుగు పెట్టారు. యథాప్రకారం మళ్ళీ మూసుకుంది తలుపు.

మా పక్కనించి ఓ ఆకారం నడిచి వెళుతున్నట్టు బట్టల సరసర చప్పుడు చాలా స్పష్టంగా వినిపిస్తోంది. అడ నేలను తాకుతూ రాసుకుంటున్న గౌను చప్పుడు. నా చెయ్యి అప్రయత్నంగా లైటు స్విచ్ మీదికి వెళ్ళింది.

మళ్ళీ అప్రయత్నంగా నే దాన్ని ఆన్ చెయ్యకూడదని నిర్ణయించుకున్నాను. ఆ ఆకారం షో కేస్ వైపు వెళుతున్నట్టు సరసర చప్పుడు వినిపిస్తోంది చీకట్లో. భయం వల్ల కాబోలు ప్రదీప్ కంఠంలోంచి చిత్రమైన శబ్దం వెలికివచ్చింది. అంతే!

చటుక్కున ఆగిపోయింది ఆ ఆకారం! ఊపిరి బిగబట్టి చూడసాగాను. రెండు క్షణాల తరవాత ఆ ఆకారం మళ్ళీ షో కేస్ వైపు వెళుతున్న చప్పుడు. ఆ వెంటనే మెల్లగా దాని అద్దాల తలుపు తెరుచుకుంటున్న సవ్వడి.

ప్రదీప్ లో ఇక సహన శక్తి నశించినట్టుంది. "అర్జున్! లైటు వెయ్యి!" అన్నాడు వణుకుతూ.

నేను పలకలేదు. లైటు వెయ్యలేదు.

షో కేస్ తలుపు చప్పుడు మళ్ళీ వినిపించింది. అంటే మూసుకుందన్న మాట!

ప్రదీప్ ఇక ఆగలేకపోయాడు. 'ఛక్'మంటూ అతని చేతిలో లైటర్ వెలిగింది. ఆ లైటర్ పట్టుకున్న అతని చెయ్యి ఎండుటాకులా వణుకుతోంది.

షో కేస్ వైపు చూశాను. దిగ్భ్రాంతితో నా కళ్ళు విప్పారాయి!

విశాలి ప్రతిమ వచ్చేసింది!!

"అర్జున్! ప్రతిమ ఎలా వచ్చింది లోపలికి? నువ్వు తెచ్చావా?" భయంవల్లా, షాక్ వల్లా విచక్షణా జ్ఞానం నశించినట్టుంది ప్రదీప్ లో.

"నేనెలా తెస్తాను? బైటినించి అడుగుల శబ్దం విని పిస్తున్నప్పుడు మనిద్దరం గదిలోనే వున్నాం కదా?" అన్నాను.

తలతిప్పి షో కేస్ వైపు చూశాడు ప్రదీప్. భయంతో గావుకేక పెట్టాడు. ఆ అగురుకు అతని చేతిలో వున్న లైటర్ క్రిందపడి ఆరిపోయింది.

మళ్ళీ చీకటి! చిమ్మ చీకటి!!

"ప్రదీప్! ఏమైంది? ఎందుకలా అరిచావ్?" అడిగాను ఆశ్చర్యంగా.

"ఆ బొమ్మ....ఆ బొమ్మ నన్ను ఉరిమిచూసింది. దాని కనుబొమలు కూడా కదిలాయి."

"నీకు ప్రియమైన విశాలి బొమ్మేకదా? ఎందుకంతగా భయపడాలి? ఇక్కడే వుండు. నేను హాల్లోకెళ్ళి డాక్టర్ కూ, పోలీసులకూ ఫోన్ జేసి వస్తాను."

"వద్దు. నువ్వే ఉండిక్కడ. నేవెళ్ళి ఫోన్ జేస్తాను" అంటూ తలుపువైపు నడవబోయాడు ప్రదీప్.

అతని చెయ్యి పట్టుకున్నాను. "ఇంతసేపూ ప్రతిమకు ప్రాణం రావడమేమిటని నాతో వాదించావు కదా? ఇప్పుడు నువ్వెందుకిలా భయపడుతున్నావ్?"

"ఎందుకో....ఎందుకో .... నాకే తెలీదు .... నువ్వు చెప్పింది నిజమే నేమో?"

"అటువంటప్పుడు నువ్వింకా ఆనందించాలి కదా? మనసారా ప్రేమించిన ప్రేయసి ఆత్మ ఆమె ప్రతిరూపంలో జీవం పోసుకున్నందుకు పరవశించడంపోయి,

ఎందుకిలా భయపడుతున్నావు?"

ప్రదీప్ పలకలేదు. గజగజ వణుకుతున్నాడు.

## 8

"చేజేతులా నన్ను చంపినవాడు నా ఆత్మను చూసి ఎందుకు ఆనందిస్తాడు?" గదిలో మారుమ్రోగింది స్త్రీ కంఠం.

వెంటనే పోల్చుకున్నాను ఆ కంఠాన్ని! అది విశాలి కంఠం!

"నిన్ను చంపింది ప్రదీపా?" నోరు తెరిచాను దిగ్భ్రాంతితో.

"ఔను. అతనే! అంతేకాదు, నా తండ్రినీ, పిన్ని భానుమతినీ, చిన్నాన్ననూ చంపింది కూడా అతనే!"

"ఏమిటి నువ్వంటోంది? ఇంతమందిని చంపితే ఇతనికి ఒరిగేదేమిటి?" అడిగాను నివ్వెరబోతూ.

"ఆస్తి! నాకు చెందిన యావదాస్తి!!"

"నీకు చెందిన ఆస్తి ఇతనికెలా సంక్రమిస్తుంది? ఇతనికీ, నీకూ ఏమిటి సంబంధం?"

"భార్యాభర్తల సంబంధం!"

"వా....ట్!?"

"ఔను, మూడు నెలలక్రితం మేము రహస్యంగా రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్ళిచేసుకున్నాం!"

చీకట్లో ప్రదీప్ చెయ్యి పట్టుకున్నాను గట్టిగా. "ప్రదీప్! చెప్పు. నిజం చెప్పు. ఇదంతా నిజమేనా?"

అతను పలకలేదు. వణుకుతున్నాడు.

"నువ్వు కాదన్నా రిజిస్ట్రార్ ఆఫీసులో కనుక్కుంటే తెలిసిపోతుంది. చెప్పు, విశాలీ, నువ్వూ పెళ్ళిచేసుకున్నారా?" రెట్టించాను.

"ప్లీజ్! బైటికి పద. ఈ విషయాలు బైట కూడా మాట్లాడుకోవచ్చు. ఈ గదిలో ఇక ఒక్క క్షణంకూడా నేనుండలేను" అన్నాడు నన్ను తలుపువైపు లాగుతూ.

ఒడిసి పట్టుకున్నానతన్ని. "వీల్లేదు. ఇక్కడే చెప్పాలి. ఊఁ, త్వరగా చెప్పు!" అరిచాను.

అంతలో షో కేస్ తలుపు తెరుచుకుంటున్న శబ్దం వినిపించింది. ప్రదీప్ గింజుకోసాగాడు. రక్కుతున్నాడు నా చేతుల్ని. అంతమాత్రాన నా ఉక్కు పిడికిళ్ళు అతన్ని వదిలి పెడతాయా?

"అనవసరంగా ఆయాసపడక! నిజం చెప్పు. విశాలిని పెళ్ళి చేసుకున్నావా?"

"ఔను. చేసుకున్నాను" గత్యంతరంలేనట్టు నీరసంగా పలికాడు.

"విశాలినీ, ఆమె తండ్రినీ, భానుమతినీ, నువ్వే చంపావా?"

మౌనం! ఇప్పుడు షో కేస్ తలుపు పూర్తిగా తెరుచుకుంది.

"అదుగో, విశాలి ఆత్మ బొమ్మరూపంలో వచ్చేస్తోంది. నిన్ను చంపి, తన ప్రతీకారం తీర్చుకుంటుంది. నువ్వు ఆమెను కాదు, ఆమె ఐశ్వర్యాన్ని ప్రేమించావనీ, ఆ ఐశ్వర్యాన్ని కైంకర్యం చేసుకోడానికే ఆమెతో రహస్య పెళ్ళి నాటకమాడావనీ ఇప్పుడర్థమౌతోంది.

ముందామె తండ్రిని తుదముట్టించి, తరవాత ఆమెను చంపేశావు. నీమీద ఎవ్వరికీ అనుమానం రాకుండా, ఆమె శవాన్ని పోస్టుమార్టం జరిపించాలనీ, వెంకట్రావు దంపతుల మీద అనుమానం మళ్ళించాలనీ అద్భుతమైన

నాటకమాడావు.

ఒకవేళ పోస్టుమార్టం జరిగినా, ఆమె విష ప్రభావంలో మరణించినట్టు తేలినా, హత్యా నేరం ఆ భార్యాభర్తలిద్దరిమీదా మోపబడుతుందనీ, ఆ విధంగా వారి అడ్డు తొలిగాక నింపాదిగా నువ్వు విశాలి భర్తవని నిరూపించుకుని, ఆస్తిని ఆరగించవచ్చనీ ఎత్తు వేశావు.

పోస్టుమార్టం ఎత్తు పారకపోడంతో, వెంకట్రావు మాటిమాటికీ విశాలి ఆత్మ ఆమె బొమ్మను ఆవహించిందనే భయాన్ని ఆధారం చేసుకుని, ఆ భార్యాభర్తల అడ్డు తొలగించుకోవాలని భావించావు.

ఈ రాత్రి భానుమతిని ఇంటి వెనక అగాధంలోకి తోసి చంపేశావు. దానికి తోడు నేనూ, వెంకట్రావూ భానుమతిని వెంబడించిన విశాలి ప్రతిమను చూడటం కూడా కలిసి వచ్చింది. ఐతే, భానుమతి వంటి మనిషిని ఇంటి వెనక్కి ఎలా రప్పించావో ఇప్పటికీ నాకర్థం కావడంలేదు.

ఆ తరవాత, వెంకట్రావును మేడపైన పడుకోబెట్టి డాక్టర్ కిందికి రావడం, నన్ను బైటికి తీసికెళ్ళడంతో ఆ అవకాశాన్ని జారవిడవకుండా పిల్లిలా మేడమీదికెళ్ళి అతని గుండెలో బాకుదింపి, శరవేగంతో తిరిగి డ్రాయింగ్ రూంలోకి వచ్చి కూర్చున్నావు.

అదే సమయంలో నేనక్కడికి రావడం, పైన వెంకట్రావు చావుకేక వినిపించడం జరిగింది! మత్తుమందు ప్రభావంలో పడున్న వెంకట్రావుకు తన గుండెలో దిగిన బాకు సంగతి వెంటనే తెలియలేదు.

చివరిక్షణంలో అతని మత్తు వదిలి, మస్తిష్కం జాగృతమై, మరణ భయాన్ని సూచించింది. అందుకే

అంత ఆలస్యంగా అతని కేక వినిపించింది. మనం పైకెళ్ళి చూసేలోపలే అతని ప్రాణం పరలోకానికి ప్రయాణమైంది.

అతను కూడా పాప భీతితో ఆత్మహత్య చేసుకున్నాడని చెప్పావు. ఐతే, మత్తుమందు ప్రభావంలో వున్న వ్యక్తి ఆత్మ హత్య ఎలా చేసుకుంటాడు? అంతేకాదు, డాక్టర్ పట్ల నువ్వు నాలో ఏర్పరచిన అనుమానం కూడా అప్పుడే తొలిగిపోయింది.

ఈ వ్యవహారంలో డాక్టర్‌కు సంబంధం వుంటే, వెంకట్రావుకు మత్తుమందిచ్చి పడుకోబెట్టానని ఆయన నాతో చెప్పేవాడేకాదు. ఆ విధంగా వెంకట్రావు మరణాన్ని ఆయన ఆత్మహత్యగా యెలా చిత్రించగలడు....?"

నా మాట ఇంకా పూర్తికాలేదు. షో కేస్ దగ్గరి నుంచి విశాలి ప్రతిమ మమ్మల్ని సమీపిస్తున్నట్టు గొను కరకర శబ్దం వినిపించసాగింది.

"అర్జున్! ప్లీజ్, నన్ను కాపాడు. వెంటనే నన్ను బైటికి తీసికెళ్ళు" భయంతో ప్రదీప్ ఒళ్ళు జలదరిస్తోంది.

"చేసిన నేరాన్ని ఒప్పుకుంటేనే, నీ ప్రాణాలు కాపాడేది. చెప్పు. విశాలినీ, ఆమె తండ్రినీ, వెంకట్రావునూ, భానుమతినీ ఎవరు చంపారు?"

"నేనే! నేనే చంపాను!!"

అంతే! బైటినించి ఎవ్వరో భళ్ళున తోశారు తలుపుల్ని. మరుక్షణం నలుగురైదుగురు లోనికి వచ్చినట్టు బూట్ల శబ్దం వినిపించింది. నేను ఆశ్చర్యంలోంచి తేరుకోకముందే 'ఛక్' మని వెలిగింది లైటు. స్విచ్ మీంచి

చెయ్యి తీసున్న డాక్టర్ సంజీవరావునీ, పోలీసుల్నీ చూసి చకితుణ్ణయిపోయాను.

ఆ షాక్ను తట్టుకోలేక ప్రదీప్ అమాంతం వెనక్కి విరిగిపడి మూర్ఛపోయాడు. వారిసంగతలా ఉంచి, నాకు చేరువలోనే నిల్చున్న విశాలిని చూసి నోరు తెరిచాను. ఆమె బొమ్మ విశాలి కాదు!!

పంచప్రాణాలున్న పరిపూర్ణ విశాలి!!!

"విశాలీ! నువ్వు బ్రతికే వున్నావా?" అడిగాను దిగ్భ్రాంతితో.

ఆమె నవ్వింది. "అవును. బ్రతికే ఉన్నాను."

"మరి నేను చూసిన శవమూ, శ్మశానంలో నీ అంత్యక్రియలూ?"

"అది నేను కాదు. మూసపోసినట్టు నన్ను పోలిన నా నిర్జీవ ప్రతిమ. అసలు నేరస్తుల్ని పట్టుకోవడానికి నేను మరణించానని ప్రకటించి, నా ప్రతిమకు అంత్యక్రియలు జరిపించి, డాక్టర్ గారే ఈ నాటకమంతా ఆడించారు."

"ప్రదీప్ను రహస్యంగా పెళ్ళిజేసుకునే అగత్యం ఎందుకొచ్చింది నీకు?"

"మొదటినించీ నాన్నకు ఇతనిమీద సదభిప్రాయం లేదు. చదువుకునే రోజుల్లోనే నాకు నచ్చచెప్పేవారు ఇతనితో స్నేహాన్ని పెంచుకోవద్దని. ఐనా నే నాయన మాటలు పట్టించుకోలేదు. ప్రేమ గుడ్డిదంటారు అందుకే నేమో!

చదువు పూర్తయ్యాక ఒకరోజు నాన్నతో మా పెళ్ళి ప్రస్తావన ఎత్తాను. ససేమిరా వీల్లేదన్నారు. తన మిత్రుడి కొడుక్కి నన్నిచ్చ్వదలచినట్టు కూడా చెప్పారు. దాంతో నాలో పంతం పెరిగింది.

దానికి తోడు ఇతనుకూడా నన్ను రహస్యంగా పెళ్ళి చేసుకుందామనీ, ఆ పెళ్ళిని కొంతకాలం గోప్యంగా ఉంచి, ఆతరవాత నిదానంగా నాన్నకు తెల్పితే ఆయనే దారికి వస్తాడనీ నూరిపోశాడు.

పూర్తిగా ఇతని మాయలోపడ్డ నేను వెంటనే అందుకు ఒప్పుకున్నాను. స్నేహితులతో విహారయాత్ర సాకు చెప్పి హనీమూన్ కూడా వెళ్ళొచ్చాం. ఆ తరవాత నెల రోజుల క్రితం హఠాత్తుగా నాన్న చనిపోయారు.

ఆయన మరణాన్ని ప్రమాద వశాత్తూ జరిగిన దుర్ఘటనగానే భావించాను. నాన్న మరణంతో ఇతను మా ఇంటికి రావడానికి ఏ ఆటంకమూ లేకపోయింది. ఇప్పుడయినా మా పెళ్ళి విషయాన్ని లోకానికి తెల్పడం మంచిదని చెప్పాను.

కొన్నాళ్ళు పోయాక అందర్నీ పిల్చి శాస్త్రోక్తంగా మళ్ళీ పెళ్ళి చేసుకుందామని చెప్పాడు. అదీ మంచిదే అని ఊరుకున్నాను. నాన్న మరణంతో మనసు బాగులేక నేను బాగా నీరసించిపోయానని డాక్టర్ గారు ఓ టానిక్ రాసిచ్చారు.

అది తాగిన రెండు రోజులు ఏమీ జరగలేదు. మూడో రోజు త్రాగి పడుకోగానే విపరీతమైన వాంతులూ, విరేచనాలూ ప్రారంభమయ్యాయి. వెంటనే డాక్టర్ గారికి ఫోన్ జేసి పిలిపించాడు చిన్నాన్న. ఎంతో ప్రయత్నం మీద ఆయన నన్ను కాపాడగలిగారు.

ఆ టానిక్ మీద ఎందుకో ఆయన కనుమానం వేసింది. వెంటనే దాన్ని లాబొరేటరీలో పరీక్ష చేయించారు. అప్పుడు తెలిసింది అసలు రహస్యం టానిక్ లో విషం కలిపి వుందని.

అది చిన్నాన్నా, చిన్నమ్మల పనే అయుంటుందని డాక్టర్ గారికీ, నాకూ పూర్తిగా అనుమానం బలపడింది. కారణం నాతో బాటు ఇంట్లో వుండేది వాళ్ళిద్దరే గనక. అంతేకాదు, నాన్న మరణానిక్కూడా వాళ్ళే కారణమై వుంటారేమోనన్న సందేహం కూడా కలక్కపోలేదు.

ఐతే నిజాన్ని యెలా నిరూపించడం? వారి నోట నేరాన్ని యెలా వొప్పించడం? ఆలోచించి ఓ పథకం తయారు చేశారు డాక్టరుగారు. నిన్న ఉదయం యెంతకీ నా గది తలుపు తెరుచుకోకపోడంతో చిన్నాన్న తలుపు తోసి లోపలికొచ్చాడు.

ఆయన రాకకోసమే యెదురుచూస్తున్న నేను ఊపిరి బిగబట్టి అచేతనంగా మంచంమీద పడుకున్నాను. ఎంత పిల్చినా పలకలేదు. దాంతో ఆయన ఖంగారుపడి డాక్టర్ గారికి ఫోన్ జేశారు.

ఆయన వచ్చి నన్ను పరీక్షించి మరణించినట్టు ప్రకటించారు. తరవాత నన్ను డ్రాయింగ్ రూంలో పడుకోబెట్టారు. డాక్టర్ గారు ఇంట్లో వాళ్ళని అటూ యిటూ పంపి, ఇక్కడున్న నా ప్రతిమను మోసుకెళ్ళి డ్రాయింగ్ రూంలో నా స్థానంలో పడుకోబెట్టి, మెడ వరకూ దుప్పటి కప్పి అక్కణ్ణించి తప్పుకున్నారు.

చిన్నాన్న మేడ మెట్లు దిగి డ్రాయింగ్ రూంవైపు వస్తుండగా ఆయనకు కనిపించేలా ఈ గదిలోకి వచ్చి తలుపు మూసుకుని షో కేస్‌లో బొమ్మలా నిల్చున్నాను. దాంతో అది వరకు ఆయన ముందు నేను వ్యక్తం జేసిన భయం నిజమేననీ, చనిపోయిన నా ఆత్మ మ్యాజికయం గదిలోని బొమ్మలో విలీనమైందనీ భ్రమించాడు.

ఆ తరవాత స్మశానంలో బొమ్మను చితి మధ్య వుంచి

నప్పుంటించి వర్షం వస్తుందన్న నెపంతో అందర్నీ అక్క డ్నుంచి యింటికి తరలించారు డాక్టర్ గారు. తరవాత అందరూ వెళ్ళిపోయాక చిన్నాన్న, మీరూ, పిన్ని మేడ మీది కెళ్ళారు.

నేను షో కేస్ లోంచి బయటికి వచ్చి ఈ గదిలో షే పచార్లు చేస్తూ నా తరవాతి కార్యక్రమం గురించి ఆలో చించసాగాను. రాత్రి పది గంటలు దాటాక యెవరో మేడ మెట్లు దిగి కిందికి వస్తున్నట్టు అడుగుల చప్పుడు వినిపించింది.

తలుపు సందులోంచి హాల్లోకి చూశాను. పిన్ని మెట్లు దిగి హాల్లోంచి బయటికెళ్ళే తలుపు వైపు వెళుతోంది. అంత రాత్రి ఒంటరిగా ఆమె యెక్కడికి వెళుతోందా అని ఆశ్చర్యం వేసింది నాకు.

ఆమె బయటికెళ్ళాక నేనూ ఈ గదిలోంచి బయట పడి హాలు తలుపు కొద్దిగా తెరిచి తొంగి చూశాను. మసక వెలుతుర్లో పిన్ని మేడ వెనక్కి వెళుతూ కనిపిం చింది. ఆమెను కాస్త ముందుకు పోనిచ్చి పిల్లిలా వెంబ డించాను.

పిన్ని మేడ వెనక సీతాఫల చెట్ల గుబురు దగ్గరికి వెళ్ళడం చూసి నివ్వెరబోయాను. ఆమె కంటికి కనబడ కుండా నేనూ ఓ పెద్ద మాటున నక్కి చూడసాగాను. చెట్ల కవతల నిల్చుని ఆమె ఎవరితోనో మాట్లాడుతోంది. ఆమెతో మాట్లాడుతున్నది మగకంఠమనీ, అది నాకు సుపరిచితమేనని వెంటనే పసిగట్టాను. అంతే! కొద్ది క్షణాల్లోనే పిన్ని గావుకేక వినిపించింది. మరుక్షణం పొదల వెనకనించి మెరుపులా ఓ మగ ఆకారం ఇవతలికి వచ్చి గబగబ ఇంటి ముందు భాగం వైపు వెళ్ళసాగింది.

వెన్నెల మసక వెలుగులో ఆ ఆకారాన్ని పోల్చుకుని నిర్ఘాంతపోయాను. అతను ఎవ్వరో కాదు, సాక్షాత్ ప్రదీపే. పిన్ని అతన్ని అక్కడ ఎందుకు కలుసుకుంది? ఆమెకూ, అతనికీ ఏమిటి సంబంధం? ఇంతవరకూ నాకు అంతుపట్టని విషయాలివి!

ప్రదీప్ ఆ పొదల దగ్గర్నించి పిన్నిని అగాధంలోకి తోసేశాడనీ, సరిగ్గా ఆ ప్రదేశంలోనే నాన్న పడిపోయి ప్రాణాలు పోగొట్టుకున్నాడనీ, ఇంతవరకూ నే ననుమానిస్తున్నట్టు చిన్నాన్నా, పిన్నీ దోషులు కారనీ, ఆస్తి కోసం ప్రదీపే ఈ నాటకం ఆడుతున్నాడనీ తెలిసిపోయింది నాకు.

అంతలో మేడమీద మీరున్న గది తలుపులు భళ్ళున తెరుచుకోవడం విన్నాను. అంటే పిన్ని గావుకేక మీరూ విని వుంటారనీ, మేడ వెనక్కి రావచ్చనీ భావించి గబ గబ ఇంటివైపు నడిచాను. అప్పుడే మీరు మరో పక్కనించి మేడ వెనక్కి రావడం, నన్ను పిలవడం జరిగింది.

నేను మౌనంగా ఇంట్లోకి వచ్చి తిరిగి ఈ గదిలో మూరి షో కేస్‌లో నిల్చున్నాను. ఆ తరవాత పోలీసులూ, డాక్టర్ గారూ, ప్రదీప్ రావడం, నన్ను చూడటం, ప్రతిమగా భావించి వెళ్ళిపోవడం జరిగింది.

డాక్టరుగారు చిన్నాన్నను మేడమీద వదిలి, కిందికి వచ్చి మీతో మాట్లాడాలని బయటికి తీసికెళ్ళారు. నేను తలుపు సందులోంచి అంతా చూస్తూనే ఉన్నాను.

మీరలా వెళ్ళగానే ప్రదీప్ గబగబ మెట్లెక్కి మేడ మీది కెళ్ళడం కనిపించింది. యేదో అనుమానం వేసి అతని వెనకే పిల్లిలా పైకి చేరాను. అప్పటికే అతను చిన్నాన్న గుండెలో కత్తి దింపి, బయటికి వస్తూండటం

కూడా జరిగిపోయింది. అతనికి కనబడకుండా మెరుపులా మీద కేటాయించిన గదిలో దూరి తలుపు చాటున నక్కాను.

అతను కిందికెళ్ళడం, ఆ వెంటనే చిన్నాన్న గావు కేక వినిపించడం, మీ ఇద్దరూ పైకి రావడం, తరవాత నన్ను పట్టుకోవాలని మ్యూజియం గదిలో దూరి తలుపు మూసుకోవడం జరిగింది.

నేను మెల్లిగా మెట్లు దిగి హాల్లోని టెలిఫోన్ ద్వారా పోలీసులకూ, డాక్టర్ గారికీ ఫోన్లు చేసి, కొంత సేపయ్యాక మూసి వున్న మ్యూజియం గది తలుపు తోసి చీకట్లో లోనికి వచ్చాను.

ఆ లోపల డాక్టర్ గారే పోలీసుల్ని వెంటబెట్టుకొని వచ్చి తలుపు కవతల నిల్చున్నారు. ప్రదీప్ తన నేరాన్ని అంగీకరించగానే లోపలికి వచ్చేశారు" అంటూ ముగించింది విశాలి.

ప్రదీప్ వైపు చూశాను. ఇంకా స్పృహరాలేదతనికి.

పోలీసులు నేలమీంచి అతన్ని లేపి బయటికి తీసికెళ్ళసాగారు.

అటువంటి నీచుడ్ని ప్రేమించినందుకు, ఐన వాళ్ళను పోగొట్టుకున్నందుకు చేతుల్లో మొహం కప్పుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది విశాలి.

నేనూ, డాక్టర్ చేష్టలుడిగి చూస్తూ నిల్చుండిపోయాం శిలా ప్రతిమల్లా.

—: అ యి పో యి ం ది: —

# విందు వంటకాలు

## కె. బి. ఎస్. కుమార్

ఈ వూళ్ళో వంటలు బ్రహ్మాండంగా చేసే వ్యక్తుల్లో రామచంద్రుణ్ని మొదటి వాడుగా చెప్పుకోవచ్చు. ఈ వూళ్ళోనే కాదు, చుట్టు ప్రక్కల వున్న వూళ్ళన్నీ కూడ రామచంద్రుణ్ని వంటలయ్యగా బాగా స్నేహం చేసుకున్నాయి. ఎవరి పెళ్ళి జరిగినా వంటలు చెయ్యటానికి ముందుగా రామచంద్రుణ్నే కన్సల్టు చేస్తారు అందరూ. రామచంద్రుడు 'కాల్ షీటు' ఇవ్వకుంటే చప్పగా నిట్టూర్చిగాని అవతలివాడి వద్దకి పోరు.

పెళ్ళికీ, తద్దినానికీ, బారసాలకీ, గృహప్రవేశాలకీ, ఆలయాల్లో దేవుడి ప్రతిష్ఠలకీ - ఒకటేమిటి? ప్రతి ఫంక్షనుకీ రామచంద్రుడికి పిలుపు వస్తూంటుంది.

ఆ రామచంద్రు డెవరో కాదు, నేనే!

మా బామ్మ వంటలు చేసేదిట. మా నాన్న వంటలు చేసి మమ్మల్ని పోషించాడు. ప్రస్తుతం ఆ వృత్తిలో నేను దిగాను.

నిజానికి మా నాన్నకి నన్ను బాగా చదివించాలని మహా యిదిగా వుండేది. కాని నన్ను యెక్కువ చదువు చదివించే స్తోమత ఆయనకి లేదు. అంచేత నేను స్కూల్ ఫైనల్ వరకు మాత్రమే చదవ గలిగాను, లెక్కల్లో పోయింది. మళ్ళీ కట్టమన్నాడు నాన్న. నేనే వద్దన్నాను.

అప్పటికి నా చెల్లెలు సునీత ఎనిమిది చదువుతోంది. తమ్ముడు సుధాకర్ ఆరవ తరగతి.

అమ్మకి ఎప్పుడూ ఏదో ఒక జబ్బు వస్తోంటుంది. ఆమెకు ఉబ్బస వ్యాధి వుంది. అది తరచూ క్రొత్త రోగాలను కొనుక్కుంటుంటుంది. అది ఆమె తప్పు కాదు.

ఒకసారి నాన్నకి హైదరాబాదుకి పిలుపు వచ్చింది. ఈ వూరి అమ్మాయిని హైదరాబాదుకిచ్చారు. అబ్బాయి డాక్టరు. కన్యదాత స్వగృహంలోనే వివాహం జరిగింది. అంటే ఈ వూళ్ళోనే నన్నమాట.

ఆ పెళ్ళికి మా నాన్నే వర్కు చేశాడు.

మా నాన్న వంటలు రుచి చూసిన పెళ్ళికొడుకు తరఫు వాళ్ళు సిటీలో వాళ్ళరేంజ్ చేసిన రిసెప్షన్‌కి మా నాన్నే స్వీట్సూ వగైరాలు చెయ్యాలన్నారు.

అంగీకరించక తప్పలేదు నాన్నకి.

నాన్నకి అమ్మ అసిస్టెన్స్ ఇస్తుంది. అంటే కూరగాయలు తరగడం, బియ్యం వగయిరాలు కడగటం మొదలయినవి. నీళ్ళు తేవటం, విజిటబుల్స్‌ని సెపరేట్‌గా బాయిల్ చెయ్యటం వగయిరా పార్ట్‌టైమ్ డ్యూటీలు నావి.

పెళ్ళికూతురు తండ్రి మా నాన్నగారికి సన్నిహితుడు కావటంతో రిసెప్షన్‌కైనా ఒప్పుకున్నాడు గాని - లేక

పోతే ఒప్పుకునేవాడు గాదు ఆ దేటుకి.

ఎందుకంటే అదే రోజు నా పరీక్ష. అక్టోబరు పరీక్ష.

వృత్తి ధర్మాన్ని ఎగగొడితే భుక్తి జరగదు కాబట్టి పరీక్ష మానేసి హైదరాబాదు రైలు ఎక్కాల్సి వచ్చింది అందరమూ.

అలా ఆనాడు నా పరీక్ష పోయింది.

మళ్ళీ కట్టలేదు నేను.

అమ్మ ఆరోగ్యం కృష్ణపక్ష చంద్రుడిలా అయిపోతోంది. నాన్న కూడ మెత్తబడుతున్నాడు. భావి యజమానినైన నేను నా చెల్లినీ, తమ్ముడ్నీ యెలా పోషించాలి? ఎక్కువ చదివే స్తోమత లేదు. చదివిందానికి ఉద్యోగార్హత లేదు.

అంచేత నాన్నకి 'అసోసియేట్'గా చేరిపోయాను.

బహుశ నాన్నకూడ నాకు మల్లే ఆలోచించారేమో, అభ్యంతర పెట్టలేదు.

ఎనిమిదేళ్ళు గడిచాయి. ఈ ఎనిమిదేళ్ళలో నాకు సంబంధించి చాలా మార్పులు జరిగాయి. ఉబ్బసవ్యాధి అధికమై మంచం పట్టిన మా అమ్మ ఓ రోజు తెల్లారేసరికి 'బొమ్మ'గా, ఆ మధ్యాహ్నానికి బూడిదగా మారిపోయింది. ఆ తర్వాత నాలుగేళ్ళకి మా నాన్న—ఓ రోజున పదిహేను కిలోల బియ్యం ఉడికే గుండిగని గంజి వంచటంకోసం నాతోబాటు దింపుతూ గుండె పట్టుకొని—గంజి అంతా జారేలోగా ఈ లోకంనుండి జారుకున్నాడు.

తండ్రిని మించిన తనయుడిగా నాకు పేరు ప్రతిష్ఠలు వచ్చేశాయి.

సుధాకర్ అతి కష్టంమీద టెన్తు పాసయి—పుష్టిగా

ఎత్తుగా ఎదగటంతో ఎర్ర టోపీ కానిస్టేబుల్‌గా సెలక్టయి — ప్రస్తుతం అనంతపురంలో ట్రెయినింగు పొందుతున్నాడు.

సునీత. మిగిలింది సునీత బాధ్యత ఒక్కటే. అది యింటర్ పాసయింది. ఈ ఊళ్ళోనే మహిళామండలి వాళ్ళు స్థాపించిన స్త్రీల కుట్టు సెంటర్‌కి పోతోంది.

తన జాకెట్లూ చీరలకి అంచులూ ఫాల్సూ మొదలైనవన్నీ తనే కుట్టుకునేది. ఇరుగుపొరుగు అమ్మలక్కల డ్రెస్సులుకూడా కుట్టేది. అందుకే దానికో కుట్టుమిషన్ కొనిచ్చానుగూడ.

ముఖ్యమైన బాధ్యత ఒకటి వుంది—దాని పెళ్ళి. మంచి రోజు చూసి దాన్ని అయ్యచేతిలో పెడితే ఇక నాకే చింతా వుండదు.

కాని టైమ్ దొరికేది కాదు నాకు. నా కళ్ళెదురుగా ఎన్నో పెళ్ళి ముహూర్తాలు జరిగిపోతున్నాయి. అన్నీ పారిపోతున్నాయి. వాటికి వర్కు చెయ్యవలసిందిగా ఆర్డరు రావటంతో నా చెల్లికి వరుణ్ని చూసే తీరిక, వివాహంచేసే వ్యవధి దొరికేది కాదు నాకు.

ఆనాడు మా నాన్న స్థోమతలేక నన్ను చదివించలేక పోయాడు. ఈనాడు నేను తీరికలేక సునీత పెళ్ళి చెయ్యలేక పోతున్నాను. ఈ విషయంలో మాత్రం నేను పేరు ప్రఖ్యాతులు ఇనుమడించిన వంటలయ్యాని తప్ప అని తృప్తిపడలేక పోతున్నాను.

కాని ఆ బాధకూడా లేకుండా చేసింది సునీత.

తనెవర్నో ప్రేమించిందిట. అతను లేకపోతే తను బ్రతకలేదుట. అతడి వివరాలు నాకు నచ్చవుట.

అంచేత.... నా చెల్లెలు అతడితో లేచిపోయింది.

ఆ విషయం గుర్తువచ్చినప్పుడంతా నా కళ్ళు తడుస్తూనే వున్నాయి. అంటే నెల రోజుల్నుండీనన్న మాట.

కాని అవన్నీ కేర్ చెయ్యను. వుల్లిపాయ తరుగుతోన్నప్పుడు కళ్ళనీళ్లు వస్తుంటాయి. ఈ నీళ్ళు ఆ బాపతే ననుకొని సరిపెట్టుకుపోతూంటాను.

ఎందుకంటే అదే మనసులో వుంచుకొని బాధపడుతోంటే కూరల్లో ఉప్పు పాళ్ళలో కారమూ కారం పాళ్ళలో పసుపూ పడతాయి. అప్పుడు నా వృత్తిలో నాకు చెడ్డ పేరు వస్తుంది. ప్రిస్టేజితో పాటు ఇమేజి కూడా పోతుంది.

అలాగని చెల్లిపై ప్రేమలేని వాడిననిగాదు.

దీన్ని పౌరుషం అంటారనుకుంటాను.

ఇన్నేళ్ళుగా పెంచి చదువూ అదర్ క్వాలిఫికేషన్సూ చెప్పించి — లడ్డు నేనైతే నాలోని తియ్యదనం నా చెల్లెలుగా మా మధ్య పెనవేసుకున్న ప్రేమని విస్మరించి నా తోడబుట్టిన చెల్లెలూ— నా సునీత — నన్ను వదిలి — మరచి — ఎవడితోనో లేచిపోయింది. పాకంలో కాక — పక్కన వేసిన బూందిలా చప్పగా మిగిల్చిపోయింది.

కాని నేనలా మిగిలిపోలేదు. ప్రస్తుతం ఈ చప్పిడి బూంది 'వృత్తి ధర్మం' అనే కారప్పొడిని పులుపుకొని కారబ్బూందిగా మారిపోయింది. అందుకే రుచిగా వుంది. రుచిని పంచుతోంది!

కాని నా చెల్లెలు ఒక వెర్రివాడిని ప్రేమించినా (అయినా అలాంటివాణ్ని నా చెల్లెలు ప్రేమిస్తుందా) వాడికివ్వటానికి వెనుదియ్యానని దానికి తెలీదు పాపం!

మొత్తంమీద నేను ఒంటరి వాణ్ణయిపోయాను. కొన్ని రోజులు చాల కష్టమనిపించింది. అయితే ఈ

ఒంటరితనం వంటల్లో కాదు, జీవితంలో.

వృత్తి విషయంలో నాకు నలుగురు అసిస్టెంట్లున్నారు. మొదటి వ్యక్తి యంగ్ విడో, పేరు లక్ష్మి. రెండో వ్యక్తి సరోజిని, మూడో వ్యక్తి పద్మావతి. పదహారేళ్ళ పడుచు. మొన్నటి వరదల్లో వున్న తల్లి పోయి అనాథైంది. నాలుగవ వ్యక్తి జిడ్డుగాడు. వాడు నాకు కుడి భుజం.

నేను పేరుకి మాత్రమే శ్రీరామచంద్రుణ్ని. పేరుకి మాత్రమే శ్రీరామచంద్రుణ్ని గాబట్టి ఆ ముగ్గురితోనూ అడ్జస్టయిపోతుంటాను అవకాశాన్నిబట్టి. ఆ విషయంలో నే సరోజిన్ని అనుమానించి ఆమె భర్త ఆమెని వదిలేశాడని నా అనుమానం.

అయినా తాగొచ్చి రోజూ పెళ్ళాన్ని కొట్టక శాస్త్ర ప్రేమతో చూసుకుంటే వ్యవహారం నాదాకా యెందు కొస్తుంది అనుకొని యిందులో నా పాపం ఏమీ లేదని సర్దుకుపోతుంటాన్నేను.

ఈ అడ్జస్టుమెంటు విషయం ఒకరికొకరుగా ముగ్గురికీ తెలుసు. అయినా వాళ్ళు ఏమీ అనరు—అనుకోరు.

జిడ్డుగాడికి పదమూడేళ్ళు. వాడి తల్లి ప్రస్తుతం జైల్లో వుంది. ఎవరైనా పిల్చి రెండు సీసాలు కళ్ళు ఇప్పిస్తాను. నీ పెళ్ళాన్ని ఓ రోజు నా గదిలోకి పంపు అంటే 'ఓ య్యస్' అనే మొగుణ్ని—గొడ్డలితో 'నరికిన' ఘోర నేరానికి ఆమె శిక్ష అనుభవిస్తోంది.

జిడ్డుగాడు ఒంటరివాడు కావటంతో వాణ్ని నేనే చేరదీశాను.

నేను బాగా తింటున్నాను. నలుగుర్ని ఏ లోటూ లేకుండా పోషిస్తున్నాను. పాస్‌బుక్‌లో పాతికవేల

దాకా వుంది.

ఉద్యోగంలో చేరివుంటే యింత సుఖంగా వుండే వాణ్ని కాదేమో....

## 2

ఎవరో తలుపు తడుతూండటంతో గత స్మృతుల్లోంచి తేరుకున్నాను. తలుపు తెర్చాను.

జిడ్డుగాడు.

"ఏరా వచ్చావ్! అప్పుడే మేట్నీ వదిలేశారా?" అన్నాను.

"నీకోసం అప్పారావు వచ్చాడు బావా!" అన్నాడు వాడు.

"అప్పారావా!? వాడెవడు?"

"ష్...." అని — ప్రక్కనే ఉన్నట్టు సైగ చేశాడు జిడ్డుగాడు.

అప్పుడు చూశాను, జిడ్డుగాడికి అవతలి ప్రక్కన ఓ శాల్తీని. ముప్పయ్ అయివుంటుంది వయసు. చదువుకున్న మనిషిలా వున్నాడు. ఆడపిల్ల కాదు గాబట్టి అంతకు మించిన వర్ణన అనవసరం.

అప్పారావనే స్నేహితుడు నాకెవరూ లేరనీ, జిడ్డుగాడు ఎవరో ఫ్రెండు వచ్చాడని చెప్పినట్టు చెబితే అవమానంగా అలా అన్నాననీ మరోలా అనుకోవద్దనీ, చెప్పి మర్యాదగా అతన్ని లోపలి కాహ్వానించాను, జిడ్డుగాడి నెత్తిన ఒక్కటి వేస్తూ.

అతన్ని కుర్చీలో కూర్చోబెట్టి సీలింగ్ ఫ్యాన్ ఆన్ చేసి, వచ్చిన కారణం ప్రశ్నించాను.

"పెళ్ళి సందర్భంగా మీరు అయిటమ్స్ ప్రిపేర్ చెయ్యాలి" అన్నాడతను.

నాకు నవ్వొచ్చింది. "అయ్యా! ఇది ఆషాఢ మాసం. ఇప్పుడు పెళ్ళేమిటి?" అన్నాను.

అందుకు అప్పారావు కూడ నవ్వుతూ "పెళ్ళి గత మాసమే సింపుల్ గా జరిగిపోయింది. పెళ్ళికొడుకు మా వాడే. అయ్ మీన్ స్నేహితుడు. ఆదర్శ వివాహం చేసుకున్నాడు."

"పెళ్ళి జరిగిన నెలకా పార్టీ ఇచ్చేది?"

"అయ్యా! ఆషాఢం నిన్నటి నుండే మొదలయింది. ఆ లెక్కన గత నెల అన్నాను. నా భాషలో పెళ్ళి జరిగి వారమయింది. మేమంతా మాట్లాడుకొని రేపు సాయంత్రం 6 గంటలకి పార్టీ ఇవ్వాలనుకున్నాం."

"ఎంతమంది?"

"దాదాపు మూడువందల మంది."

"ఏదయినా హోటల్లో ఆర్డరివ్వొచ్చుగా!"

"ఒక వంటవాడు ఇచ్చే సలహా కాదిది."

"ఒక సగటు వంటవాడి మనసు కాదు నాది."

నా మాట కతను దిమ్మెరపోయాడు. నవ్వుతూ చూశా నతన్ని. "చూడండి మేష్టారూ! ఈ ఆఫరు నాకు నచ్చక్కాదు నే నా సలహా ఇచ్చింది. నా మూలంగా మీరు సఫర్ కాకూడదు."

"రామచంద్రుడూ! మా ఇంటి ప్రక్కన దుకాణ ముంది. అందులో బన్స్ వుంటాయి. నా కొడుక్కి ఉదయం ఏడుకి బన్ తో సహా పాలగ్లాసు ముందర పెట్టక పోతే వాడు ఇల్లు పీకి పందిరేస్తాడు. అయినా నేను ఆరున్నరకే సైకిలుపై వెళ్ళి అరమైలు దూరంలో వున్న ఖాగానా నుండి బన్స్ తెచ్చి వాడికి ఇస్తాను."

అప్పారావు అభిరుచి నా కర్థమైంది.

"పైగా రెణ్నెల్ల క్రితం నువ్వు రిటైర్డు డిసిటివో గారి మనవరాలి పెళ్ళిలో చేసిన అయిటమ్స్ మావా డెంతో నచ్చాయి. అదీ ఓ కారణమే!"

నా ఛాతీ ఉబ్బింది.

"సరే. ఏమేం చెయ్యాలి?" అడిగాను జేబులోంచి కేప్స్టన్ తీసి అతని కాఫర్ చేస్తూ.

అతను మృదువుగా తిరస్కరించి జేబులోంచి విల్స్ ఫ్లాక్ తీశాడు. ఎవరి బ్రాండ్ వాళ్ళం వెలిగించుకున్నాం.

"హాట్ విజిటబుల్ బిరియాని. స్వీట్ యేం చేస్తే బావుంటుందో నువ్వే సజెస్టు చెయ్యి" అన్నాడు అప్పారావు.

"చీపుగా పోవాలంటే మైసూర్ పాక్ చేద్దాం. లేదా జిలేబి చెయ్యొచ్చు. అదీ చీపే."

"పోనీ జాంగ్రీ చేస్తే?"

"చెయ్యొచ్చు" అన్నాను.

"మా వాడికి జాంగ్రీ చాల ఇష్టం" అన్నాడు అప్పారావు.

"ఎన్ని?"

"వెయ్యి."

"అలాగే!"

"నలభై కేజీల బియ్యం సరిపోతాయా విజిటబుల్ బిరియానికి?" సందేహంగా అడిగాడు అప్పారావు.

"ఎక్కువవుతుంది."

"ఉండనివ్వు. కొంతమంది యిళ్ళకి పంపాలి."

"మీ యిష్టం!"

"ఏమివ్వాలి?"

ఒక నిమిషం ఆలోచించాను. "మా ట్రూపు మొత్తం నలుగురు - నాతో కల్సి, రానూ పోనూ ఛార్జి లివ్వాలి. ఆహార పానీయాలు మీతోబాటు మేమూ. పారితోషికం అయిదువంద లవుతుంది."

"చాలా ఎక్కువ చెబుతున్నావు. మూడు చేసుకో."

"సారీ! జాంగ్రీ చాల శ్రమతో చెయ్యాల్సి వస్తుంది. వెయ్యి పీసులు పిండే సరికి చెయ్యి పడిపోతుంది. గ్రైండరు పనికిరాదు. చేత్తోనే రుబ్బాలి. పిండి పేస్టులా మెత్తబడాలి. నిలువ వుంచకుండా, ఆలస్యం చెయ్యకుండా వేస్తూండాలి. ఒకరు రఫ్‌గా రుబ్బుతోంటే మరొకరు సాఫ్ట్‌గా రుబ్బాలి. ఒకరు పాకంలో డిప్ చేస్తోంటే, ఒకరు జాంగ్రీ వేస్తూండాలి. జాంగ్రీ ఒప్పుకుంటే ఆ మర్రోజు మేం కంప్లీటుగా రెస్టు తీసుకోవాల్సి వస్తుంది తప్పనిసరిగా."

"సరే. అవన్నీ నా కర్థం కావు. ఇదిగో, వంద అడ్వాన్సుగా వుంచు. ఎప్పుడు బయలుదేరుతారు?"

"రేపు ఉదయం ట్రైయినుకి వస్తాము. ఎవరో ఒకరు స్టేషన్‌లో మమ్మల్ని రిసీవ్ చేసుకోండి. ఫాలో అవుతాము" అన్నాను సిగరెట్ పీకని పారవేస్తూ.

"అలాగే. మరి ప్రావిజన్స్ లిస్టు."

"ఉదయం స్టేషన్‌లోనే అందిస్తాను."

"ఓకే. మరి నే వస్తాను."

"ఒక్క నిమిషం. మీ అడ్రసూ, అడ్రసూ, ఇచ్చిన అడ్వాన్సూ ఇందులో వ్రాయండి" అన్నాను డైరీ తెచ్చి అతని ముందు పెడుతూ.

# 3

"మనకి డిమాండ్ పెరుగుతోందరా్" అన్నాడు జిడ్డుగాడు.

సరోజిని చిన్నగా నవ్వింది.

"మీ బావకు అన్నీ తెలుసు గాని లౌక్యం తెలియదురా" అంది పద్మాక్షి.

"తెలీకపోయినా నెట్టుకొస్తున్నాడంటే దాంతో అవసరం లేదనే అన్పిస్తోంది కదరా్" అన్నాడు జిడ్డుగాడు.

లక్ష్మి అందుకుంది. "అది కాదురా! మన బృందమే కావాలన్నారు వాళ్ళు. అలాంటప్పుడు మరో వంద ఎక్కువ చెప్పివుంటే ఎంత బావుణ్ను?"

"పోనీ అలా కాదన్నా మీరు తెచ్చే మినపప్పు బావుండదు. మేమే పట్టుకొస్తామని చెప్పివుంటే."

"మనం ఒకటి రెండు కిలోలు మిగిలించుకోవచ్చు" గంభీరంగా అంటూ ప్రవేశించాన్నేను. "అది ఎదుటి వ్యక్తిని మోసం చెయ్యటం అవుతుంది. మిగతా వారి కంటే పాతికో, పరకో ఎక్కువగా తీసుకుంటాడు రామచంద్రుడు. కాని ఎవ్వర్నీ మోసం చెయ్యడు. బాతాఖానీలు చాలించి నడవండి. ట్రెయినుకు టైమైపోతోంది" అన్నాను ముందుకు నడుస్తూ.

వారి సంభాషణ విన్నానని గ్రహించిన ఆడవాళ్ళు ముగ్గురూ గతుక్కుమని కిక్కురుమనకుండా అనుసరించసాగారు.

కాచిగూడ స్టేషన్‌లో మమ్మల్ని అప్పారావే రిసీవు చేసుకున్నాడు. మమ్మల్ని స్పాట్ చేర్చి ప్రొవిజన్స్ లిస్టు తీసుకొని గంటకంతా సరుకుల్తో వూడిపడ్డాడు.

ఈలోగా మేము కాలకృత్యాలు ముగించాము. గాడి పొయ్యిలు వెలిగించాము. లక్ష్మి సరోజినీ పద్మాక్షీ గబగబా బియ్యమూ కందిపప్పూ మినపప్పూ శుభ్రంచేశారు.

జిడ్డుగాడు నీళ్ళు తెస్తున్నాడు.

ఈలోగా అప్పారావు తెచ్చిన బ్రెడ్‌ని నేను పీసెస్‌గా కట్ చేశాను, వాళ్ళు ఏర్పాటుచేసిన రెండు రుబ్బురోళ్ళనీ తృప్తిగా చూస్తూ.

మువ్పావుగంట గడిచింది.

ముందు జాంగ్రీ తయారు కావాలి. విజిటబుల్ బిరియాని ఒకరిద్దరు చెయ్యగలరు.

అందరికీ డ్యూటీలు ఫిక్స్ చేశాను.

లక్ష్మి మినపప్పు రుబ్బుతుంది. పప్పు మెదిగేంతవరకూ ఆమె రుబ్బి ఆ ముద్దని సరోజిని పరంచేసి మళ్ళీ మినపప్పు వేసుకుంటుంది. సరోజిని ఆ ముద్దని మెత్తగా — అతి మెత్తగా రుబ్బుతుంది. ఈలోగా లక్ష్మి 'రఫ్'గా రుబ్బటం పూర్తిచేస్తుంది. నేను సరోజినినుండి కొద్ది కొద్దిగా పిండితీసుకుని జాంగ్రీ బట్టలో వేసి పిండుతాను. వాటినితీసి చక్కెర పాకంలో వేస్తాను. జిడ్డుగాడు వాటిని అందులో ఇరవై క్షణాలపాటు డిప్ చేసి వేరేగా పేరుస్తాడు.

పద్మాక్షి స్పేర్. మా ముగ్గురిలో ఎవరికి మా బాధ్యత పట్ల బోర్ కొట్టినా వాళ్ళని స్పేర్ చేస్తూ ఆ బాధ్యత కండక్ట్ చేస్తుంది.

"లక్ష్మి! మినపప్పుతోబాటు బియ్యం వేసుకోవటం మర్చిపోకు. సరోజినీ! కలర్ సరిగ్గా వేసుకో...." అని యథాలాపంగా హెచ్చరించి పాకంకోసం చక్కెర కొలుస్తూ పాత్రలో పోయనారంభించాను.

## 4

అయిదున్నరకల్లా అందమైన—ఒకేరకం సైజుల్లో—లేత గులాబీ రంగులో—అబ్బే—తినబుద్ధి కావటంలేదు—ముద్దు పెట్టుకుంటూ వుండిపోదాం అన్పించేలా వున్న నెయ్యి జాంగ్రీ పీసులూ ఘుమఘుమలాడే విజిటబుల్ పులావూ తయారైపోయింది. అప్పారావుకి అన్నీ అప్పగించాను.

"మీరూ వుండండి. మరో గంటలో ఫంక్షన్ మొదలవుతుంది. చూసినట్టూ వుంటుంది. సర్వ్ చేసినట్టూ...."

"సారీ — సర్వ్ చెయ్యటం మా బాధ్యతకాదు. యిక్కడేకాదు, మేం ఎక్కడా సర్వ్ చేయటానికొప్పుకోం...." అని నవ్వుతూనే తిరస్కరించి మొహం ముడుచుకొని వెళ్ళిపోతోన్న అప్పారావుని చూసి జాలిగా నిట్టూర్చాను.

గబగబా అందరం స్నానాలు కానిచ్చాం.

అది సినిమా టాకీసులున్న ఊరైతే—ఆ టయానికి మా విధులైపోతే—ఆ ముగ్గురో ఎవరో ఒకర్ని తీసుకొని సినిమాకి చెక్కెయ్యటం నా అలవాటు. మిగతావాళ్ళకి తోడుగా జిడ్డుగాడుంటాడు.

"అగ్ని సమాధి ఆడుతోంది. ఎవరొస్తారు?" అన్నాను.

పద్మాక్షి తప్ప మిగిలిన ముగ్గురూ అలసిపోయామనీ రెస్టు తీసుకుంటామనీ అన్నారు.

పద్మాక్షిని తీసుకొని బైటికి నడిచాను.

ఇంటర్వెల్లో పద్మాక్షితో బ్రూ కాఫీ తాగుతోన్న నేను కిటికీలోంచి జిడ్డుగాడు నన్ను రమ్మని సైగ చేస్తోండటం చూసి ఆశ్చర్యపోయాను.

ఎందుకొచ్చాడు జిడ్డుగాడు? నాకు తెలీకుండా సినిమా

కొస్తే నాకంట ఎందుకు పడతాడు? వేరే ఆఫరేదైనా వచ్చి—నన్ను అర్జంటుగా పిలవడానికొచ్చాడా? పారిపోయిన సరోజిని మొగుడు వచ్చి అల్లరి పెడుతున్నాడా?

పద్మాక్షి నక్కడే వుండమని గేటు తీసుకుని అవతలికి వెళ్ళాను.

"ఏరా వెధవా! కొత్త చోట యిద్దరాడవాళ్ళని ఒంటరిగా వదిలి వస్తావా! బుద్ధి లేదూ!" కసిరాను.

"బావా!....బావా....!!" అంతకుమించి మాట్లాడలేక పోతున్నాడు వాడు.

అప్పుడు గమనించాను, వాడి శరీరంలో సన్నని కంపన. మనిషి బాగా భయపడుతున్నాడు. శరీరమంతా చెమటలు పట్టేశాయి, బయట చల్లగా గాలి వీస్తోన్నా.

"ఏమిటది? ఎందుకలా భయపడుతున్నావు? ఏం జరిగిందిరా?" వీపు తడుతూ మృదువుగా ప్రశ్నించాను.

వాడు చెప్పిన మాటలు విన్న నాకు నోట మాట రాలేదు.

## 5

మేం వెళ్ళేసరికి అక్కడ పరిస్థితి అంతా గందరగోళంగా వుంది. అక్కడున్న వాళ్ళందరూ ఆగ్రహావేశాలతో కంపించిపోతూ మాకోసం యెదురు చూస్తున్నారు.

మమ్మల్ని చూడగానే మా మీదికి వచ్చారు దేహశుద్ధి చెయ్యటానికి.

సరోజినీ లక్ష్మి తలలు వంచుకొని అవమానంపొందిన వాళ్ళలా మొహాల్ని కందగడ్డల్లా చేసుకొని వున్నారు.

పోలీసులు మొదటగా పరిస్థితిని అదుపులోని తెచ్చారు.

ఆ తర్వాత ఎస్సై నా దగ్గరికొచ్చాడు.

"కొత్త జంటని హత్య చెయ్య ప్రయత్నించిన నేరానికి నిన్ను అరెస్టు చేస్తున్నాను" అన్నాడు నావైపు క్రోధంగా చూస్తూ.

తల కొట్టేసినట్టయింది. ఎనిమిదేళ్ళబట్టి నా వృత్తి ధర్మాన్ని నేను సక్రమంగా నిర్వర్తిస్తున్నాను. పాక శాస్త్ర ప్రజ్ఞాధురీణ, నలభీమాంశ సంభూతుడు వగైరా బిరుదులేవీ పొందకపోయినా నాకెప్పుడూ యెక్కడా ఎలాంటి చెడ్డ పేరూ రాలేదు. అలాంటిది.... అలాంటిది...

అప్పారావు సుడిగాలిలా నా ముందుకొచ్చాడు.

"గతంలో నీ వంటకం రుచిమాని అద్భుతంగా వుంటుందని నిన్ను బుక్ చేసుకున్నాం. అంతేకాని గతిలేక్కాదు. ఈ మహానగరం వంటవాడికి మొహం వాచి కాదు.

"నువ్వడిగినంత ఒప్పుకున్నాం. నీకు ఎలాంటి లోటూ రాకుండా సక్రమంగా ఏర్పాట్లు అన్నీ సమకూర్చాం.

"ఈ సందడిని యిలా అభాసుపాలు చెయ్యాలనే దుర్బుద్ధి నీ కెందుకు పుట్టింది? నీ కపకారం చేసిందెవరు? పెళ్ళికూతురా పెళ్ళికొడుకా? లేక యిద్దరూనా? ఒకవేళ చేసినంత మాత్రాన నీది అంత కసాయి గుండెవా? తియ్యని, కమ్మని రుచుల్తో పాటిలేని వంటకాల్ని అందించే నీ చెయ్యి యింతటి ఘాతుకానికిలా పాల్పడింది?"

ఏ ఒక్కటీ నాకర్థం కావటంలేదు. ఒక్క ప్రశ్నకూ నా దగ్గర సమాధానంలేదు. ఎక్కడో ఏదో లోపం జరిగింది.

ఎక్కడ జరిగింది?

ఎందుకు జరిగింది??

కొత్త జంటకోసం నువ్వు ప్రత్యేకంగా వేసిన స్వీటు కంచంపై జాంగ్రీల్లో విషం కలిసింది. దాన్ని ప్రేమగా అబ్బాయి అమ్మాయికీ అమ్మాయి అబ్బాయికీ తినిపించారు. అయిదు నిమిషాలతర్వాత ముందుగా అనిత పడిపోయింది. ఆ తర్వాత శరత్ బాబు పడిపోయాడు. యిద్దర్నీ ఆస్పత్రిలో చేర్చారు. అనిత పరిసితి ప్రమాదకరంగా వుంది. వాళ్ళు తిన్న స్వీటుని పరీక్షించిన డాక్టరు అందులో విషం కల్సిందని చెబుతున్నాడు. దీనికి నువ్వు కోర్టులో సమాధానం చెప్పవలసి వుంటుంది" కర్కశంగా అన్నాడు ఎస్సై.

నా తల్లి మరణించినప్పుడు ఏడవలేదు నేను. తండ్రి మరణించినప్పుడు—పెళ్ళివాళ్ళకి మా కారణంగా నష్టం కలిగిందని కన్నీళ్ళు పెట్టుకున్నాను. చెల్లెలు ఎవడితోనో లేచిపోయిందని తెల్సినప్పుడు కన్నీళ్ళొచ్చినా అవి వుల్లిపాయ తరిగినప్పుడొచ్చిన కన్నీళ్ళుగా సర్దుకుపోయాను.

కాని.... కాని....యిప్పుడు కన్నీళ్లొస్తున్నాయి. ఆగకుండా వస్తున్నాయి. ఇది నా వ్యక్తిత్వానికీ నా వృత్తి ధర్మానికీ గొడ్డలిపెట్టు. తీరని కళంకం. ఘోరమైన అవమానం.

యికపై నాకు ఆఫర్లు ఎలా వస్తాయి? కొత్తగా పెళ్ళాడిన యువజంటను హత్య చెయ్యటానికి ప్రయత్నించిన దుర్మార్గుడుగా నా పేరు సమాజంలో శాశ్వతమై పోతుంది. అందరూ నన్ను హేయంగా చూస్తారు. అవమానకరంగా మాట్లాడతారు. చులకనగా నిర్లక్ష్యం చేస్తారు.

“ఇన్ స్పెక్టర్ గారూ! నలుగురికీ వండిపెట్టి పొట్ట

పోసుకునే వృత్తి నాది. నేనూ అంతో యింతో చదువు కున్నాను. మరీ మొరటువాణ్ని కాను. స్కూలు ఫైన లుతో ఉద్యోగ సంప్రదాన్ని ఈదలేనని కులవృత్తికి వారసుణ్ణయ్యాను.

"అలాంటి నేను — నేను చేసిన పదార్థాల్లో నేనే విషం కలిపి నా తలకు నేనే కొరివి పెట్టుకుంటానా? అందువల్ల నాకు మచ్చ వస్తుందని తెలియని మూర్ఖుణ్ణా? ఆ అనిత ఎవరో—ఆ శరత్ బాబు ఎవరో నాకు తెలీనే తెలీదు. వాళ్ళ మొహమైనా చూళ్లేదు నేను.

"నేను మొహమైనా చూడనివాళ్ళు నాకేం ద్రోహం చేశారని నేనంత ఘోరం తలపెడతాను? సార్! నేను అయిటమ్స్ ప్రిపేర్ చేసి వీళ్ళకే అప్పగించాను...."

"అంటే—మేమే కలిపామంటావా విషం?" అప్పా రావు మీదపడి కొట్టబోయాడు.

"అప్పారావుగారూ! దయచేసి అపార్థం చేసుకో కండి. నేను మీలో ఏ ఒక్కర్ని వుద్దేశించి అనటంలేదు" అన్నాను నిర్వికారంగా అతన్ని చూస్తూ.

నా మాటల్లో కొంత నిజమూ సంస్కారమూ కనిపిం చాయేమో ఎస్సైకి, కాస్త శాంతించాడు.

"చూడు మిస్టర్! మీ ట్రూపుకి నువ్వే యజమానివి. అంచేత నిన్ను అనుమానంమీద అరెస్టుచేస్తున్నాను. నీకు బెయిలు యివ్వటానికి ఎవరైనా ముందుకివస్తే విడిచిపెట్ట డానికి నాకే అభ్యంతరమూ లేదు...." అన్నాడు ఎస్సై నన్ను జీపెక్కవలసిందిగా ఆదేశిస్తూ.

నా వెనక నా వాళ్ళు కంట తడిపెట్టడం చూసిన నా కళ్ళకి మరిన్ని నీళ్ళొచ్చాయి.

"వీరి పేరు శ్రీ జలంధర్. ప్రఖ్యాత డిటెక్టివ్. పరిచయం లేకపోయినా నిన్ను బెయిలుపై విడుదల చెయ్యటానికి ముందుకొచ్చారు" అంటూ ఓ ఆజాను బాహుడైన యువకుణ్ని పరిచయం చేసింది పద్మాక్షి.

రెండు చేతులూ జోడించి నమస్కరించాను. నా మొహంలోంచి కోటి కృతజ్ఞతా కాంతులు ఆయనవైపు ప్రసరించసాగాయి.

"నువ్వు కృతజ్ఞతలు చెప్పవలసింది నాక్కాదు. ఈ అమ్మాయికి" అన్నాడు జలంధర్, పద్మాక్షిని చూపిస్తూ.

పద్మాక్షి అతి కష్టంమీద డిటెక్టివ్ జలంధర్ అడ్రసు కనుక్కోగలిగింది. నేను నిర్దోషిననీ—ఈ కొత్త చోట నాకు జామీనిచ్చే నాథుడెవడూ లేడనీ ఈ ఆపదనుండి ఆయనే గట్టెక్కించాలనీ అందుకు ఫీజుగా జీవితాంతం ఆయనకి ఉచితంగా వూడిగం చేస్తాననీ కన్నీళ్ళతో ఆయన పాదాలు పట్టుకొని వేడుకుందిట. ఆయన మనసు కరగి వచ్చారు.

ఆమె ఎవరు? నేనెవరు? వరదల్లో ఖమ్మంలో వున్నదంతా పోగొట్టుకొని పొట్ట చేతబట్టుకొని వొచ్చి ఒక దేవాలయంలో సంతర్పణ రోజున ఆకలికడుపుతో దేవళం ముంగిట నిలబడి — అందరిచేత ఛీత్కారాలు తింటూ బేలగా దిక్కులుచూస్తూ నా కంటబడి—నా ఆశ్రయంలోకొచ్చి—తన సర్వస్వాన్నీ సమర్పించి— యిప్పుడు నా కష్టాల్లో కూడా—....

పద్మాక్షి స్నేహితురాల్నీ ప్రియురాల్నీ భార్యనీ దేవతనీ మించి ఎదిగిపోయింది నా దృష్టిలో.

# 7

రెడ్ విల్స్ వెల్లించుకొని చెప్పమన్నట్టుగా నా వైపు చూశాడు జలంధర్.

నా గురించిన వివరాలన్నీ ఆయనకి విన్నవించాను. పద్మాక్షి, సరోజిని, లక్ష్మి — ఈ ముగ్గురితో నాకున్న సంబంధానుబంధాల విషయంకూడా నేను దాచలేదు.

"నువ్వు పద్మాక్షిని సిన్మాకు పిల్చుకుపోయానన్నావు. తమని పిల్చుకుపోలేదన్న అసూయతో మిగిలిన ఇద్దరూ..."

"లేస్సార్! క్రితంసారి రిటైర్డు డి. సి. టి. వో. గారి మనమరాలి వివాహానికి ఒప్పుకొని వచ్చాము. అప్పుడు సరోజిన్ని తీసుకొని వెళ్లాను. అంతకుముందు ఓ ఫంక్షనుకి ఒప్పుకొని కర్నూలు వెళ్లాము. అప్పుడు లక్ష్మిని తీసుకెళ్ళాను. అప్పుడు మిగత వాళ్లెవరూ యిలా ప్రవర్తించలేదు. అయినా నాకు నష్టం కల్గిస్తే అందులో వాళ్ళకీ భాగం వుంటుందిగా...."

"యింకో అబ్బాయి వున్నాడన్నావు...."

"ఆఁ. జడ్డుగాడు...."

"జడ్డుగాడా! అదేం పేరు?"

"వాడికి సినిమా పిచ్చి డబ్బు పిచ్చి ఎక్కువ సార్! సిన్మాకెళ్తానని డబ్బులడుగుతాడు. తర్వాత ఇంటర్వెల్ లో కాఫీకోసం డబ్బులిమ్మంటాడు. వస్తూ వస్తూ చాక్లెట్ తెస్తాను డబ్బులిమ్మంటాడు. అంచేత ముద్దుగా అలా పిలుస్తుంటాను. అసలు పేరు కేశవులు...."

"వాడిపై మీకేమైనా అనుమానం వుందా?"

"నో ...వాడు నా కుడిభుజం."

"వృత్తిరీత్యా మీకున్న శత్రువులు...."

"ఈ కేసులో నే తలదూరస్తారనుకోవటం బావుండదు. గత ఎనిమిదేళ్ళుగా ఏమీ చెయ్యనివాళ్ళు...."

"ఈర్ష్యాసూయలు మనిషి మనసులో ఎప్పుడు ప్రవేశిస్తాయో ఎవరు చెప్పగలరు?"

తల అడ్డంగా వూపాను. "వుహూఁ .... వాళ్ళను తీసెయ్యండి సార్ లిస్టులోంచి...."

"అలాంటప్పుడు సరోజిని భర్తకేమైనా అవకాశం వుందా?"

"లేదు. అంతదూరం ఆలోచించగల మనిష్కాం కాదు వాడిది. అయినా వంటకాల్లో విషం కలిపే అవకాశం అతనికెలా వస్తుంది?"

యింతలో ఫోను మోగింది.

"హలో....డిటెక్టివ్ జలంధర్ స్పీకింగ్...."

"నేను చక్రవర్తిని మాట్లాడుతున్నాను. ఏమంటున్నాడు మీ పాకశ్రీ!?"

అవతలి మాటలు నాకు స్పష్టంగా వినిపించాయి. దానికి జలంధర్ బదులివ్వలేదు. "ఏమిటి విషయం?" అన్నారు.

"అనితకు స్పృహొచ్చింది. ఫర్వాలేదంటున్నారు డాక్టర్లు."

"థాంక్ గాడ్!!" జలంధర్‌తోపాటు నేనూ నిట్టూర్చాను.

"హాస్పిటల్ నుండే మాట్లాడుతున్నావా?"

"అవును."

"వుండు అక్కడే. పావుగంటలో వస్తున్నాను" రిసీవర్ క్రెడిల్ చేశారు జలంధర్.

# 8

"సునీతా!!!" గట్టిగా కేక పెట్టాను.

అదిరిపడ్డాడు జలంధర్.

"అవున్సార్! ఈమె నా చెల్లెలు సునీత. నెలక్రితం లేచి.... సారీ.... నెలక్రితం తను ప్రేమించిన యువకుడితో లేచిపోయింది. అప్పట్నుండీ ఆమెను తల్చుకోని క్షణం లేదు. లేచిపోయినందుకు కోపగించుకున్నా తన ప్రేమ విషయం నాకు చెప్పివుంటే నేను ఆనందంగా ఆ పెళ్ళి కంగీకారం తెలిపి వుండేవాడిని.

"సార్! ఈ సంఘటనలో నేను నిర్దోషిగా నిరూపించబడతానని బలమైన నమ్మకం దృఢపడుతోంది—" ఆనందంగా అని — అంతలోనే కళ్ళు ఎరుపెక్కగా, "సార్! నా చెల్లెల్ని పొట్టన బెట్టుకోవాలని చూసిన ఆ కిరాతకుడెవడో, వాణ్ణి ... వాణ్ణి ...." కసిగా పళ్ళు కొరుకుతూ అన్నాను.

చిరునవ్వుతో సమాధాన సూచకంగా మొదట నా భుజం తట్టి. "పగకి పగ సమాధానం కాదు. కాకూడదు రామచంద్రుడూ!" అన్నాడు జలంధర్.

ఈ కేసులో ప్రాణాలకి తెగించైనా సరే — నా చెల్లిపై హత్యా ప్రయత్నం చేసినవాడిని ఉరికంబం ఎక్కించటంలో డిటెక్టివ్ గారికి సహకరించాలనే నిర్ణయానికొచ్చాను.

నా చెల్లిని క్షేమంగా గట్టెక్కించి నాతో కలిపిన దేవుడికి మనసారా దణ్ణం పెట్టాను.

మర్రోజు నా చెల్లెలు అంతా చెప్పింది.

హైద్రాబాదునుండి తరచూ ఓ కుర్రవాడు తన దూరపు బంధువులని చూడటంకోసం మా ఊరు వస్తూండే

వాడు. పట్టు సెంటరువద్ద సునీతతో పరిచయం కలిగింది. ప్రేమగా మారింది. అతను తక్కువ కులంవాడు కావడంతో నేను కోప్పడతానన్న భయంచేత సునీత నాతో ఈ విషయం చెప్పలేకపోయింది.

ఫలితంగా ఓ మంచి రోజున వాళ్ళిద్దరూ లేచిపోవడానికి సుముహూర్తం పెట్టుకున్నారు.

నేరుగా బొంబాయి చేర్చాడు. నేను దానికి చేయించిన రెండుపేటల బంగారు గొలుసమ్ముకున్నారు. ఆ తర్వాత అంతా నవలల్లో సినిమాల్లోలా జరిగింది.

పదిహేను రోజులు బాగా వాడుకొని మూడు వేలకి దాన్నో బ్రోకర్ గాడికమ్మేశాడు. ఓ వ్యభిచార గృహం యజమానురాలు దాన్ని అయిదు వేలకి కొనుగోలు చేసింది.

అక్కడ సునీత నరకం అనుభవించింది ఓ పదిరోజులు.

హైద్రాబాదులో నగల వర్తకుడి కుమారుడు శరత్ బాబు కష్టమర్సవద్ద కొనుగోలు చేసిన బంగారంను కూడబెట్టి రెండు మూడు కేజీలు కాగానే బొంబే మార్కెట్లో అమ్మటం అతడి వ్యాపారంలో ఓ భాగం. అలా వచ్చినప్పుడు 'కన్నె సరదాలు' తీర్చుకోవటం అతని హాబీ.

అలా సునీతని చూశాడు. విముక్తికోసం అలమటిస్తోన్న సునీత కన్నీళ్ళు తుడిచాడు. మనసుని బంగారం కన్నా విలువైందిగా విశ్వమంత విశాలమైందిగా మార్చుకొని ఆమెని పదివేలకు కొని—ఐ మీన్—ఆ ఓనర్‌కి ఆ పైకం యిచ్చి ఆమెనా చెరనుండి విడిపించాడు. అక్కడే ఓ ఆలయంలో ఆమెని పెళ్ళిచేసుకొని ఆశీస్సుల కోసం వచ్చాడు.

తలిదండ్రుల ఆశీస్సులు లభించలేదు. స్వతంత్ర జీవితం కోసం ప్రయత్నిస్తూ తన వాటాగా యాభై లక్షలు

తీసుకొని బయటపడ్డాడు.

క్రొత్తగా ప్రారంభించిన వ్యాపారాన్నీ అతని మేరేజ్ సందర్భాన్నీ పురస్కరించుకొని అతడూ, అతని ఫ్రెండ్సూ యిచ్చిన పార్టీ యిది.

యిందులో యింత గల్లంతు జరిగింది.

శరత్ బాబుకి చేతులెత్తి నమస్కరించాను.

అతనూ గండం తప్పించుకున్నాడు.

అతని విశాల హృదయానికీ గొప్పదనాకీ జోహార్లర్పించాను.

యిప్పుడు కథ మరో మలుపు తిరిగింది.

శరత్ బాబు తండ్రి-కొడుకు తనమాట కాదన్నాడని-సునీతపై వైరంతో ఆమెని చంపించాలని ఈ ప్లాన్ వేశాదేమో! అయితే ఆ స్వీటు తన కొడుకూ తినే అవకాశం వుంటుందేమోనన్న ఆలోచన అతనికి వచ్చి వుండదా? నా మాట లక్ష్యపెట్టనివాడు నా కొడుకే కాదనుకొంటాడా? కన్న కొడుకుపై అంత కఠినత్వం ఉంటుందా ఏ తండ్రికైనా?

ఆలోచిస్తూ శరత్ తో మాట్లాడుతోన్న జలంధర్ వద్దకి నడిచాను.

"లేదు. నా తండ్రి కోపగించుకున్నమాట నిజమే. కాని ఆ కక్షతో నన్ను చంపేంత నీచుడు కాడాయన. అలా ప్రయత్నిస్తే నన్ను వెళ్ళగొట్టాడు కాబట్టి నేరం ఆయనపై సులువుగా ఉడుతుంది" అన్నాడు శరత్ బాబు.

"మీ వ్యాపారరీత్యా మీకు శత్రువులు ఎవరైనా ఉన్నారా?"

"ఎవరూ లేరు."

"మీ స్నేహితుల్లో?"

"లేరు."

"యింతా ఎవరిపైనైనా మీకనుమానం వుందా?"

"సార్ ...." నేనందుకున్నాను. "సునీత చిక్కిన బ్రోతల్ హవుస్ ...."

జలంధర్ తల అడ్డంగా వూపారు. "అయిదు వేలు పోసి కొంటే పదివేలు దక్కాయి. దాంతో తృప్తిపడక బొంబే టు హైద్రాబాద్ ప్రయాణించి పగతీర్చుకునే మన స్తత్వం కలవాళ్లు వుండరు...."

నోర్మూసుకున్నా నేను.

హత్యా ప్రయత్నం చేసిన వాడెవడన్న ప్రశ్న ఆ రోజుకి ప్రశ్నగానే వుండిపోయింది.

## 9

పక్కమీద పడుకున్నానేగాని నిద్ర రావటంలేదు.

నా చెల్లెలు నాకు దక్కింది. ఈ వార్త విన్న సరోజిని లక్ష్మి పద్మాక్షి జడ్డుగాడికీ కల్గిన ఆనందాన్ని పట్టలేక వాళ్ళు యిల్లంతా హడావుడిలాంటిది చేశారు.

వాళ్ళకే అలా వుంటే నాకెలా వుండాలి?

నా చెల్లెల్ని యికపై కంటికి రెప్పగా కాపాడు కోవాలి. ఆమెపై హత్యాప్రయత్నం జరిగింది. దుండగు లెవరో తెలిసి శిక్షకు పాత్రులయ్యేవరకూ ఆమె మృత్యు ద్వారంలో నిలబడి వున్నట్టే లెక్క.

అయినా ప్రత్యేకమైన గదిలో అమర్చిన జాంగ్రీపై ఎవరు వచ్చి విషం చల్లుతారు? ఎవరు రానిచ్చారు?

కొంపదీసి అప్పారావుగాని అప్పారావు స్నేహితులు గానీ అనుచరులుగానీ....

అప్పారావో అతని మనుషులో అయితే వారికి సునీత ఛ—ఆ నరకకూపంనుండి తప్పించాక ఆమెకి శరత్ పెట్టిన కొత్త పేరు అనిత కదూ—అయితే వారికి అనితపై పగ వుండదు. శరత్ పైనే అయివుండాలి.

సన్నిహితులుగా ప్రవర్తిస్తూ యింత దారుణాని కొడి గడతారా!? ఏమో!

స్వీట్ రూమ్‌లో — అయ్ మీన్ స్వీట్ వుంచిన రూములో వ్రేలి ముద్రలేవైనా దొరుకుతాయేమో— ఉదయాన్నే డిటెక్టివ్ గార్ని కల్సి అడగాలి.

అయినా ఆ రూమ్‌లో ఎందరో తిరిగారు.

ఎలా అనుమానించడం?

....ఆలోచిస్తూ అప్రయత్నంగా యిటువేపుకి తిరిగిన నేను ఒక్క క్షణం చకితుడయ్యాను. చిన్న చప్పుడు వినవచ్చింది. దాన్నిబట్టి ఊహిస్తే నా ప్రక్కన కాస్త దూరంలో పడుకొని వున్న జిడ్డుగాడు లేవబోయి—సగం లేచి— నేను కదలగానే ఛటుక్కున పడుకోగా వచ్చిన శబ్దంలా స్ఫురించింది.

ఎందుకు? ఎందుకు వాడలా చేశాడు? యింతవరకూ ఎందుకు మేలుకొని వున్నాడింకా? తను కదలకుండా వుండివుంటే ఏం చేసేవాడు? కొంపదీసి వాడికీ ఈ హత్యాప్రయత్నానికీ ఏదైనా సంబంధం వుందా?

ఛ—ఎందుకుంటుంది?

ఎందుకైనా మంచిదని కళ్ళు మూసుకొని బధకంగా ఆవులించి దొంగనిద్ర నటిస్తూ గట్టిగా గురక పెడుతూ ఓరకంట వాణ్ణే గమనించసాగాను.

అయిదు నిమిషాలు నిశ్శబ్దం—నా చేతి గడియారపు టిక్ టిక్‌లు ప్రక్కవాడిక్కూడ స్పష్టంగా విన్పించేంతటి

భయంకర నిశ్శబ్దంలో ముందుకు నడిచాయి.

నెమ్మదిగా నాకేసి తిరిగాడు జిడ్డుగాడు తల ఎత్తి, నా కళ్ళకేసి చూశాడనుకుంటాను.... నెమ్మదిగా లేచాడు. వాడు వెళ్ళుతోన్న చప్పుడు అప్పుడు వినిపించసాగింది నాకు. నెమ్మదిగా తలుపు తెరిచాడు.... చూశాడు.

ఒక్క నిమిషం ఆగాను. వాడు రాలేదు. ఏమీ అర్థంకాని అయోమయస్థితి. తెలియని ఎగ్జయిట్ మెంట్. వాడికి దీంతో సంబంధముందని గట్టిగా అరుస్తోన్న మనసును బుజ్జగించలేక కొట్టలేక రాజీపడలేక— నేనూ లేచాను. తలుపుదాకా వెళ్ళి బయటికి తొంగి చూశాను.

అప్పటికే ఫర్లాంగు దూరం దాటిన జిడ్డుగాడు— రోడ్డుమీద అమితవేగంతో పరిగెడుతున్నాడు ముందుకు!!

# 10

"....నేనూ వెంబడించాలనుకున్నాను. కాని నా వేగంతో వాణ్ని అందుకోలేనన్పించింది. అందుకే ఆగి పోయాను...." దీర్ఘంగా నిట్టూర్చాను.

సాలోచనగా తల పంకించాడు జలంధర్.

"కాని..జిడ్డుగాడు అనుమానితుడంటే నేను ఇప్పటికీ నమ్మలేక పోతున్నాన్సార్...." అన్నాను బాధగా.

"మీరు స్వీట్లు ప్రిపేర్ చేస్తున్నప్పుడు వాడేం చేస్తున్నాడు?"

"డాల్డాతో నేను కాల్చిన జాంగ్రీలను చక్కెర పాకంలో డిప్ చేస్తున్నాడు."

"అంతకుముందు?.... మొదట్నుండీ చెప్పండి...." అన్నారాయన దీర్ఘంగా ఆలోచిస్తూ.

"మినప్పప్పు నానబెట్టాము. అంతవరకూ నీళ్ళు తెస్తూ

పొటాటోనూ బ్రింజాల్సూ కట్ చేస్తూ వున్నాడు. విజిటబుల్ పులావ్ మసాలా పౌడర్ని తయారుచేశాడు. ఈలోగా పప్పు నానింది. మొదటిదశ మెత్తబడేవరకూ అమ్మి రుబ్బి సరోజిని కిచ్చింది. సరోజిని అప్పుడు రంగు కలిపి రెండవ దశ మెత్తబడేవరకూ రుబ్బాలి.

"సరోజిని రంగుపాట్లంకోసం వెతికింది. నేనప్పుడు పాశాన్ని కలియబెడుతూండటంతో సరుకుల్లో పొట్లం వుందేమో చూడమన్నాను. చూశాడు. లేదు. నిజంగా నే లేదు.

"అప్పారావుని పిల్చి అడిగాను. సరుకుల్లో వుందనీ బహుశా దార్లో పడిపోయి వుండొచ్చనీ మళ్ళీ తెప్పిస్తాననీ అన్నాడు. సమయానికి షర్రాఫ్లైవరూ లేరనీ బిడ్డుగాణ్ణే పంపించమనీ రిక్వెస్టుచేసి పదిరూపాయలనోటు నాకందించాడు. జాంగ్రీ కలర్ తులం రెండురూపాయలు. అయిదు తులాలు పట్రమ్మని చెప్పాను. అలాగేనని వెళ్ళి తెచ్చాడు."

"ఆ తర్వాత వాడు ఎక్కడికీ వెళ్ళలేదా?"

తల అడ్డంగా వూపాను.

"జరగాల్సిందేదో అప్పుడే జరిగింది."

"నాకేం అర్థంకావటంలేదు" అన్నాను.

జవాబివ్వలేదు జలంధర్. సిగరెట్టు కాలుస్తూ దీర్ఘంగా ఆలోచిస్తూ అయిదు నిమిషాలపాటు మౌనంగా వుండి పోయారు.

## 11

"జాంగ్రీకలర్ వుందా?" అడిగాను.

లేదన్నాడు షాపువాడు.

ముందుకు సాగాను.... జలంధర్ ఆదేశం ప్రకారం

మేము స్వీట్ ప్రిపేర్ చేసిన యింటినుండి బయల్దేరి వరసగా షాపుల్లో యిలా అడుగుతూ పోతున్నాను.

ఆరో షాపులో దొరికింది. ఒక తులం కట్టి యిమ్మన్నాను. పొట్లం తాలూకు కాగితం చూశాను. బైబిలు క్రొత్త నిబంధన గ్రంథం తాలూకు పేపరది.

కరక్టే. నిన్న వాడు తెచ్చిందీ యిలాంటి పేపర్లో నే!

ఓ ప్యాకెట్ కాప్స్టన్ సిగరెట్లూ అగ్గిపెట్టె కొనుక్కొని షాపువాణ్ని చూస్తూ "చూడు...." అన్నాను.

చూశాడు.

"నిన్న ఉదయం తొమ్మిదిన్నర ప్రాంతంలో ఓ కుర్రాడు అయిదు తులాల జాంగ్రీ కలర్ తీసికెళ్ళాడు. గుర్తుందా?" అడిగాను.

"ఎక్కడా! నేనప్పుడు యింట్లో వంటచేస్తున్నాను. కొట్లో మా యాడది వుండింది. ఒసే కస్తూరీ! యిట్టా రాయే...." గట్టిగా కేక పెట్టాడు నలభైయేళ్ళ శెట్టి

వచ్చింది పాతికేళ్ళ పడుచు.

ఆమెనీ అదే ప్రశ్న అడిగాడు.

అవునన్నట్టు తలూపింది.

"చూడమ్మా! ఆ సమయంలో గిరాకీ యెక్కువగా వుండిందా?" అడిగాను సిగరెట్ వెలిగిస్తూ.

తల అడ్డంగా వూపిందామె.

'కొంపదీసి ఈ మహాతల్లికి మాటలు రావా?' అనుకొని "ఆ కుర్రాడు తిరిగి వెళ్ళిపోయేటప్పుడుగాని, పౌడర్ కొంటున్నప్పుడుగాని...."

"అతడు పౌడరు కొనలేదయ్యా! జాంగ్రీ కలర్ కొన్నాడు" అందామె.

'అమ్మయ్య' అనుకొని—"అదేనమ్మా! కలర్ కొన

టానికొచ్చి కొని__ వెళ్ళిపోయేలోగా ఎవరేనా వాణ్ని కలిశారేమో గుర్తుకి తెచ్చుకొని చెప్పగలవా?"

ఓ. నిమిషంపాటు గుర్తుకి తెచ్చుకుందామె.

"అవును. కొట్లో సిగరెట్ కొన్న ఓ ఆసామీ ఎవరి కోసమని అడిగాడు. పెళ్ళికోసమని ఆ కుర్రాడు చెప్పాడు. ఆ కుర్రాడి పేరడిగాడు. గుడ్డుగాడని చెప్పి-"

"కాదు. జిడ్డుగాడు."

"ఆఁ... జిడ్డుగాడని చెప్పి నాలిక్కొరుక్కొని-కేశవులు అని అన్నాడు. ఆ శాల్తీ సిగరెట్ కాలుస్తావా అనడిగితే మరో పదేళ్ళదాకా దీపావళికి పటాసులు కాలుస్తాననీ అందాకా చాక్లేట్లు తింటాననీ అన్నాడు. అతడు గుప్పెడు చాక్లేట్లు కొన్నాడు. యిద్దరూ కల్సి ముందుకుపోయారు. యింతలో యింట్లో పోపు మాడిన వాసన వచ్చింది. మా ఆయన నిదరోతున్నాడేమోనని కేకేస్తూ లోపలకెళ్ళాను. తర్వాత చూడలేదు" అందామె.

'బంగారు తల్లే' అనుకొని "ఆయన మీకు బాగా తెలుసా?" అనడిగాను.

"బాగుంది సంబడం! వాడెవడైతే నాకేం? మా ఆయనకు తెలుసేమో అడుగు" అని మూతి మూడు వంకర్లు తిప్పి లోపలకి వెళ్ళింది కస్తూరి.

"ఏందయ్యావ్ కత? ఏదో పాపమని పిలిపిస్తే తిక్క తిక్క ప్రశ్నలేస్తా వున్నావ్? వాడెవడో దానికెందుకు తెలియాల?" గఁయ్యిమన్నాడు శెట్టి.

"అయ్యా! మహానుభావా! నేనడిగిందది కాదు. అతను మీ కొట్టుకి అప్పుడప్పుడూ ఏదైనా కొనడంకోసం వస్తూంటాడా?" అనడిగాను చేతులు జోడిస్తూ.

"బోడి మూడ్రూపాయల బేరంజేసి ఆ డెవడో

'బ్లాక్ బాండ్'లా పెళ్ళలేత్తా ఉన్నావే! నడునడు.."
అని కసిరాడు శెట్టి.

నుదురు కొట్టుకున్నాను. 'అబ్బా! ఈ మాత్రందానికే తలనెప్పి వచ్చేసింది. డిటెక్టివ్‌లు ఎలా కూపీలు లాగుతూంటారో కదా!' అనుకుంటూ అక్కడికి నాలుగడుగుల యివతలున్న కిళ్ళీకొట్టువద్దకి నడిచాను.

కిళ్ళీకొట్టు కుర్రాడు యిందాక శెట్టి భార్య వచ్చినప్పుడు మెరిసే కళ్ళతో చూడటం ఓరగా గమనించాను. నిన్న జిడ్డుగాడు వచ్చినప్పుడు ఆమే ఉండింది కొట్టులో. అంటే—ఈ కుర్రాడు గమనించే వుండాలి.

నా ప్రయత్నం ఫలించింది. ఆ శాల్తీని వాడు చూశాడు. గోధుమ రంగు కోటు. నల్లని మీసాలు. ఫ్రెంచ్ కటింగ్. పాదాలకు నల్లని నిగనిగలాడే బూట్లు.

అతను యింతకుముందు బృందావన్ బార్‌కి తరచూ వస్తూండేవాడట. ఈ కుర్రాడు యిక్కడ కిళ్ళీకొట్టు పెట్టకముందు ఆ బృందావన్ బార్ ప్రక్కన కిళ్ళీకొట్టు నడిపాడట. అంతేకాదు. వాడు మరో విషయమూ చెప్పాడు!

మై గాడ్! పులిహోర తిన్న చేతికి వాసన కొట్టినట్టు జలంధర్‌తో తిరిగిన ఆ కొద్దిపాటి భాగ్యానికి పరిశోధన చేసి ఓ క్లూ పట్టుకున్నాను.

ఈ బోర్డు తీసేసి ఆ బోర్డు పెట్టుకుంటే—?

'మై గాడ్!!' మరో భంగిమలో అనుకున్నాను.

# 12

నేను వెళ్ళిన పది నిమిషాలకి డిటెక్టివ్ జలంధర్ వచ్చారు.

గబగబా నేను సేకరించిన సమాచారం గుమ్మరించి,

"అంతే కాస్పార్! ఈ తెల్లార్జామున జిడ్డుగాడు నా గదిలోంచి దొంగతనంగా పరిగెత్తి వెళ్ళింది కొట్టి షాపుకి. అప్పటికింకా కొట్టు తెరవలేదు. చాలాసేపు యెదురు చూశాడుట. ఆరుకల్లా కిళ్ళీకొట్టు వచ్చాడు తెర్చాడు. జిడ్డుగాణ్ని గుర్తించి పలకరించాడట. షాపు ఎన్నింటికి తెరుస్తారని అడిగితే తొమ్మిదవుతుందని చెప్పాడు. చాక్లెట్లు కొనిచ్చిన వాడి వివరాలు అడిగాడుట. నాకు చెప్పిందే—అదే—బృందావన్ బార్‌కి వాడు తరచూ వెళ్ళే విషయం చెప్పాడుట. అంతే, ఆగకుండా పరిగెత్తాడట."

"ఇప్పుడర్థమైంది" అన్నారు జలంధర్.

"ఏమిటి?"

"చాక్లెట్లతో మచ్చిక చేసుకున్నాడు, జిడ్డుగాణ్ని. విషం వాడికే యిచ్చి పెద్దసైజు జాంగ్రీల్లో మాత్రం కలుపమని చెప్పివుంటాడు."

"కాని జిడ్డుగాడు నాకు ద్రోహం చేస్తాడా? వృత్తి ద్రోహం తలపెడతాడా?"

"వాడికి చెప్పే రీతిలో చెప్పి వుంటాడు."

ఫోను గణగణమంది. "హలో" అన్నాడు జలంధర్. పదిక్షణాలు అతని ముఖ భంగిమల్లో అనేక మార్పులొచ్చాయి. అవతలి మాటలు అస్పష్టంగా వినపడటంతో అర్థం కాలేదు.

రిసీవర్ విసురుగా క్రెడిల్ చేసి నాకేసి జాలిగా చూశారు.

"హత్య!"

"హత్య జరిగిందా?"

"హత్యచేశారు జిడ్డుగాణ్ని. పద...."

"మై.... మై.... గాడ్....!!"

డాజ్జికారు శరవేగంతో షాపూర్ నగర్ వేపు ప్రయాణించింది.

చల్లగాలి రివ్వున వీస్తోంది, మధ్యాహ్న సమయమైనా.

జలంధర్ మొహం సీరియస్‌గా వుంది. పెదవులమధ్య రెడ్ విల్స్ ఎర్రగా కాలుతోంది.

పాపం! జిడ్డుగాడు....!

బ్రాందీ బుడ్డి సప్లయ్ చేస్తే—వాళ్ళకి తన పెళ్ళాన్నైనా అప్పగించడానికి సిద్ధపడే తండ్రి — అలాంటి వాణ్ని భరించలేక—తాళిబొట్టుని తనకై తాను తెంచుకొని ధైర్యంగా జైలుకెళ్ళిన తల్లి—కూడుపెట్టని, అనామకుడి ప్రలోభానికి లొంగి ప్రాణం పోగొట్టుకున్న కొడుకు....

ఓహ్!! ఒక్క కుటుంబానికి చెందిన ముగ్గురు వ్యక్తులకీ మూడు విరుద్ధ స్వభావాలు!!!

తెల్లవారుఝామున జిడ్డుగాడు వెక్కి వెక్కి ఎందుకు ఏడ్చాడు? ఎందుకలా దొంగతనంగా పరుగెత్తి బ్రవున్ కోటువాడి వివరాలు తెలుసుకున్నాడు? ఎందుకు హత్య చేయబడ్డాడు?...ఆలోచిస్తే నెమ్మదిగా అర్థంకాసాగింది.

బహుశ డబ్బుల కాశపడి ఈ పాడుపనికి ఒప్పుకొని ఉంటాడు. తీరా అనిత సునీతై—అంటే నా చెల్లెలై కూచుంది. నా చెల్లెలని వాడికి తెలిశాక వాడి చేతులారా విషాన్ని కలిపి ఆమెని చంపబోయిన సంఘటన గుర్తుకి తెచ్చుకొని నా కన్నం పెడుతున్నవాడి తోడబుట్టిందాన్నే చంపబోయినందుకు పశ్చాత్తాప సూచనగా ఏడుపు వచ్చి వుంటుంది. అందుకే వాణ్ని కలిసి నన్ను మధ్యపెట్టి కొత్త జంటకు విషం కలపమని యిస్తావా? అని

అడిగి అమాయకంగా పోలీసులకి తెలియజేస్తానని బెది రించి వుంటాడు. వాళ్ళు ఇలా వాడి నోరు మూశారు.

కారు ఒక్క కుదుపుతో ఆగిపోయింది. షాపూర్ నగర్ దాటి—ఊరి బయటకి వెళ్ళాక ఓ కిలోమీటరు దూరంలో.

ఓ కారు—నల్లని—నంబరులేని అంబాసిడర్—వేగంగా దూసుకుపోతూ ఓ మూటని పడేసిందనీ దగ్గరగా వెళ్ళి చూస్తే అది శవమనీ చూసినవాళ్ళు చెప్పారు.

చక్రవర్తి శవంవద్దే ఉన్నాడు. యెలాంటి 'క్లూ' లభించలేదు. గొంతుపిసికి చంపారు జిడ్డుగాణ్ని.

జిడ్డుగాణ్ని ఆ స్థితిలో చూస్తుంటే యేమపాగలేదు వాకు. జలంధర్ కూడా సానుభూతిగా నిట్టూర్చాడు.

"చక్రవర్తీ! హంతకుడెవరో నాకు తెల్సు. కాని వాడి దగ్గరకి అరస్టువారంట్తోనే వెళ్ళాలి. త్వరగా సిద్ధంచేయించు" అన్నాడు జలంధర్.

# 13

ఒక్క జర్కుతో బృందావన్ బార్ముందు ఆగాయి డాడ్జికారూ పోలీసు జీపూ. బిలబిలమంటూ అందరూ దిగారు.

నేరుగా కౌంటర్ వైపు నడిచాడు జలంధర్.

"శశికిరణ్ ఎక్కడ?" అధికారయుతంగా ప్రశ్నించాడు.

"లేదు సార్! వచ్చేవారం వస్తాడు."

"అతడు వారానికోసారి మాత్రమే వస్తాడని, మీ బార్లో అతడు సైలెంట్ పార్టనర్ అనీ మాకు తెలుసు. అంతేకాదు. ఇందాకే అతడు లోనికి వెళ్ళటం మేము నియోగించిన మనుషులు గమనించారు. మా వద్ద

అరెస్టు వారంట్ వుంది. యిప్పుడూ అబద్ధమే చెప్పా వంటే తర్వాత చాలా చింతిస్తావ్, చెప్పు. శశికిరణ్ ఉన్నాడా లోపల?" చక్రవర్తి గద్దించాడు.

"ఉన్నాడు సార్!!" భయంగా చెప్పాడు కౌంటర్ లోని వ్యక్తి. యింతమందిని తప్పించుకోవటం సాధ్యం కాక సులభంగా లొంగిపోయాడు శశికిరణ్.

శశికిరణ్, శరత్ బాబు—అంటే మా బావ—క్లోజ్ ఫ్రెండ్స్. శశికిరణ్ కి ఓ అందమైన చెల్లెలుంది. అన్నీ తిరుగుళ్ళు నేర్చిన ఆడది. ధనవంతుడైన శరత్ బాబుని వల్లో వేసుకోవటంకోసం ఆమెని నియమించాడు. ఈ విషయం శరత్ బాబు గ్రహించి అతనికీ అతని చెల్లెలికీ దూరంగా వుంటూ వచ్చాడు.

శశికిరణ్ ఆగ్రహించాడు. సమయంచూసి వెన్ను పోటు పొడవాలని స్నేహం నటిస్తూ వచ్చాడు.

ఈలోగా శరత్ బాబు బిజినెస్ పనిమీద బొంబే వెళ్ళాడు, నా చెల్లెలుపాలిటి దేవుడు కావటంతో—ఓ అనామకురాలు యిలా ఐశ్వర్యవంతురాలైనందుకు ఆమె మీద, తన చెల్లిని తృణీకరించినందుకు శరత్ మీద పగ బట్టాడు.

బిడ్డుగాణ్ని మచ్చికచేసుకొని—అనిత తన చెల్లెలనీ, బావగా శరత్ నీ అతని భార్యగా అనితనీ ఏడిపించటం కోసం అయిదు నిమిషాలు మత్తుగా పడిపోయే మందని చెప్పి వాళ్ళిద్దరికోసం స్పెషల్ గాచేసిన 'హ్యూజ్ జాంగ్రీ రౌండ్స్'పై మాత్రమే చల్లమని చెప్పాడు.

కాని అనిత నా చెల్లెలని తెల్సిన బిడ్డుగాడు ఆవే శంగా శశికిరణ్ ని కల్సి మత్తుమందని చెప్పి విషమిచ్చి నందుకూ అనిత నా చెల్లెలని వెల్లడైనందుకూ సంజాయిషీ

కోరి మూర్ఖంగా శశికిరణ్ ని పోలీసులకి పట్టిస్తానని బెదిరించాడు.

పిల్ల కాకికేం తెలుసు ఉండేలు దెబ్బ?

అందుకే ఆ దెబ్బ ఏదో తిన్నాడు, శశికిరణ్ చేతిలో.

శశికిరణ్ చాల తెలివిగా వ్యవహరించాననుకున్నాడు. బృందావన్ బార్ లో సైలెంట్ పార్టనర్ లాగే అనిత శరత్ బాబుల హత్యాప్రయత్నంలో, జిడ్డుగాడి హత్యలో సైలెంట్ మర్డర్ గా నే వుండిపోదామనుకున్నాడు.

కాని జలంధర్ గారి దర్యాప్తులో శరత్ బాబువల్ల సేకరించిన శశికిరణ్ చెల్లెలికీ శరత్ కీ అతను పెట్టాలనుకున్న ముడి, అది తిరగబడిన విషయమూ, నా దర్యాప్తులో కిరాణాకొట్టు శెట్టి, కిళ్ళీకొట్టు కుర్రాడూ చెప్పిన శశికిరణ్ వివరాలూ గుర్తులూ శశికిరణ్ ని నేరస్తుడిగా హంతకుడిగా పట్టిచ్చాయి.

నేను నిర్దోషిగా బుజావైనాను.

*　*　*

"సార్! మీకు ఋణపడి వున్నాను. మీ ఫీజెంతో సెలవిస్తే...." నసిగాను, ఆనందంతో.

చిరునవ్వు నవ్వాడు జలంధర్. "నేను డబ్బు ఆశించి ఈ కేసులో పని చెయ్యలేదు. ఆ అమ్మాయి అభ్యర్థనే నాకు ప్రేరణ. నీకు వృత్తిపరంగా చెడ్డపేరు రాకుండా యివాళే పత్రికలకు అన్ని వివరాలూ పంపుతాను" అన్నారు, పద్మవైపు చూస్తూ.

"అంతటితో నాకు తృప్తికలగదు సార్! ఆనాడు నన్ను కోపోద్రేకాలతో చూసిన వాళ్ళంతా—అదే.... మా బావ వారి స్నేహితులంతా నన్ను మళ్ళీ అభిమానించాలి. అంచేత నా స్వంత ఖర్చుతో మళ్ళీ విందు

ఏర్పాటు చేస్తాను. మీరు ఛీఫ్ గెస్టుగా రావాలి" అన్నాను.

"యింకా ఈ వంటలెందుకన్నయ్యా! మీరందరూ మాతోనే ఉండండి" అంది నా చెల్లెలు.

"వద్దమ్మా! నా వృత్తి ధర్మాన్ని నేను నిర్వహిస్తూ నలుగురికీ అన్నం పెట్టడంలోనే నాకు తృప్తి. నువ్వు సుఖంగా ఉన్నావు. వుంటావు. అంతే చాలు" అని జలంధర్‌నీ, చక్రవర్తినీ చూస్తూ "సార్! రేపే ఫంక్షను. మర్చిపోరు కదూ! అంతేకాదు. జలంధర్ గారి వివాహాని కూడా నేనే ఛీఫ్ గెస్టుని—సారీ—వంటలయ్యని" అన్నాను నవ్వుతూ.

అందరూ గట్టిగా నవ్వారు.

అంత ఆనందంలోనూ జిడ్డుగాడు గుర్తువచ్చి, అందరి కనులూ చెమ్మగిల్లాయి.

—: అయిపోయింది :—

సీరియల్

# శైల దుర్గం

## బొమ్మిడి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

అందరు తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నారు.

అయితే తమ నమ్మినబంటయిన డ్రైవరు భరణి మరణం అందరి మనసుల్ని కలచివేసింది. ప్రొఫెసర్‌ని పోగొట్టుకున్న కొన్ని గంటల వ్యవధిలో భరణిని కూడా పోగొట్టుకోవటం అందరికీ బాధాకరంగా వుంది.

ఈ లోపల దీప్తి తన బ్లౌజు వెతుక్కుని ధరించింది. అప్పటివరకు అర్ధనగ్నంగా అందరిముందు నిల్చుని వుండటంతో ఆమెకు తల కొట్టేసినట్టుంది. ఎవరికంకా చూడలేక తల తిప్పుకున్నది. చీరవంక చూసుకోవటానికే భయంగా వుంది. చక్కటి నీలిరంగు చీర కాస్తా పసుపు రంగుకి తిరిగి వుంది! చీరలు తమ మకాం చేసిన చింతపల్లెలోని యింట్లో వుండిపోయాయి. ఏరోజు కారోజు వెళ్ళి రావాలన్నది ప్రోగ్రాం! కాని జరిగింది మరొకటి.

కార్తీక్, అభిలాష్, హిమవంత్, అశ్వని కాసేపు

భరణీ ఆత్మశాంతికి అతని శవంముందు నిల్చుని మౌనం పాటించారు. దీపి వాళ్ళ ననుసరించింది.

కార్తీక్ వాచీ చూసుకున్నాడు. ఉదయం అయిదు గంటలు దాటి యిరవై నిమిషా లయింది.

"దాదాపు తెల్లారిపోయినట్లే! ఈ మారుమూల కోణంలోకి వెలుతురువచ్చే అవకాశంలేదు. పగలు, రాత్రి ఒకేలా వుండేలా వున్నాయిక్కడ!" అన్నాడు కార్తీక్.

"బయటకి పోదామా?" అన్నాడు హిమవంత్.

"సమయానికి నువ్వు, భరణి రాకపోతే యీ నాటితో మా నలుగురి కథ ముగిసిపోయుండేది!" అన్నాడు అభిలాష్ అశ్విని వంక ప్రశంసాపూర్వకంగా చూస్తూ.

అందరు అభినందించారు అశ్విని చొరవను, సమయస్ఫూర్తిని.

"సరే, పొగడలు తర్వాత! మీరసలు యెలా చిక్కారు యీ మాంత్రికుడికి?" అడిగాడు అశ్విని.

"ముందు మిస్ దీపి వెనకగా నేను నడుస్తున్నాం కదా! అకస్మాత్తుగా ఎవరో నన్ను రెక్కపట్టి-లోపలికి లాగేశారు. నేను గింజుకున్నాను. ఇంతలో మరో వ్యక్తి మిస్ దీపి వెనక్కు తిరిగి చూడటం గమనించి ఆమెని కూడా నోరు నొక్కి గుహలోపలికి లాగేశాడు. వాళ్ళిద్దరి పశుబలంముందు మా బలం ఎందుకూ కొరగాలేదు. ఈ విగ్రహం దగ్గరకు లాక్కొచ్చి కట్టిపడేశారు. మిస్ దీపి విగ్రహాన్ని చూసి భయంగా కేక వేయబోయి మాంత్రికుడు ఉరిమి చూడటంతో బిక్కచచ్చిపోయినట్టు అలాగే నిల్చుండిపోయింది.

వాళ్ళ తంతు చూడగానే మా యిద్దరికీ అర్థమై

పోయింది — మమ్మల్ని కాళికి బలివ్వబోతున్నారని! నిస్సహాయంగా అలాగే వుండిపోయాం" అన్నాడు హిమవంత్.

తర్వాత కార్తీక్ అందుకుని, "నువ్వు భరణి ఆరో గుహలోకి మేము అయిదో గుహలోకి ప్రవేశించాం కదా! కొంతదూరం వచ్చేసరికి ఏవో అడుగుజాడలు కనిపించాయి. అభిలాష్ దగ్గర నా దగ్గరకూడా టార్చిలున్నాయి కదా! వాటి ఆధారంతో ముందుకు నడిచాం. ఏ ఆయుధాలు చేతలేకుండా లోనికి ప్రవేశించటం వివేకమైన పని కాదనుకున్నాం. కాని వెనక్కి వెళ్ళేలోపల దీపికి హిమవంత్ కి ఏం ప్రమాదం జరిగిపోతుందోననే ఆత్రంతో ముందుకే నడిచి నేలమాళిగ మెట్లు దిగాం. అయితే మేము చేసిన పొరపాటు, మాంత్రికుడి అనుచరులు చూసే వరకు టార్చిలైట్లు ఆర్పివేయకపోవటం! అదే మమ్మల్ని వాళ్ళకు పట్టిచ్చింది. మమ్మల్ని కూడా బంధించిపారేశారు!" అన్నాడు.

అశ్విని తలూపి, "మేమిద్దరం మీ రెవరూ బయిటికి రాకపోవటంతో ఏదో ప్రమాదం ముంచుకొచ్చి వుంటుందని వూహించాం. అందుకే దొంగల గుహలోకి పోయి రివాల్వర్లు తెచ్చుకున్నాం. సమయానికి మాంత్రికుడి చేతికి గురిచూసి కాల్చాను గాబట్టి సరిపోయింది గాని, లేకుంటే హిమవంత్ కూడా మనకు దక్కక పోయేవాడు!" అన్నాడు.

"చాలా అదృష్టవంతులం! మాంత్రికుడి బారినుంచి తప్పించుకోవటమంటే మాటలు కాదు! ఈపాటికి క్షుద్ర శక్తులు మన రక్తం పీల్చివుండేవి. గాలిలో వాటి శబ్దాలు స్పష్టంగా వినిపించాయి" అన్నాడు అభిలాష్.

"గుహ లోపల యింకా ఏముందో చూసిపోదామా?"

అశ్విని మాటలకు తక్కినవాళ్ళు ఉలిక్కిపడి చూశారు.

"కోరి కోరివితో తల గోక్కోవటం దేనికి? మన అదృష్టం బావుండి ప్రాణాలు దక్కించుకున్నాం. ఇదంతా భూగృహంలా వుంది. లోపల ఏముందో, క్రూర మృగాలే వున్నాయో, విషసర్పాలే పొంచుకునివున్నాయో యెవరికి తెలుసు? పదండి, బయటికి పోదాం! వేన్ చేరుకుని చింతపల్లెపోయి, సరంజామా సర్దుకుని యిళ్ళకు పోదాం!" అన్నాడు హిమవంత్. మృత్యు ముఖంనించి బయటపడ్డాక ఎంత తొందరగా యిల్లు చేరుకుని తన వాళ్ళను కల్సుకుందామా అని ఆత్రుతగా వుందతనికి!

"ఇక ఎలాగూ వెళ్ళిపోతాం కదా, ఓసారి లోపలికి పోయి చూద్దాము. ఒక అరగంట మాత్రమే! తర్వాత నువ్వన్నట్టు వేన్‌లో చింతపల్లె పోదాం. నాకు డ్రయివింగ్ వచ్చుగా. మిమ్మల్ని సురక్షితంగా చేరుస్తాను" అన్నాడు కార్తీక్.

అభిలాష్ దీప్తిలో చెలరేగుతున్న భావాల్ని కనిపెట్టి "మనం మగాళ్ళం, మన మాటకేం, మిస్ దీప్తి విషయమే మరచి మాట్లాడుతున్నాం" అన్నాడు.

దీప్తి జరిగిపోయిన భయంకర సంఘటనల్ని మరచి పోవటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తోంది. ఒకదానివెంట మరొకటి వేగంగా జరిగిపోయిన విషాద సన్నివేశాలు మరపు రావటంలేదు సరికదా, కన్నుమూసినా తెరిచినా మాంత్రికుడే కనిపిస్తున్నాడు. భయంతో ఆమె శరీరం సన్నగా ఒణుకుతునే వుందింకా.

"నాకు వెంటనే మన వూరు పోవాలని వుంది. ఇక ఒక్క క్షణం కూడా యిక్కడ వుండను" అన్నదామె. ఆ రెండు మాటలు నోటినుండి రావటమే బ్రహ్మప్రళయమైంది.

"ఆల్ రైట్! గుహ బయటికి పదండి. యెందుకైనా మంచిది, రివాల్వర్‌లు వెంట తీసుకుపోదాం! రెండే వున్నాయి, మూడోది భరణి చేతిలో వుండాలి ఏమైపోయిందో!" అన్నాడు అశ్విని, కార్తీక్ చేతిలోను తన చేతిలోను వున్న రివాల్వర్స్ వంక చూస్తూ.

"ఇదిగో, యిక్కడుంది!" అన్నాడు అభిలాష్ విగ్రహం కాళ్ళముందు పడున్న రివాల్వర్‌ని తీసి.

"గుడ్ మా యిద్దరి రివాల్వర్స్‌లోను గుళ్ళు లేవు! అందులో వుండివుంటాయి" అన్నాడు.

అభిలాష్ మాగజైన్ విప్పిచూసి "నాలుగున్నాయి!" అన్నాడు.

"ఇంకా దొంగల గుహలో చాలా రౌండ్సుండాలి! మనకు టైం దొరక్క వెంట తెచ్చుకోలేదు!" అన్నాడు అశ్విని.

ఒకరివెంట ఒకరు నేలమాళిగ మెట్లెక్కి గుహలోని కొచ్చారు. అక్కడ వెల్తురు బయటినుంచి వచ్చి పడుతోంది.

ముందు కార్తీక్ అతని వెనక దీప్తి, హిమవంత్ అభిలాష్ చివరగా అశ్విని నడుస్తూ గుహ ముఖద్వారం దగ్గరికి చేరుకున్నారు.

"అరె, యిదేమిటి?" అన్నాడు కార్తీక్ చటుక్కున నిలిచిపోయి.

అందరు ఉలిక్కిపడి యెదుటి దృశ్యం చూసి విస్మయంగా అలాగే నించుండిపోయారు.

* * *

గుహ యెదురుగా నలుగురు వ్యక్తులు నేల తవ్వుతున్నారు. రాక్సన్ బృందంకన్న కర్కశంగా, నరరూప రాక్షసుల్లా కనిపిస్తున్నారు. నలుగురు నల్లగా దృఢంగా వున్నారు. యెవరూ ఆరడుగులకన్న తక్కువ పొడవులేరు! నలుగురి చేతుల్లోనూ గడ్డపారలు, పలుగులు వున్నాయి!

ఓ పక్క యింకా సూర్యుడు ఉదయించనేలేదు! వాళ్ళు యెప్పుడొచ్చారో, తవ్వకాలు యెప్పుడు మొదలెట్టారో అనుమానంగా వుంది!

"ఎవరు వీళ్ళు? రాక్సన్ బృందంలోని వాళ్ళే కాదు కదా?" ఆశ్చర్యంగా వాళ్ళవంక చూస్తూ అన్నాడు హిమవంత్.

"చూడగా వీళ్ళు యింకో ముఠాలా వుంది! రాక్సన్ బృందం వచ్చిన నలుగురే! వీళ్ళు ఇంకా క్రూరంగా కనిపిస్తున్నారు. బహుశా అదే ధ్యేయంతో తవ్వటానికొచ్చిన మరో ముఠా అయి వుంటుంది....! అంటే యీ నిధిని గురించి యింకా కొంతమందికి ముందే తెలుసన్న మాట!" అన్నాడు సాలోచనగా కార్తీక్.

"అయితే, యీ కొండల్లో ఖచ్చితంగా నిధి వుండే వుంటుంది. రెండు ముఠాలు ఒకరికి తెలీకుండా మరొకరు దాన్ని సంపాదించుకోవటానికి తవ్వకాలు సాగిస్తున్నారన్నమాట!" అన్నాడు అభిలాష్.

"అయితే యిదివరకే రాక్సన్ వాళ్ళు గత నాలుగు రోజులుగా తవ్వుతున్నారు కదా! ఆ తవ్వకాల సంగతి

ప్రత్యక్షంగా కనిపిస్తూండగా యీ బృందం వాళ్ళకి కనీసం అనుమానమైనా గాలేదా, ఏం? సరాసరి తిక్క తాళ్లో పడిపోయారు!?" అన్నాడు అశ్విని.

"గమనించే వుండొచ్చు! గుహలో చచ్చిపడున్న రాక్షస్ వాళ్ళను చూసి వుండొచ్చు కూడా! నిధి గురించి ఏదో తగవులొచ్చి ఒకళ్ళనొకళ్ళు గునపాలతో పొడుచుకు చచ్చారని భావించి వుండొచ్చు" అన్నాడు కార్తీక్.

"ఇప్పుడెలా మనం వేన్ చేరుకోవటం? వేన్ దగ్గరికి పోవాలంటే వీళ్ళ ముందరినుంచే వెళ్లాలి. వీళ్ళ కళ్ళ బడితే వీళ్ళేం చేస్తారో ఆలోచించాల్సిన సంగతే!" అన్నాడు హిమవంత్.

ఆ అయిదుగురి మనసుల్లోను ఒకటే ప్రశ్న!

"ఎలా వీళ్ళనుదాటి వేన్ చేరుకోవాలి?" అని.

"మనం బయల్దేరిన వేళా విశేషం మంచిదికాదు! వచ్చి వచ్చి యీ భయంకర కొండల్లోపడ్డాం. ఇరుక్కు పోయాం. ఈ టైగర్ హిల్స్ వెనక యింతపెద్ద నిధి రహస్యం దాగివుందని మన ప్రొఫెసర్ గారు కనీసం వూహించి కూడా వుండరు" అన్నాడు హిమవంత్.

"వాళ్ళు మనల్ని గమనించే ప్రమాదముంది! మళ్ళీ వెనక్కి, గుహలోకి వెళ్ళిపోదాం?" అన్నాడు కార్తీక్ అందరివంక పరిశీలనగా చూస్తూ.

అందుకెవరూ సుముఖంగా లేరని చూడగానే తెలిసి పోయిందతనికి.

కాని ముందు గొయ్యి, వెనక నుయ్యి!

సూర్యకిరణాలు ఆ గుహ ముఖద్వారంమీద బంగారు మలాము పూస్తున్నాయి.

ఇంతలో నలుగురిలోను ఒకడి దృష్టి వాళ్ళున్న గుహ

మీద పడింది. తవ్వేపని ఆపి గబగబ గుహవైపు నడుస్తూ వస్తున్నాడు.

"కొంప మునిగింది. వాడెవడో కనిపెట్టేసినట్టున్నాడు. ఇక వెనక్కి వెళ్ళటం తప్ప గత్యంతరంలేదు. కమాన్, హరియప్!" వెనక్కి తిరిగి చకచక అడుగులు వేయసాగాడు కార్తీక్.

ఆ వ్యక్తి చాలా వేగంగా అక్కడికి దూసుకొచ్చాడు.

అప్పటికే కార్తీక్ వెంట అందరూ గుహ చివరికి చేరి నేలమాళిగ మెట్లు దిగబోతున్నారు.

కార్తీక్ ఆగి వెనక్కి చూశాడు. ఆ వ్యక్తి కనిపించలేదు.

"ఆ మనిషి ఏమయ్యాడు?" అన్నాడు తక్కిన వాళ్ళ వంక తిరిగి ఆశ్చర్యంగా. అందరూ వెనుతిరిగి చూశారు.

ఆ వ్యక్తి కనపడలేదు.

"ఇదేదో ఎత్తుగడమీదే వున్నట్టుంది అతని వాలకం చూస్తూంటే! మనల్ని గుర్తించారు, ఎంతమంది వున్నామో లెక్కించుకుని వుంటాడు. తన వాళ్ళ దగ్గరకు పోయి చెబుతాడు. వాళ్ళంతా మనమీదికి దండెత్తి రావచ్చు. ఇప్పుడెలా?" అన్నాడు అభిలాష్.

కార్తీక్‌తోబాటు అందరు ఆలోచనలో పడ్డారు. తమవెంట ఒకేఒక ఆయుధమ్నుంది — నాలుగుగుళ్ళున్న రివాల్వర్! తక్కిన రెండు నిరుపయోగం. ఆ నాలుగు గుళ్ళనే కావాలంటే మూడు రివాల్వర్లలోను సర్దుకోవాలి! కాని శత్రువులు నలుగున్నారు. వాళ్ళవెంట గునపాలు, గడ్డపారలుతోబాటు మారణాయుధాలెన్నో

వుండివుండొచ్చు! తాము వాళ్ళని ఎదుర్కొని నిలవటం జరిగేపని కాదు!

"అనవసరంగా వాడి కళ్ళబడిపోయాం. నిజానికి మనం వాళ్ళకేవిధమైన హాని చెయ్యమని చెప్పినా వినరు. ప్రాణాలతో వదలరు. రాకేష్ బృందం కనీసం బంధించి వుంచారు. కాని అందరు అలా సౌమ్యంగా యెందుకు ప్రవర్తిస్తారు? చివర్లో వాళ్ళు కూడా మనమీద కత్తి దూసిన వాళ్ళే కదూ!" అశ్విని అన్నాడు.

"ఇంకా యిలా యిక్కడే నుంచుంటే వెనుకనుంచి వాళ్ళు నలుగురు పరుగెత్తుకొస్తారు. మనల్ని ఊచకోత కోసేస్తారు. పదండి గుహాలోపలికి పోదాం. భూగర్భంలోనే దాగి ప్రాణాలు కాపాడుకుందాం" కార్తీక్ మెట్లు దిగేశాడు వేగంగా. అతని వెంట తక్కిన నలుగురు దిగేశారు.

కాళికా విగ్రహం, పక్కనే నేలకూలిన మాంత్రికుడు ఆ పక్కగా చచ్చిన యిద్దరు అనుచరులు, వాతావరణం భయంకరంగా వుంది.

"విగ్రహం వెనుక పక్కనుండి ఏదో దారి వున్నట్టు కనిపిస్తోంది, అటు సాగుదాం!" అన్నాడు కార్తీక్ దారితీస్తూ. అందరు అతన్ని అనుసరిస్తున్నారు.

"గుహ పైభాగంలో అడుగుల చప్పుడవుతోంది. వినిపిస్తోందా?" అన్నాడు అభిలాష్ చెవులు రిక్కించి.

తక్కిన వాళ్ళు కూడా విన్నారు. స్పష్టంగా వినిపిస్తున్నాయి అడుగుల చప్పుళ్ళు! ఒకరివంక మరొకరు సాభిప్రాయంగా చూసుకున్నారు. శత్రువులు లోపలికొస్తున్నారు. ఏ క్షణంలోనైనా భూగృహంలోకి ప్రవేశించవచ్చు! తమకు తప్పించుకునే దారి యింకా ఏదీ

కనపడలేదు.

మొదట్లో యిరుగ్గా అనిపించినా రానురాను విశా లంగా కనిపించింది భూగృహ దారి.

దీప్తి కెవ్వున అరిచింది.

"ఏమిటి, ఏమయింది?" అన్నారు తక్కినవాళ్ళు.

"ఏదో మెత్తటి వస్తువుమీద కాలువేశాను. అది కదులున్నట్టనిపించింది" అన్నదామె.

వెంటనే టార్చిలు అటు ఫోకస్ చేశారు.

ఒకటి కాదు, రెండు కాదు అయిదు సర్పాలు! తోక మీద నిలిచి పడగవిప్పి వున్నాయి. వాటివంక చూడ టానికే ఒళ్ళు జలదరించింది అందరికీ! కాలు ముందుకు వేస్తే కాటేసేటట్లున్నాయి. బుస్ మన్న శబ్దాలు భయంకర ధ్వనితో గుండెలు అదరగొట్టాయి.

"ఎలా యిప్పుడు? వెనుక చూడబోతే వాళ్ళు మరింత దగ్గరవుతున్నట్టు తోస్తోంది. ఎగిరి గంతేసి తప్పించు కోవచ్చు. పాములమీదనుంచి ఎగురుదామా?" అన్నాడు కార్తీక్.

"వాటిని చూస్తుంటేనే ఒళ్ళు గగుర్పాటు చెందు తోంది. ఏ మాత్రం కాలు తగిలినా కాటందుకోవటం ఖాయం!" అన్నాడు హిమవంత్.

కార్తీక్ ఆలోచిస్తూ కూచోలేదు. ఒక్క గెంతున సర్పాల తలలమీదుగా అవలిపక్కకు ఉరికాడు. కింద నేల జారుడుగా వుంది. జారబోయి నిలదొక్కుకున్నాడు.

హిమవంత్, అభిలాష్, అశ్వని అతన్ననుసరించారు.

"జాగ్రత్త, నేల జారుతోంది" అన్నాడూ కార్తీక్ హెచ్చరిస్తూ.

"మిస్ దీప్తీ! మీరు గోడపక్కగా తడుముకుంటూ

ఈ పక్కకు వచ్చెయ్యండి. పాముల్ని మేము మీమీదకు రాకుండా చెదరగొడతాం!" అన్నాడు అశ్విని.

"ఎలా చెదరగొడతావు, కాల్చేస్తావా?" అడిగాడు హిమవంత్.

అశ్విని వంగి వాటి కళ్ళమీదకు టార్చిలైట్లు ఫోకస్ చేశాడు. అవి తమ గమనాన్ని మార్చుకున్నాయి. బుస్ మంటూ వెలుగు కనిపించినవైపు తలలు తిప్పాయి. వున్న చోటునించి కదిలాయి.

అదే అదనుగా దీప్తి భూగర్భగృహం గోడను అను కుంటూ కార్తీక్ వాళ్ళున్నవైపు జరిగింది.

పాములు జరజర అశ్వినివైపు పాకుతున్నాయి.

దీప్తి తమలో చేరగానే అందరు ముందుకి పరుగందు కున్నారు. పాములు బాగా వెనకపడ్డాయి. అశ్విని కూడా వాళ్ళతో కలుసుకున్నాడు.

రెండుసార్లు జారబోయి నిలదొక్కుకుంది దీప్తి.

"నేను పరుగెత్తలేకపోతున్నాను. ఆయాసంగా వుంది" అన్నదామె. పరుగువేగం తగ్గిపోయింది.

"సరే, రెండు నిమిషాలు రెస్టుతీసుకోండి. ఇక్కడ కొంచెం వెలుగు కనిపిస్తోంది. యెక్కడినుంచో సన్నటి వెలుగు కిరణాలు ప్రసరిస్తున్నాయి. దారి బాగానే కనిపిస్తోంది" అన్నాడు కార్తీక్.

భూగృహంలా లేదక్కడ. విశాలంగానే కనిపిస్తోంది. కాకపోతే పైన ఏదో నెత్తిమీద ఆకాశం కనపడకుండా అడ్డుగానే వుంది. బిలం తొలిచిన గుర్తులు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"అటు చూడు కార్తీక్. అక్కడ ఏదో పచ్చటి వెలుగు కనిపిస్తోంది, కదూ!" అన్నాడు అశ్విని.

శా ర్లీక్‌తో బాటు అందరు అటు చూశారు.

"అవును. సూర్యకిరణాలేమో!" అన్నాడు హిమవంత్.

"సూర్యుడి ఉదయకిరణాలు అలాగే వుంటాయిగాని, సూర్యోదయమై రెండు గంటలుపైగా అయింది. ఈపరికి సూర్యుడి కాంతి తెల్లదనానికి తిరిగివుంటుంది" అన్నాడు శార్లీక్.

"సరే, అటే పోదాం పదండి. అక్కడే బాగా కాంతివంతంగా వుంది. ఇక్కడ రాళ్ళు రప్పలు కూడా దండిగానే వున్నాయి. దారి విశాలంగా వుంది. ఇలా ఇది యెక్కడికి తీసుకుపోతుందో పోదాం పదండి!" అన్నాడు అశ్వని.

శార్లీక్ వెనుతిరిగి చూశాడు. శత్రువులు వస్తూన్న జాడ కనిపించలేదు.

"చిత్రంగా వుందే, యీపాటికి వాళ్ళు మనల్ని కలుసుకుని వుండేవాళ్ళు! ఏమైవుంటారు?" అన్నాడు అభిలాష్ అందరివంకా ఆశ్చర్యంగా చూస్తూ.

"పాములు అడ్డుకున్నాయేమో! మనమీది కోపం, కసి వాళ్ళమీద చూపించి కాటంగుకుని వుంటాయి."

"అంత తెలివి తక్కువగా పాముల కాటుకు చిక్కరు. వాళ్ళ చేతుల్లో ఆయుధాలుంటాయనే సంగతి విస్మరించినట్టున్నావు."

"ఎక్కడో మనకోసం పొంచివుంటారు. మనం తిరిగి రాకపోతామా అని కాచుకుని వుండివుంటారు. మనం ఎట్టి పరిస్థితుల్లోను వెనక్కు వెళ్ళకూడదు!"

"మిస్. దీప్తీ! నడవగలరా? ఆ వెలుతురు వస్తూన్న వైపుకి వెళ్దాం!" అన్నాడు శార్లీక్.

దీప్తి తలూపింది.

మెల్లగా ఆ పచ్చటి వెలుగు వస్తూన్నవైపు అందరు నడుస్తున్నారు.

"ఆగండి, ముందుకు రావద్దు!" అన్నాడు కార్తీక్ ఆగిపోయి చెవులు రిక్కించి.

గాల్లో 'ఇస్'మంటున్న శబ్దాలు. ఆ శబ్దాలు తామిది వరకు విన్నవే! కార్తీక్ కి గుర్తువచ్చింది. అవును! మాంత్రికుడు నేలకూలటానికి ముందు కాళికావిగ్రహం చెంత యిలాంటి శబ్దాలే వినిపించాయి.

అందరు స్పష్టంగా విన్నారు.

"అవును, యివే చప్పుళ్ళు! క్షుద్రదేవతలు గాల్లో తిరుగుతున్న సవ్వడి!"

అందరు ఉలిక్కిపడ్డారు. ఈసారి 'ఇస్'మన్న శబ్దాలు మరింత తీవ్రస్థాయిలో పక్కనే వినిపించినట్టనిపించింది. ఏవో అస్పష్టమైన రణగొణ ధ్వనులు కూడా వినిపించాయి.

ముందుకి అడుగువేయబోయిన కార్తీక్ వెనక ఏదో సవ్వడి వినిపించి చటుక్కున తిరిగిచూశాడు.

అప్పటికే శత్రువులు నలుగురు కార్తీక్ బృందాన్ని చుట్టేశారు!

అందరు తెల్లబోయి చేష్టలుడిగి నించుండిపోయారు.

• • •

"ఎవరు మీరు? ఇక్కడ మీకేం పని?" ఆ నలుగురిలోను దృఢంగా బాగా పొడవున్న వ్యక్తి గద్దించి అడిగాడు. తక్కిన ముగ్గురు తుపాకీలు చేతుల్లో సిద్ధంగా పట్టుకుని తమవైపే గురిచేసి వుంచారు!

నాయకుడిలా వున్న ఆ వ్యక్తి చేతిలో రివాల్వర్

వుంది!

అభిలాష్ తనచేతవున్న రివాల్వర్ ని దుస్తుల్లో దాచెయ్యబోయాడు. కాని అది వాళ్ళ కంట్లోపడి పోయింది.

"మీ దగ్గర యెలాంటి ఆయుధాలున్నా వెంటనే మాకు యిచ్చేసి వరసగా నిలబడండి" గద్దించాడు నాయకుడు.

కార్తీక్ తనచేతనున్న గుళ్ళులేని రివాల్వర్ కింద వదిలేశాడు. అశ్విని మాత్రం అప్పటికే తనవద్దనున్న రివాల్వర్ ని దుస్తుల్లో దాచేశాడు. కాని దాంట్లో గుళ్ళు లేవు!

తిరగబడి తాడో పేడో తేల్చుకుందామని అందరికీ గాఢంగా మనసులో వున్నా, నిరాయుధంగా వాళ్ళ ముందు నిలబడతామని అందరికీ తెలుసు! ఈసారి తమ ప్రాణాలు దక్కవని అందరికీ అర్థమైపోయింది.

"చెప్పరేం, మీరెవరు? ఈ గుహల దగ్గర మీకేం పని?" అన్నాడు నాయకుడు.

కార్తీక్ చెప్పాడు. "మేం జియాలజీ స్టూడెంట్సుం! సర్వేకొచ్చాం. తెలియక ఈ గుహలో అడుగుపెట్టాం!"

నాయకుడుగాని తక్కినవాళ్ళుగాని అతని మాటలు విశ్వసించినట్టులేదు!

"అలా అయితే నన్ను చూసి గుహలోపలికి యెందుకు పారిపోయారు? అంత భయపడాల్సిన పనేం వచ్చింది?" అన్నాడు — ముందుగా వాళ్ళను కనిపెట్టి పరుగెత్తుకొచ్చిన వ్యక్తి. అతనే పోయి తన వాళ్ళను తీసుకొచ్చాడు.

"ఇదివరకు మీలాగే మరో నలుగురు వ్యక్తులు

మమ్మల్ని వెంటాడి హింసించారు. మీరు కూడా అలా చేస్తారేమోనని భయపడి పారిపోయాం!" అన్నాడు కార్తీక్. ఈ ఉపద్రవంనుంచి తప్పించుకోవటం ఎలాగా అని అతని మనసు తీవ్రంగా ఆలోచిస్తూనే వుంది!

నాయకుడు తక్కిన ముగ్గురివంక చూశాడు. వాళ్ళు సాభిప్రాయంగా తలలూపారు.

"అయితే, రాక్సన్ వాళ్ళను చంపింది మీరేనా?" నాయకుడు సూటిగా కార్తీక్‌వంక చూశాడు.

"రాక్సనా? అతనెవరు?" అంటూ అంతలోనే ఏదో స్ఫురించి దీప్తివంక చూశాడు కార్తీక్. ఆమె తల అడ్డంగా తిప్పింది.

"రాక్సన్ తెలీదా? పోనీ నికోలిస్ తెలుసా?"

దీప్తి ముఖం వెలిగింది. కార్తీక్‌వంక సాభిప్రాయంగా చూసింది. తనను బలవంతం చేయబోయిన స్ఫోటకం మచ్చలవాడు! అయితే మరో వ్యక్తి పేరు రాక్సన్ అన్నమాట!

"ఆ...ఆ.... పేర్లు తెలీవు. నికోలిస్ పేరు మాత్రం తెలుసు. అతను వాళ్ళ నలుగురిలో ఒకడు."

"అయితే వాళ్ళని నిర్దాక్షిణ్యంగా మీరే చంపేశారన్నమాట!" నాయకుడు డేగచూపులు చూస్తూ అన్నాడు.

"లేదు లేదు! మమ్మల్ని వెంటపడి వేధించబోతేనే మేము పారిపోయి ఈ గుహలోకి వచ్చి దాక్కున్నాం. అయితే అక్కడ ఓ మాంత్రికుడు, యిద్దరు అనుచరులు మమ్మల్ని పట్టుకుని దేవికి బలివ్వబోయారు. ఇంతలో నికోలిస్ వాళ్లు మమ్మల్ని వెతుక్కుంటూ మాంత్రికుడి వద్దకు పరుగెత్తుకొచ్చారు.

మాంత్రికుడు తన మంత్రదండంతో వాళ్ళను ఏదో మంత్రించాడు. వాళ్ళు కదలక మెదలక నిల్చుండి పోయారు. ఈలోపల మాంత్రికుడి అనుచరులు వాళ్ళ నలుగుర్నీ గుహ బయటకి తీసుకుపోయారు. తర్వాత ఓ పదినిమిషాలకు అనుచరులిద్దరు తిరిగొచ్చారు. నికోలిస్ని తక్కిన ముగ్గుర్నీ వాళ్ళే చంపివుండొచ్చు, మాకు తెలీదు!" అప్పటికప్పుడు కథ అల్లి నమ్మకంగా చెప్పేశాడు కాత్రిక్.

తక్కిన వాళ్ళు శ్రోతల్లా వుండిపోయారు.

కాత్రిక్ మంచి రచయిత. అందుకే సమయానుకూలంగా చక్కటి కథ కల్పించి అతికినట్టు చెప్పేశాడు. మిత్రులు నలుగురు అవునన్నట్టు తలలూపారు.

నాయకుడు తక్కిన తినవాళ్ళు ముగ్గురివంక చూశాడు.

"అవును, అదే అయివుంటుంది!" అన్నాడు ఓ వ్యక్తి. తక్కిన యిద్దరు తలలూపారు.

"అయితే, మాంత్రికుడ్ని అతని అనుచరుల్ని యెవరు చంపారు? అది కూడా నికోలస్ వాళ్ళేనా?" అన్నాడు నాయకుడు వ్యంగ్యంగా.

కాత్రిక్ వెంటనే, "మేమే చంపేశాం! మమ్మల్ని, నిర్దాక్షిణ్యంగా కాళికకు బలివ్వబోతుంటే యిక గత్యంతరం లేక కాల్చి చంపేశాం!" అన్నాడు.

"అంటే యిలాంటి సంఘటనలు యెదురవుతాయని మీరు సర్వేకొచ్చేముందే తెలిసి, రివాల్వర్సు వెంట తెచ్చుకున్నారన్నమాట!" అన్నాడు నాయకుడు.

"నో, నో! ఈ రివాల్వర్సు మావికావు. నికోలస్ వాళ్ళు మాంత్రికుడి మాయలోపడి కదలక మెదలక నిల్చుండిపోయారు కదా! అప్పుడు వాళ్ళ చేతుల్నించి

రివాల్వర్స్ కిందపడ్డాయి. సమయానుకూలంగా ఆపదలో మేము ఆ రివాల్వర్స్ అందుకుని మాంత్రికుడి అనుచరుల్ని కాల్చేశాం. మాంత్రికుడిని శూలంతో పొడిచి చంపేశాం! మీరు దారిలో చూసేవుంటారు!" అన్నాడు కార్తీక్ ఏ మాత్రం తడుముకోకుండా.

నాయకుడు తలూపాడు.

ఇంతలో మరో వ్యక్తి ప్రశ్న లేవదీశాడు. "మాంత్రికుడు, అతని అనుచరులే కాకుండా మరో వ్యక్తి చచ్చిపడున్నాడు వాడెవడు?" అని.

"అతను మా వేన్ డ్రయివరు. మాంత్రికుడి అనుచరుడు చంపేశాడు. మాకోసం అతను ప్రాణాలు ధారపోశాడు!" కార్తీక్ కంఠంలో నిజంగానే విచారం ధ్వనించింది.

"నిజమే కావచ్చు. అయితే కొండ దిగువున వున్న వేన్ మీదేనా?" అన్నాడు మరొకడు.

"ఎస్! దాంట్లో మా సర్వే మెటీరియల్స్, డ్రిల్లింగ్ మెషిన్లు, మెజరింగ్ టేప్స్ మీరు చూసేవుంటారు. అవి మావే! యిప్పటికైనా మా మాటలమీద నమ్మకం కుదిరిందా?" అన్నాడు అశ్విని.

నాయకుడు సాలోచనగా తలూపాడు.

"మమ్మల్ని వదిలేస్తే మా దారిన మేము పోతాం! ఇక్కడ జరిగిన విషయాలన్నీ యిక్కడే వదిలేస్తాం" అన్నాడు కార్తీక్.

నాయకుడు మాట్లాడలేదు. తర్వాత "మాతోరండి. ఏం చెయ్యాల్సిందీ ఆలోచిద్దాం!" అన్నాడు.

కార్తీక్ బృందం ఒకరి మొఖాలొకరు చూసుకున్నారు.

వాళ్ళ నలుగురి చేతుల్లోను ఆయుధాలు తమవంకే గురి చేయబడి వున్నాయి. తాము కాదని మొండికేస్తే నిర్దా క్షిణ్యంగా కాల్చేసేలా వున్నారు.

కార్తీక్ కళ్ళతోనే తనవాళ్ళకు సంకేతాలిచ్చాడు.

అయిదుగురు వాళ్ళ నలుగుర్నీ అనుసరించారు.

దార్లో చచ్చిపడున్న పాముల్ని చూశాక జరిగిం దేమిటో వాళ్ళకర్థమయింది.

మళ్ళీ మాంత్రికుడు, అతని అనుచరులు చచ్చిపడున్న చోటికి వచ్చారు. భరణిని చూస్తుంటే అందరిలోను మళ్ళీ గుబులు ప్రవేశించింది. ప్రొఫెసర్ని కనీసం పూడ్చి పెట్టారు. భరణికి అదీ జరగలేదు.

దిక్కులేని శవంలా విగ్రహంముందు పడున్న అతన్ని చూస్తుంటే వాళ్ళ హృదయాలు ద్రవించాయి.

అప్పటికి పొద్దు నడినెత్తికొచ్చింది.

*　　*　　*

మూడో గుహలోనికి తీసుకుపోయారు శత్రువులు— కార్తీక్ బృందాన్ని.

ఆ గుహలో వాళ్ళ సరంజామా అంతా అప్పటికే సర్దుకున్నట్టున్నారు. గుహబయట ఇద్దరు మనుషులు వంట చేస్తున్నారు. వాళ్ళిద్దరు యిదివరకు తమకు కనిపించ లేదని గ్రహించారు కార్తీక్ బృందం.

నాయకుడు కార్తీక్ వాళ్ళవైపు చూసి, "కాసేపట్లో మీకు భోజన సదుపాయాలు చూడబడతాయి. మీరు అయిదుగురు బుద్ధిగా యీ గుహలోపలే వుండండి. తప్పించుకోవటానికి ప్రయత్నిస్తే ప్రాణాలు దక్కవు!" అన్నాడు.

కార్తీక్ వాళ్ళు ఉస్సురని నిట్టూర్చారు. చరిత్ర

చర్విత చర్వణం కావటమంటే యిదే ననిపించింది వాళ్ళకు! నికోలస్ బృందానికి వీరు వారసుల్లాగా వున్నారు. వాళ్లూ యిలాగే తమని ఏ హానీ చెయ్యకుండా బంధించారు మొదట్లో! ఇప్పుడూ అదే జరగబోతోంది.

"మీ రెవరో తెలుసుకోవచ్చా?" అశ్విని సూటిగా ప్రశ్నించాడు నాయకుడ్ని.

అతను విరగబడి నవ్వాడు. అతను నవ్వుతుంటే అతని పెదాలు వికృతంగా నోటి చివర్లకు సాగి చాలా అసహ్యం పుట్టించింది చూసేవాళ్ళకు.

కాసేపటికి నవ్వాపుకుని, "మా గురించి యెవరని అడిగినవాడివి నువ్వే కనబడ్డావు. నోర్మూసుకుని చెప్పినట్టు విను!" అన్నాడు.

"మాటలు తిన్నగా రానియ్యి. మేమేదో నీ బానిసల మన్నట్టు మాట్లాడుతున్నావు...." అని అశ్విని యింకా ఏదో అంటుండగానే నాయకుడు అతని రెండు చెంపలు ఛెళ్లుఛెళ్లున వాయించాడు.

అశ్విని చటుక్కున తిరగబడ్డాడు. నాయకుడి గుండెల మీద ఎగిరి తన్నాడు.

నాయకుడు అదిరిపడ్డాడు. వెనక్కి నిలువునా పడబోయి నిలదొక్కుకున్నాడు. టక్కున ముగ్గురు గన్స్ తీసి అశ్వినికి గురిపెట్టారు.

"కాల్చెయ్యమా?" అన్నారు నాయకుడివంక చూసి. నాయకుడు తల అడ్డంగా తిప్పాడు.

"నామీద చెయ్యి చేసుకున్నవాడ్ని ప్రాణాలతో విడిచిపెట్టిందిలేదు! కాని వీడు అర్భకుడు! అడంగి వెధవలా వున్నాడు. వీడ్ని ఆ బండకి కట్టిపడెయ్యండి. వీడ్ని చంపటం మనకి నామోషి!" అన్నాడు నాయకుడు

ఒగరుస్తూ.

కార్తీక్, అభిలాష్, హిమవంత్, దీప్తి తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నారు. అశ్విని దుడుకుతనంతో ప్రవర్తించి ప్రాణంమీదికి తెచ్చుకున్నాడు. గతంలో అనుభవం అయినది మరచినట్లున్నా డనుకున్నారు.

నాయకుడు అందరివంకా చూసి, "మీలో ఎవరైనా సరే పొగరుబోతుతనంగా ప్రవర్తిస్తే నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తాం. మిమ్మల్ని యీ గోతుల్లోనే పాతేస్తాం. జాగ్రత్త! ప్రాణాలు తీయటం మాకు కొత్తకాదు. కాని ఏదో స్టూడెంట్సు మన్నారనే కనికరంకొద్దీ మిమ్మల్ని చంపకుండా వుంచాం. మా అనుమతిలేకుండా మీరెవరూ గుహ బయటికి అడుగుపెట్టడానికి వీల్లేదు!" అని తక్కిన ముగ్గురు అనుచరులవంక చూశాడు.

వాళ్ళు ముగ్గురు పెద్ద పగ్గం తెచ్చి కార్తీక్ బృందాన్ని కాళ్ళు చేతులు మెలికవేసి కట్టేశారు. సరిగ్గా రాక్సన్ బృందం ప్రవర్తించినట్టే వుంది వీళ్ళ ప్రవర్తన కూడా అనుకున్నారు వాళ్ళు అయిదుగురు.

* * *

రెండు రోజులు గడిచాయి.

తవ్వకాలు అలా సాగుతునే వున్నాయి. తినటానికి, కాలకృత్యాలకి తప్ప తక్కిన సమయాల్లో కార్తీక్ బృందాన్ని తాళ్ళతో అలా బంధించే వుంచారు శత్రువులు.

"ఇలా ఎన్నాళ్ళు? తిరగబడి చావో, బతుకో తేల్చుకుందాం?" అశ్విని ఆవేశంగా అన్నాడు.

"తొందరపడకు మిత్రమా? ఆవేశం అన్నివేళలా

మంచిదికాదు. చిన్న వాడితో పెట్టుకున్నావు. నిర్దా క్షిణ్యంగా కొట్టాడు. చంపుతాడేమోనని భయపడ్డాం అందరమూ!" అన్నాడు హిమవంత్.

"అయితే యిలా బానిస బతుకు బతకటమేనా మన గతి? నికోలస్ వాళ్ళకు పట్టించినగతే వీళ్ళకు పట్టించ లేమా?" అశ్వని ఆవేశం యింకా చల్లారలేదు.

"సమయం రావాలి దేనికైనా! చూద్దాం, వీళ్ళు యెన్నాళ్ళిలా బంధించి వుంచుతారో! ఏ అర్ధరాత్రివేళో తప్పించుకునే ప్రయత్నం చేద్దాం. ఆ వంట వాళ్ళు నిజంగా వేటకుక్కల్లా వున్నారు. నిద్రపోకుండా మనల్ని కాపలా కాస్తున్నారు రాత్రిళ్ళు! లేకుంటే ఇదివరకటిలా తాళ్ళు తెంచుకుని సమయం చూసి తిరగబడకపోయే వాళ్ళమా?" అన్నాడు కార్తీక్.

దీప్తి మౌనంగా వుండటం చూసి అశ్వని ఆమెని మాట్లాడించాడు. "మిస్ దీప్తి, వీళ్ళంటే భయం పుడు తోంది కదూ, మీకు! ఏం ఫరవాలేదు. నికోలస్‌లాంటి మృగాలెవరూ లేరు వీళ్ళలో! ఇప్పటిదాకా మర్యాదగానే ప్రవర్తిస్తూ వచ్చారు మరి!"

దీప్తి గొంతు పెకల్చుకుని, "ఈసారి అలాంటి పరి స్థితులే ఎదురైతే వీళ్ళందర్నీ చంపేసి ఆనక నే చస్తాను. ఆడది తెగిస్తే భద్రకాళిలా మారగలదు" అన్నది ఉద్రే కంగా.

"అదీ, మీలో యీ తెగింపుకోసమే నేను యెదురు చూస్తున్నాను. వెరీ గుడ్!" అన్నాడు అశ్వని.

అభిలాష్, హిమవంత్ మౌనంగా ఆలోచిస్తున్నారు.

గుహ బయట తవ్వకాలు యథావిధిగా కొనసాగు తున్నాయి. వంట వాళ్ళిద్దరు సీరియస్‌గా తమ పనిలో

మునిగిపోయి వున్నారు.

"రాత్రిళ్ళకంటే పగలే తప్పించుకోవటం తేలికని పిస్తోంది నాకు!" అన్నాడు కార్తీక్.

"అదెలా? వీళ్ళు మనల్ని ఓ కంట కనిపెడుతునే వున్నారే! మధ్య మధ్య వంట వెధవలొచ్చి చూసి పోతున్నారు!? పైగా బంధాలు! నికోలస్ వాళ్ళకన్న పదిముళ్ళు ఎక్కువే వేసి కట్టేశారే!" అన్నాడు హిమవంత్.

"ముందీ బంధాలు వదిలించుకోగలిగితే ఎలాగో బయట పడొచ్చు! వేన్ దగ్గరకు తప్పించుకుపోయి చేరామంటే గంటలో చింతపల్లె చేరుకోవచ్చు. చింతపల్లె వెళ్ళిపోతే మనకి భయంలేదు."

"అసలు బంధాలు వదిలించుకోగలిగినప్పుడు కదా! అది జరగని పని!"

అందరు తమ చేతులు కాళ్ళ బంధాలవైపు చూసుకున్నారు. అవి కట్టినంతమేర ఎర్రగా కందిపోయి పైన కింద రక్తప్రసారంలేక ఆ భాగాలు తెల్లగా పాలిపోయి వున్నాయి. అక్కడ స్పర్శ కూడా తెలియటంలేదు.

నిస్సహాయంగా ఒకరివైపు మరొకరు చూసుకున్నారు.

* * *

రాత్రి సమయంలో పెద్ద గలభా జరుగుతున్న శబ్దం వినిపించింది.

మగతగా పడుకుని నిద్రపోతున్న కార్తీక్ బృందం ఉలిక్కిపడి హడావిడిగా లేచారు. కాస్సేపటివరకు వాళ్ళకు పరిస్థితి ఏమీ అర్థంకాలేదు.

కాపలా కాస్తున్న వంటవాళ్ళిద్దరు కనపడటంలేదు! నిజానికి వాళ్ళుత్త వంటవాళ్ళే కాదు! అవసరమైతే చేత

తుపాకీ ధరించి ఎదుటి మనిషిని క్రూరంగా కాల్చి చంప గలిగినవాళ్లే!

నాయకుడు హడావిడిగా అరుస్తున్నాడు. అతని అనుచరులు ముగ్గురు టార్చి లైట్సుతో వాళ్ళను వెతక టానికి వెళ్ళారు.

ఓ పదినిమిషాల తర్వాత వంటవాళ్ళిద్దరు నికోలస్ వాళ్ళు చచ్చిపడున్న గుహలో చచ్చిపడున్నారని తెలి సింది.

నాయకుడికి కబురు తెలిసి పరుగెత్తుకు వెళ్ళాడు!

గుహలో కార్తీక్ బృందం మాత్రమే మిగిలింది.

"ఇదే మంచి సమయం. మనం తప్పించుకు పారి పోవాలి!" అన్నాడు అభిలాష్.

"ఎలా! బంధాలు అలాగే వున్నాయే!" అన్నాడు అశ్విని అవకాశం చేజారిపోతున్నందుకు బాధగా.

ఓ చెక్కపెట్టెమీద కొవ్వొత్తి వెలుగుతోంది.

అభిలాష్ నేలమీద పడుకునే దొర్లుతూ చెక్క పెట్టెను చేరుకున్నాడు.

ఓ అయిదు నిమిషాల తర్వాత అతని ప్రయత్నం ఫలిం చింది. అభిలాష్ బంధాలు విడిపడ్డాయి. అయితే కొవ్వొత్తి తాడుతోబాటు అతని చేతినికూడా కొద్దిగా కాల్చేసింది!

బాధని ఓర్చుకుని కట్లు వూడిపోయేవరకు ఓపిక పట్టాడు అభిలాష్. తర్వాత ఏనుగు మెలికలువేసి వున్న తన మిత్రుల బంధాల్ని ఒకటొకటి విప్పేశాడు.

అంతా బంధవిముక్తులయ్యేసరికి పదినిమిషాలు పట్టింది!

శత్రువులు వస్తూన్న జాడలేదు!

"ఫరవాలేదు, వాళ్ళింకా తమవాళ్ళు చచ్చిన షాక్

నించి తేరుకోలేదు. సమయానికి మనకి బాగానే రిలీఫ్ యిచ్చారు చచ్చిన కంటవాళ్ళు! పదండి పోదాం" కా్రీక్ బయటకి ఉరికాడు.

కాని అదృష్టం కలిసిరాలేదు!

సరిగ్గా అదే సమయానికి శత్రువులు అక్కడికొచ్చేశారు.

అంత మారాన వాళ్ళను చూస్తూనే కా్రీక్ తన వాళ్ళకి సైగచేసి రెండో గుహలోకి వెళ్ళిపోయాడు! ఒకరొకరు అతని వెనక రెండో గుహలోనికి చేరిపోయారు!

నాయకుడు అతని అనుచరులు తాము బసచేసిన మూడో గుహలోకి ప్రవేశిస్తూనే అదిరిపడ్డారు.

గుహలో కా్రీక్ బృందం లేకపోవటంతోనే నాయకుడు వేసిన పిచ్చికేకలు కా్రీక్ వాళ్ళకు వినిపించాయి.

వాళ్ళు నలుగురు మళ్ళీ టైగర్ హిల్స్ ప్రాంతమంతా టార్చిలతో వెతికేస్తున్నారు.

"బహుశా వేన్ దగ్గరికి పారిపోయుంటారు. ముందు వేన్ దగ్గరికి పోయి చూడండి. నేను యిక్కడి తక్కిన గుహల్ని వెతుకుతాను!" అన్నాడు నాయకుడు.

కా్రీక్ బృందం గుండెల్లో రాయి పడింది.

నాయకుడి దృష్టి తమ గుహమీదే మొదట పడుంది. తాము దొరికిపోక తప్పదు! వేన్ దగ్గరికి పారిపోతే మరీ ప్రమాదం! తక్కిన ముగ్గురు వేన్ దగ్గరికే వెళ్ళారు!

కా్రీక్ తనవాళ్ళ వంక నిస్సహాయంగా చూశాడు. కాని అంతలోనే ఓ నిర్ణయానికొచ్చేశాడు.

"ప్రస్తుతం నాయకుడొక్కడే మనకు ఎటాక్ యివ్వ

బోతున్నాడు. మనందరం ఒక్కసారిగా, అతన్ని చుట్టు ముట్టి తుదముట్టించేద్దాం! తక్కిన ముగ్గురి సంగతీ తర్వాత చూసుకోవచ్చు!" అన్నాడు.

"ఆల్ రైట్! ఒక్కడ్ని చంపటం పెద్ద కష్టమేం కాదు. తొందర్లో ఓ టార్చిగాని, ఓ రివాల్వర్ గాని కనీసం గడ్డపలుగుగాని తెచ్చుకున్నాం కాదు! కేవలం భుజబలంతోనే యీ నాయకుడిగాడ్ని ఎదుర్కోవాలి!" అన్నాడు అశ్విని.

అతని మాటలింకా పూర్తికాకుండానే టార్చి వెలుగు గుహలోపలికి సూటిగా వచ్చి పడింది!

ఈలోపల గుహలో అక్కడక్కడ పడున్న చిన్న చిన్న రాళ్ళను ఏరి పోగుచేసుకున్నారందరు.

సరిగ్గా టార్చి వెలుగు ఫోకస్ కాగానే నాయకుడి ఉనికి తెల్సిపోయింది. ఎంత దూరంలో అతను నించున్నది కూడా వాళ్ళకి అంచనా అయింది.

ఒక్కసారిగా టపటపమంటూ ఆ వెలుగు వచ్చిన వైపు రాళ్ళు విసరసాగారు.

రెండు దెబ్బలకే అతని చేతిలోని టార్చి యెగిరి అవతల పడింది. మరో రెండు దెబ్బలకే ఖంగుమంటూ రివాల్వర్ కిందపడింది రాయిమీద.

ఆ తర్వాత వరసగా అతనిమీద పడ్డ రాళ్ళవర్షంతో నాయకుడు పెట్టిన కేకలకు టైగర్ హిల్స్ ఆ అర్ధ రాత్రి సమయంలో ప్రతిధ్వనించాయి.

కిందపడ్డ రివాల్వర్ గాని, టార్చిగాని అతనికి దొరికే అవకాశం లేకుండా రాళ్ళ వర్షం కురిపించేశారు అందరూ ఒకేసారి.

నాయకుడు పరుగులు పెడుతూ తన వాళ్ళను పిలిచాడు.

మళ్ళీ గుహలోకి వెళ్ళి ఆయుధాలు తెస్తాడని వాళ్ళకు తెలుసు.

ఈ లోపలే కిందపడిన నాయకుడి రివాల్వర్ కార్తీక్ అందుకున్నాడు. టార్చి లైటు అభిలాష్‌చేత పట్టుకుని నాయకుడిమీదికి ఫోకస్ చేశాడు.

కార్తీక్ ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా నాయకుడికి రివాల్వర్ గురిచూసి కాల్చాడు. నాయకుడు అడ్డదిడ్డంగా పరుగెత్తటంతో గురి కుదరలేదు!

టార్చి వెలుగులో అతని తల పగిలి రక్తం ముఖంమీద ధారలు కట్టిన చిహ్నాలు స్పష్టంగా కనిపించాయి. రాళ్ళ దెబ్బలు విపరీతంగా తగిలాయి.

చివరకు నాలుగోగుండు సరాసరి నాయకుడి వీపు లోంచి దూసుకుపోయింది. అతను అమాంతం విరుచుకొని పడిపోయాడు!

ఈలోపల వేన్ దగ్గరకు వెళ్ళిన ముగ్గురు అనుచరులు పరుగెత్తుకొని వచ్చేశారు. వాళ్ళ చేతిల్లోని తుపాకులు గుళ్ళు వర్షించటం మొదలెట్టాయి.

కార్తీక్ తన వాళ్ళవంక తిరిగి, "మనదగ్గరున్నది ఒకేఒక రివాల్వర్! ఇక రెండు గుళ్ళే వున్నాయి. వాళ్ళ ముగ్గురిచేతుల్లోను తుపాకులున్నాయి. వాళ్ళ నెదిరించి బతకటం జరిగే పనికాదు. పరుగెత్తండి తలో దారి పరుగెత్తి వాళ్ళ ముగ్గుర్ని మూడుదార్లు పట్టిద్దాం, లేకుంటే యిక అంతే!" అన్నాడు.

అప్పటికప్పుడే అందరిలోను తెగింపు వచ్చేసింది. తమ ఉనికి శత్రువులకి తెలియక యెక్కడెక్కడో కాలుస్తున్నారు! అయితే అది కొన్ని క్షణాలే! తర్వాత టార్చి వెలుగులో తాము కంటబడక తప్పదు. వాళ్ళ

కాల్చక మానరు!

సరిగ్గా వాళ్ళు పకురాగత్తాలనుకుంటున్న సమయంలోనే అనుకోని అద్భుతం జరిగిపోయింది!

ఒకరి తర్వాత ఒకరుగా ముగ్గురు అనుచరులు నేల కూలిపోయారు! యెక్కడినుంచో అమాంతంగా వాళ్ళ ముగ్గురిమీద గుళ్ళవర్షం కురిసింది.

అది తామున్న గుహ పక్కనుంచే అని గ్రహించటానికి వాళ్ళకు కొద్ది క్షణాలు పట్టింది!

ఆ తర్వాత మరికొద్ది క్షణాల్లో ముగ్గురు వ్యక్తులు అక్కడ ప్రత్యక్షమయ్యారు. వాళ్ళ చేతుల్లో ఓ చేత టార్చ్ మరోచేత రివాల్వర్ వున్నాయి!

వాళ్ళు ముగ్గురు కార్తీక్ బృందం ముందుకొచ్చేశారు.

'వీళ్ళెవరు?' అనుకుంటూ కార్తీక్ వాళ్ళు విస్తుపోయి చూస్తున్నారు.

ఒకరు తప్పితే మరొకరు తమకిలా ఎదురవుతూనే వున్నారు! తమ గండం గడిచి గట్టెక్కటంకల్ల అని అందరూ నిర్ణయానికొచ్చేశారు.

వాళ్ళు ముగ్గురు కార్తీక్ బృందంవైపు పిస్తోళ్ళు గురి పెట్టి నిల్చున్నారు!

కార్తీక్, అభిలాష్, హిమవంత్, అశ్విని, దీప్తి శిలా ప్రతిమల్లా నిల్చుండిపోయారు.

* • •

ఆ ముగ్గురిలోను ఒకతను వయసులోను, అనుభవం లోను పెద్దవాడిలా వున్నాడు. దాదాపు ఆరు అడుగుల పైగానే పొడవున్నాడు. ఎర్రగా పుష్టిగా వున్నాడు. తేనెరంగు కళ్ళు. అతడు ఏ ప్రాంతంవాడో చెప్పటం కష్టమని చెపుతున్నాయి. అతనికి నలభై ఏళ్ళుండవచ్చు.

అతని కిరుపక్కలా వున్న యిద్దరు వ్యక్తులు నల్లగా బలిష్ఠంగా, యిద్దరూ కవలపిల్లలన్నట్టున్నారు. దుబ్బుజాట్టు, ఎర్రటి కళ్ళు, బనీను, పాంట్లు ధరించి వున్నారు. తెల్ల కళ్ళ వ్యక్తి ఫుల్ సూట్‌లో వున్నాడు!

తెల్ల కళ్ళ వ్యక్తి తమవంకే కళ్ళార్పకుండా చూస్తూన్న తారీక్ బృందాన్ని చూసి స్నేహపూర్వకంగా నవ్వాడు.

అందరు విస్మయంగా చూశా రతనివంక.

"మేము శత్రువులంకాదు, మిత్రులమే!" అన్నాడు తెల్లకళ్ళ వ్యక్తి.

అందరి వదనాల్లోను చిరునవ్వు చోటుచేసుకుంది.

తారీక్ ఆనందంగా చెయ్యి సాచి అతనితో కరచాలనం చేశాడు. దుబ్బుజాట్టు నల్లవాళ్ళు కూడా స్నేహపూర్వకంగా కరచాలనం చేశారు.

"ఇంతకీ మీరు....?" తారీక్ మాటల్ని మధ్యలోనే ఆపుచేశాడు తెల్లకళ్ళ వ్యక్తి.

"మీకిప్పుడు పూర్తి విశ్రాంతి కావాలి, నాకు తెలుసు! పదండి, మన శత్రువుల గుహలో కూచుని ముచ్చటించుకుందాం!" అన్నాడతను.

తారీక్ ఏదో అడగబోతున్న అశ్విని ఆపుచేసి, "అలాగే పదండి పోదాం!" అన్నాడు.

మళ్ళీ మూడో గుహలోకి అడుగుపెట్టారందరు. ఇప్పుడాగుహ పులి బోనులాలేదు. విశ్రాంతి మందిరంలా వుంది!

హ తావరణంలో వచ్చిన ఆహ్లాదకరమైన మార్పు వాళ్ళ మనసులకి ఊరట కలిగించింది.

* * *

"నా పేరు, వివరాలు చెప్పేముందు మీ అందరి గురించీ వివరాలు తెల్సుకోవాలనుకుంటున్నాను. మీకేం అభ్యంతరం లేదుకదా!" అన్నాడు తేనెకళ్ళ వ్యక్తి.

"నో, నో, అభ్యంతర మెందుకుంటుంది? మీరు మా ప్రాణదాతలు. మీకు ఋణపడి ఉన్నాం" అన్నాడు.

కార్తీక్ అతని సౌమ్యతకు, సహృదయానికి కరిగి పోతూ.

తక్కినవాళ్ళు కూడా ఆ ముగ్గురు ప్రాణదాతలవంక కృతజ్ఞతాపూర్వకంగా చూస్తున్నారు.

"మేము జియాలజీ స్టూడెంట్సుం! ఇక్కడ సర్వే చేయటానికొచ్చాం. మా కోర్సులో ఫీల్డు ట్రయినింగ్ ఓ భాగం. అందునిమిత్తం వచ్చి యిదుగో వీళ్ళ చేతుల్లో చిక్కపోయాం!"

"ఎన్నాళ్ళయింది మీరొచ్చి....?" ఆసక్తిగా అడిగాడతను.

అశ్విని ఏదో చెప్పబోయేంతలో అతన్ని గిల్లి, "రెండు రోజు లయిందండి" అన్నాడు కార్తీక్.

అతనలా నిజాన్ని కప్పిపెట్టి ఎందుకు చెప్తున్నాడో తక్కినవాళ్ళు అర్థంచేసుకోవటానికి అయిదు నిమిషాలు పట్టింది.

తేనెకళ్ళ వ్యక్తి యెవరో నిజం తెలీదు! అతను శత్రువుని కాదన్నంతమాత్రాన మిత్రుడనే నిర్ణయానికి రావటం ఎలా? పొరపాటున చెప్పకూడని విషయం చెప్పి మళ్ళీ చిక్కుల్లో పడిపోవాల్సి వస్తుందేమో! అందుకే అవసరానికి మించి ఏమీ నోరుజారకుండా జాగ్రత్తగా వ్యవహరిస్తున్నాడు కార్తీక్! మనసులో నే అతని సందర్భ శుద్ధిని సమయస్ఫూర్తినీ మెచ్చుకున్నారు

మిత్రులు.

అతని అనుమానం నిజమని తెలిసికళ్ళ వ్యక్తి మాటలతో రుజూవయింది వాళ్ళకి!

"మీరొచ్చేసరికి యీ నలుగురేనా ఇక్కడ వున్నది? అప్పుడు వీళ్ళేం చేస్తున్నారు?" అడిగాడు తెలిసికళ్ళ వ్యక్తి.

కార్తీక్‌కి అతను కొద్దికొద్దిగా అర్థమవుతున్నాడు.

"ఇంకో యిద్దరు కూడా వున్నారండి! వాళ్ళు వంట చేస్తూ కనిపించారు" అన్నాడు కార్తీక్.

తెలిసికళ్ళ వ్యక్తి తలూపి, "మరి వాళ్ళేమయ్యారు?" అన్నాడు.

"ఇంతక్రితం వాళ్ళ గురించే యీ నలుగురు హడావుడి పడి వెతుకుతున్నారు. ఆ హడావుడికే మాకు మెలకువ వచ్చింది. బంధాలువేసి కట్టిపడేశారు మమ్మల్ని వీళ్ళు! వీళ్ళు ఆ యిద్దరికోసం వెళ్ళిన సమయంలో మేము కట్లు తెంచుకుని బయటపడ్డాం. కాని వాళ్ళచేతుల్లో నే చిక్కి పోయాం!" అన్నాడు కార్తీక్.

"అయితే మీరొచ్చేసరికి వీళ్ళు ఆరుగురే వున్నారు. ఇంకెవరూ లేరు, అవునా?"

"అవునండి."

"మరి మేం చంపింది ముగ్గుర్నేకదా! నాలుగో వ్యక్తి నెవరు చంపారు?" అన్నాడు తెలిసికళ్ళ వ్యక్తి.

కార్తీక్ ఒక్కొక్క క్షణం ఆలోచించాడు. తను అబద్ధం చెప్పటం మంచిదికాదు__నాయకుడ్ని చంపిన సమయానికి తెలిసికళ్ళ వ్యక్తి, తక్కిన యిద్దరు ఆ సమీపంలోనే వున్నారు. తప్పకుండా మొదట్నుంచీ తమ అందరి చర్యలు గమనిస్తూనే ఉండివుంటారు. అందుకే

సరిగ్గా సమయానికి తమకి అడ్డుపడి రక్షించగలిగారు!

"ప్రాణ రక్షణకోసం నేనే చంపేశాను. అతని రివాల్వర్‌తోనే అతన్ని చంపాను" అన్నాడు కార్తీక్.

తేనెకళ్ళ వ్యక్తిలో నమ్మకం, అతని పెదాలమీద చిరునవ్వు నిలిచాయి.

"ఊరకే అడిగాను. మేమంతా గమనిస్తూనే వున్నాం. బహుశా యీ ఆరుగురికీ అతను నాయకుడేమోననికూడా అనుకున్నాం! అఫ్‌కోర్సు తక్కిన యిద్దర్నీ మేము చూడలేదనుకో...." అన్నాడు తేనెకళ్ళ వ్యక్తి.

కార్తీక్ చాలా కాషస్‌గా వున్నాడు. ఆ వ్యక్తి చాలా అసాధ్యుడిలా వున్నాడు. తనని బోనులో నిలబెట్టినట్టు క్రాస్ ఎగ్జామినేషన్ చేస్తున్నాడు.

"ఇక్కడ వీళ్లు యిలా నేలంతా ఎందుకు తవ్వి పోస్తున్నారో మీకేమైనా తెలుసా? వీళ్ళేమైనా చెప్పారా?" అన్నాడా వ్యక్తి.

కార్తీక్ తల అడ్డంగా తిప్పి, "అదే అర్థంకాలేదు సార్. ఎందుకు తవ్వుతున్నారని అడిగితే మావాడిమీద పడి కొట్టాడు ఆ నాయకుడిలాంటి మనిషి! ఇక మేము ఏమీ అడగలేదు, వాళ్ళు చెప్పలేదు. ఎందుకంటారు?" అని ప్రశ్నించాడు అమాయకంగా.

తేనెకళ్ళ వ్యక్తి గొంతు సవరించుకుని, "అదే నాకూ అర్థంకావటంలేదు. వీళ్ళు ఆర్కియాలజీ డిపార్టుమెంటు వాళ్ళేమో, పురావస్తు పరిశోధనలో భాగంగా ఇక్కడ తవ్వుతున్నా రనుకుంటున్నాను. కాని వాళ్ళు తుపాకులు, రివాల్వర్‌లు పట్టుకుని రావటం చూసి ఆర్కియాలజీవాళ్ళు కాదని అర్థంచేసుకున్నాను!" అన్నాడు.

కార్తీక్ అతన్ని అంచనా వెయ్యటానికి ప్రయత్ని

స్తున్నాడు. అతను తనకన్న చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తున్నాడు. ఎక్కడా కొంచెం కూడా పట్టు జారటం లేదు. తనకావలసిన సమాచారం రాబట్టుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు.

ఇంతకీ యీ వ్యక్తి ఎవరు? ఆ నల్లవాళ్ళిద్దరు ఎవరు? పెద్ద పజిల్ లా కనిపించింది కార్తీక్ బ్రెయిన్ కి.

అశ్వని రెండుమూడుసార్లు అడిగెయ్యాలని ప్రయత్నించాడు. అతని ప్రయత్నం గమనించి ప్రతిసారీ అతన్ని కాలుతొక్కి, చెయ్యిగిల్లి వారిస్తూ వచ్చాడు కార్తీక్. కొవ్వొత్తుల గుడ్డివెలుగులో తను కళ్ళతో సైగచేసినా అశ్వనికి కనిపించే అవకాశంలేదు!

తెల్లవారటానికి ఎంతో టైం కాలేదన్నట్టు తూర్పున వెలుగురేకలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"అన్నట్టు మీ పేర్లు చెప్పనేలేదు. నేను తెలుసుకోగూడదా?" సన్నగా నవ్వుతూ అన్నాడు తెల్లకళ్ళ వ్యక్తి.

"అయ్యో, ఎంతమాట సార్! ఇందాక పరిచయం చెయ్యబోయి అందర్నీ కట్టగలిపి జియాలజీ స్టూడెంట్సని చెప్పేశాను. తర్వాత మాటల్లోపడి మరిచేపోయాను. నా పేరు కార్తీక్. ఇతను అభిలాష్...." అంటూ అందర్నీ పరిచయంచేశాడు కార్తీక్. అప్పుడైనా ఆ వ్యక్తి తన గురించి, తనవాళ్ళ గురించి చెపుతాడని ఎదురుచూసిన వాళ్ళ ఆశ, నిరాశే అయింది. అతనా ప్రయత్నాలేం చేస్తున్నట్టు కనిపించలేదు. సందర్భం వచ్చినా కావాలనే దాటవేస్తున్నట్టు కనిపించింది.

"అయితే, మీరు యిక్కడ సర్వే చెయ్యరా ఇక?" అన్నాడా వ్యక్తి యథాలాపంగా.

"ఇంకేం సర్వే సార్! ఇప్పటికైన అనుభవాలు చాలు!" అన్నాడు హిమవంత్.

"అనుభవాలు అంటున్నారు, ఏమి అ ను భ వా లు చూశారేం?" అన్నాడు అతను నవ్వుతూ.

"మాంత్రికుడు, క్షుద్రదేవతలు, పాములు—అబ్బో, అడక్కండి సార్. తల్చుకుంటేనే భయంగా వుంది..?" ఇంకా ఏదోదో చెప్పబోతున్న హిమవంత్‌ని గట్టిగా గిల్లాడు అభిలాష్. అతను అన్నీ బయట పెట్టేసేలా ఉన్నాడు. అంతదాకా కార్తీక్ పడ్డ శ్రమంతా వ్యర్థమయిపోయేలా కనిపించింది.

తేనెకళ్ళ వ్యక్తి కళ్ళు పెద్దవయ్యాయి. ఆసక్తి తొంగిచూసింది. "ఏమిటి? మాంత్రికుడు, క్షుద్ర దేవతలూనా? వెరీ యింటరెస్టింగ్, చెప్పండి వింటాను.... మీకు తొందరేంలేదుకదా! ఊరికే టైం పాస్‌కి అడుగుతున్నానివి. మీరు వెళ్ళిపోతానంటే అభ్యంతరంలేదు!" అన్నాడు మళ్ళీ.

హిమవంత్ నోరుజారిపోయాడు. దాన్ని కప్పిపుచ్చటంకన్న ఆకాస్త నిజం చెప్పెయ్యటమే ఉత్తమం! చూడగా, ఆ వ్యక్తికి యిక్కడి విషయాలన్నీ బాగా తెలిసినట్టే కనిపిస్తోంది! ఇప్పుడు చచ్చిన వ్యక్తులేకాక బహుశా యింకా చాలా తెలిసి వుండొచ్చు! అతని వుద్దేశ్యం కొద్దికొద్దిగా అవగాహన అవుతోంది.

తనకి ఆసక్తిలేనట్టు నటిస్తూనే మాంత్రికుడి గురించి వివరాలు ఆరాతీస్తున్నాడు. అబద్ధం చెప్పి యిరుక్కుపోయేకన్న నిజం చెప్పేసి బయటపడడమే ఉత్తమంలా వుందనిపించింది అందరికీకూడా.

కార్తీక్ నవ్వు ముఖంమీద పులుముకుని, "మీకు

చెప్పటానికి మాకూ యింటరెస్టింగానే వుంది సార్! చాలా ప్రమాదంనించి తప్పించుకున్నాం. ఇక్కడినుంచి మూడో గుహ, అంటే వరసలో అయిదో గుహలో ఓ దుష్ట మాంత్రికుడు, ఓ యిద్దరు అనుచరులతో యిక్కడికొచ్చినవాళ్ళని పట్టుకుని కాళీదేవికి బలిస్తున్నాడు. మేము యీ వ్యక్తులనించి తప్పించుకోవటానికి అనుకోకుండా ఆ గుహలోకి పరుగెత్తాం. మమ్మల్ని వాళ్ళు బలివ్వబోయారు. అయితే మమ్మల్ని తరుముకుంటూ వచ్చిన యీ వ్యక్తులు మాంత్రికుడ్నీ అతని అనుచరుల్నీ చంపేశారెండి! తర్వాత యిక్కడ బంధించారు మమ్మల్ని వీళ్ళు!" అన్నాడు.

"మరి పాములు, క్షుద్ర దేవతలు.... అంటూ ఏదో చెప్తున్నారే మిష్టర్ హిమయంత్....!?" అర్థోక్తిలోనే ఆగిపోయి హిమవంత్ వంక చూశాడా వ్యక్తి.

హిమవంత్ బెరుగ్గా చూశాడు కార్తీక్ వంక.

"అదేనండి. ఆ గుహలోనే కొన్ని పాములు కూడా కనిపించాయి. గాల్లో ఏదో చప్పుళ్ళయితే వాటిని క్షుద్ర దేవతలని భ్రమించాడు మా హిమవంత్. అతనీ మధ్య క్షుద్ర సాహిత్యం చదువుతున్నాడులెండి!" తేలిగ్గా నవ్వేస్తూ అన్నాడు కార్తీక్.

తేనెకళ్ళ వ్యక్తి నిటారుగా కూచుని, "అయితే ఆ గుహ తప్పకుండా చూడవలసిందే!" మీకు క్షుద్ర శక్తులమీద నమ్మకముందా మిష్టర్ కార్తీక్!" అన్నాడు తాపీగా.

కార్తీక్‌తోబాటు తక్కిన అందరికీ టాపిక్ రాంగ్ ట్రాక్‌లో పోతున్నందుకు చాలా కోపంగా అసహనంగా వుంది. అందుకు కారకుడైన హిమవంత్ మీద అందరికీ

కుర్రగా వుంది. కాని చేసేదేంలేదు! ఆ తేనెకళ్ళ వ్యక్తి పైకి కనిపించేటంత సౌమ్యుడుకాదని కావాలనే తమనించి యిన్ఫర్మేషన్ లాగటానికి చూస్తున్నాడనీ అర్థమయిపోయింది వాళ్ళకి!

"అబ్బే, అలాంటి నమ్మకాలేం లేవుసార్! వాటిపట్ల బొత్తిగా ఆసక్తిలేదు కూడాను!" అన్నాడు కార్తీక్ సంభాషణ తుంచెయ్యాలిని.

తెల్లవారబోతోంది. అందరి మనసుల్లోనూ ఒకటే ఆలోచన! యెలాగైనా తమ వేన్ దగ్గరికి చేరుకోవాలి. చింతపల్లెకుపోయి కాస్త శుభ్రపడి తమ యిళ్ళకు తిరుగు ప్రయాణ మయిపోవాలి. ఇక ఆలస్యానికి తట్టుకోటాని కెవరూ సిద్ధంగాలేరు!

"అలా తీసిపారెయ్యకండి! నాకిలాంటి మాంత్రికు లన్నా క్షుద్ర శక్తులన్నా చాలా సరదా! తెల్లవారు తోంది. ఓసారి ఆ గుహచూసి వెళ్ళిపోదాం. మీరు ఓ గంట తర్వాత హాయిగా మీ వేన్‌లో వెళ్ళిపోవచ్చు, అన్నట్టు వేన్‌కి డ్రయివరుండాలికదా. ఎవరు డ్రైవరు?" అన్నాడు తేనెకళ్ళ వ్యక్తి.

"అదే సార్ చెప్పటం మరిచాను. మాంత్రికుడి అనుచరులు మా డ్రయివర్‌ను పొట్టనబెట్టుకున్నారు. మాంత్రికుడి గుహాలోనే చనిపోయి వున్నాడు" అన్నాడు కార్తీక్.

ఆ వ్యక్తి 'చ్చొచ్చొచ్చొ' అంటు నోటితో విచారాన్ని వ్యక్తపరిచే ధ్వని చేసి, "నయం మీరైనా ప్రాణాలతో బయటపడ్డారు, అదృష్టవంతులు! రెండుసార్లు ప్రాణాలతో బయటపడటం మాటలుకాదు!" అన్నాడు. (సశేషం)



# క్రైమ్‌లో తమాషాలు

## అంతా శత్రువులే!

"నాకు ఈ ఊరిలో చాలామంది శత్రువులైనారు. అందుకే ఈ ఊరి నుంచి ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటు న్నాను" దాసు, సతీష్‌తో అన్నాడు.

"అంతమంది శత్రువులను ఎందుకు పెంచుకున్నావు? ఎవరు వాళ్ళు?"

"అప్పు లిచ్చినవాళ్ళు!"

—వాయిల అప్పల మురళీకృష్ణ, పార్వతీపురం.

## టిఫిన్‌లో విషం!

సుబ్రావ్ డిటెక్టివ్ వృత్తి చేపట్టి ఆర్నెల్లయింది. ఇప్పటిదాకా ఒక కేసు కూడా రాలేదు.

ఒకరోజు ఒక హోటలుకి వెళ్ళాడు సుబ్రావ్. కావలసిన టిఫిన్‌కి ఎంత డబ్బు అవుతుంది, అని రేట్ల పట్టిక చూపి లెక్కపెట్టుకొంటున్నాడు.

ఇంతలో మూలకుర్చీలో కూర్చొని టిఫిన్ తింటున్న వ్యక్తి 'అమ్మా!' అంటూ గుండెలు పట్టుకొని కూలబడి పోయాడు. జనం అందరూ ఆ వ్యక్తి దగ్గరికి చేరుకో సాగారు.

డిటెక్టివ్ సుబ్రావ్‌కి ఒక మెరుపులాంటి ఆలోచన వచ్చింది. ఆ ఆలోచనను అమలుజరిపితే కాఫీ ఖర్చు

కాకుండా టిఫిన్ తినవచ్చు. పైగా డిటెక్టివ్‌గా పేరుకూడా పైకి వస్తుంది. ఇలా తలచి, జనం దగ్గరికి పరుగెత్తుకు వెళ్ళాడు.

జనాన్ని వుద్దేశించి, "ఆగండి, ఆ వ్యక్తిని ముట్టుకోకండి. ఈ హోటల్లో పదార్థాలలో విషముంది. అందుకే ఆ వ్యక్తి చనిపోయాడు. ఆ విషయం నేను టెస్టు చేస్తాను" అని రకానికి రెండు చొప్పున ఆ హోటల్లో వున్నవన్నీ తిని అందులో విషం లేదని తేల్చాడు. జనం అతని డిటెక్టివ్ తెలివికి జోహార్లు అర్పించారు.

ఇంతలో ఆ గుండె పట్టుకొని కూలబడిపోయిన వ్యక్తి తేరుకొని లేచి, "నాకు అప్పుడప్పుడు యిలా గుండెనొప్పి వచ్చి జరగటం మామూలే" అని బిల్లు చెల్లించి వెళ్ళిపోయాడు. జనంకూడా యెవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

సుబ్రావ్ కూడా వెళ్ళిపోబోతుంటే ఆ హోటలు ప్రొప్రయిటర్ ఆపి "నా హోటల్లో విషపదార్థాలు ఉన్నాయని దుష్ప్రచారం చేసి, టిఫిన్ పీకలదాకా పందిలా తింటావా! నా హోటలు పేరు పాడుచేసినందుకు, టిఫిన్ మింగినందుకు వందరూపాయలు చెల్లించు" అని సుబ్రావ్ దగ్గర వందరూపాయలు వసూలుచేసి పంపాడు.

ఇంకెప్పుడూ యిలాంటి వెధవ డిటెక్షన్ చేయకూడదని లెంపలు వేసుకుంటూ బయటికి నడిచాడు, ది గ్రేట్ డిటెక్టివ్ సుబ్రావ్.

—కాశీభట్ల భానుమూర్తి

# అమెరికా ఆవు!

అమెరికా చూడ్డానికి వెళ్ళిన ఆనంద్ ఒక రెస్టారెంట్‌లో కూర్చుని ఫోంచేస్తున్నాడు.

భారతీయ పద్ధతులు బాగా తెలిసిన అక్కడి బేరరుకు ఆనంద్ ఆవుమాంసం తినడం ఆశ్చర్యం కలిగించింది।

వెంటనే అతని దగ్గరికి వెళ్ళి "చూడండి సార్। మీది భారతదేశం కదా।" అనడిగాడు.

"అవును" అన్నాడు ఆనంద్.

"భారతీయులు ఆవుమాంసం తినరనీ, పైగా ఆవుని పూజిస్తారని విన్నానే" అన్నాడు బేరర్.

"నువు చెప్పింది నిజమే....కాని నేను తినే ఈ ఆవు మా దేశానిది కాదు కదా।" అన్నాడు ఆనంద్.

—నూతన్, గుంటూరు-2.

## డబుల్ రూమ్!

మల్లయ్య తన జీవితంలో మొట్టమొదటిసారి పట్నం వచ్చాడు. రైలు దిగగానే సరాసరి ఎదురుగా వున్న హోటల్‌కి దారితీశాడు. కౌంటర్లో కూర్చొన్న వ్యక్తిని చూపి, ఉండటానికో గది కావా లన్నాడు.

కౌంటర్ క్లర్కు అతడివంకోసారి ఎగాదిగా చూపి "గదంటే డబుల్‌రూమా? సింగల్ రూమా?" అని అడిగాడు.

మల్లయ్య పెద్దగా చదువుకోలేదు. కాపీ కొద్దో, గొప్పో ఇంగ్లీషు ముక్కలు వచ్చినా గొప్ప తెలివితేటలున్న మనిషి కాదు. అందులోనూ మొదటిసారి హోటల్‌లో దిగడం. ఏదో ఊళ్ళో ఇదివరకు పట్నం వచ్చినవాళ్ళు చెప్పిన ఆన వాళ్ళను బట్టి హోటల్‌లో డబ్బులు యిస్తే ఎన్నిరోజులైనా వుండొచ్చుననే నమ్మకంతో వచ్చాడు. ఇక్కడేమో క్లర్కు యిలా అడుగుతా డెందుకనుకొని. "డబులంటే ఏమిటి? సింగిలంటే ఏమిటి? ఈ రెంటికి తేడా ఏమిటి?" అన్నాడు.

"డబుల్ రూమంటే పెద్దగది, సింగిల్ రూం అంటే చిన్న గది" అని వివరంగా చెప్పాడు క్లర్క్.

"అయితే ఏ రూంకి ఎంత కరుసవుద్ది?"

"డబుల్ రూంకి వంద, సింగిల్‌రూంకి డెభై."

"పెద్దరూమే యియ్యండి" అన్నాడు మల్లయ్య కొంచెం సేపు ఆలోచించి.

అడ్వాన్స్ యివ్వండి అనబోయి, "ముందు ఒక రోజు డబ్బు యివ్వాలి" అన్నాడు క్లర్క్.

రొంటినుండి డబ్బు తీసి లెక్కపెట్టి, అందులోనుండి పది పదులు కౌంటర్ క్లర్క్ కందించాడు మల్లయ్య.

రూం బాయ్‌ని పిలిచి "ఈయన్ని రూం నెంబర్ త్రీనాట్ త్రీకి తీసుకెళ్ళు" అని కీస్ అతడి కందించాడు కౌంటర్ క్లర్క్.

"రండి సార్!" అని మల్లయ్యను తీసుకు కదిలాడు రూంబాయ్.

రెండు నిముషాలు కూడా పూర్తి కాకముందే కౌంటర్ క్లర్క్ వద్దకు దూసుకొచ్చాడు మల్లయ్య.

"ఏమయ్యా, పెద్దమడిసీ, గట్టిగా కాళ్ళు జాపుకొని పడుకోడానిక్కూడా యీల్లేని చిన్న గదిచ్చి దానికి వంద రూపాయలు తీస్కొంటావా?" అంటూ క్లర్క్ చొక్కా పట్టుకొన్నాడు మల్లయ్య.

క్లర్క్ తన చొక్కాను మల్లయ్య చేతినుండి బలవంతాన విడిపించుకొంటూ, "ఈయన్ని ఏ గదికి తీసుకుపోయావ్?" అన్నాడు మల్లయ్య వెనకే పరుగెత్తుకుంటూ వచ్చిన రూంబాయ్‌ని.

"సార్! మీ రీయన్ని త్రీనాట్ త్రీకి తీసుకెళ్ళమన్నారు గదండీ! మెట్లదాకా బాగానే వచ్చాడండీ! తీరా పైకి వెళ్దా

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.

మని ఈయన్ని లిఫ్ట్‌లోకి ఎక్కించానండి. అంతేనండి....
ఈయన గిరుక్కున నాతో ఏమీ చెప్పకుండా యిలా మీ
వద్దకు పరుగెత్తుకొంటూ వచ్చేశాడండి....!" వగరుస్తూ
చెప్పాడు రూంబాయ్.

మల్లయ్య చెప్పిన రూం 'లిఫ్ట్' అని తెలియగానే నవ్వాపుకోలేకపోయాడు కౌంటర్ క్లర్క్.

—కోనె హరిబాబు, హైద్రాబాదు-4.

## దూడ గడ్డి-?

రాజు కొబ్బరి చెట్టుమీదున్నాడు.

తోటమాలి రంగన్న అడిగాడు. వ్యంగ్యంగా "ఏరా రాజు! చెట్టు ఎందుకెక్కావు. దూడ గడ్డికోసమా?"

"కాదండీ—దూడకోసమే! మా దూడ ప్రొద్దుటి నుండి కనపడటం లేదు. ఎక్కడైనా కనబడుతుందేమోనని చెట్టెక్కి చూస్తున్నాను!!!"

—కె. ద్వారకా మోహన్, రాజమండ్రి.

## ప్రశంసలు!!

అది పోస్టాఫీసు—

"రాజారావు ఏంటి! అన్ని కార్డులు కొంటున్నాడు—అమ్మడానికా?" అడిగాడు తన మిత్రుణ్ణి రమేష్.

"అదేం కాదు. అతను నటించిన నాటిక టి.వి.లో వచ్చిందిట. ప్రశంసిస్తూ ప్రేక్షకులు వ్రాసినట్లుగా ఉత్తరాలు వ్రాయడానికి"—చెప్పాడా మిత్రుడు.

—ఆర్. వెంకటేశ్వర్, బెల్లంపల్లి.

# పెద్దపొట్ట?

5 సంవత్సరముల ఓ చిన్నారి బాబు ఎప్పుడూ వేలు నోట్లో వేసుకొనేవాడు. తల్లిదండ్రులు ఆ అలవాటు మాన్పాలని ఎంత ప్రయత్నించినా ప్రయోజనము లేకపోయింది.

ఒకరోజు నాన్నగారి స్నేహితుడు వాళ్ళింటికి వచ్చాడు. అతనికి పెద్ద బొజ్జ. అతను వెళ్ళాక బాబు వాళ్ళ తండ్రితో "డాడీ! అంకుల్‌కి ఎంత పెద్ద పొట్టో" అన్నాడు ఆశ్చర్యంగా నోట్లో వేలితో.

దాని కాయన "అంత పెద్దపొట్ట ఎందుకైందో తెలుసా? చిన్నప్పుడు అంకుల్ నీలానే వేలు నోట్లో వేసుకొనే వాడు. అందుకే...." బాబు గబుక్కున నోట్లోంచి వేలు లాగేశాడు. ఆ తర్వాత మరి వేలు నోట్లో ఎప్పుడూ పెట్టుకోలేదు.

కొన్నాళ్ళయ్యాక బాబు తల్లి స్నేహితురాలు వాళ్ళింటికి వచ్చింది. ఆమె నిండు గర్భవతి.

ఆమెను చూస్తూ బాబు నవ్వాపుకోలేకపోయాడు. "ఆంటీ.... నీ కెందుకంత పెద్దపొట్ట వచ్చిందో నాకు తెలుసులే" అంటూ పకపక నవ్వాడు.

తల్లి కంగారుగా "ఎవరు చెప్పార్రా నీకు" అంది.

"డాడీ చెప్పాడు మమ్మీ!" ముద్దుగా చెప్పాడు. తల్లి సిగ్గుపడిపోయింది.

వచ్చినావిడ కోపంగా "ఏమని చెప్పాడేమిటి మీ డాడీ?" అడిగింది.

"అదే....నీవు చిన్నపుడు నోట్లో వేలు వేసుకొని వుంటావు. అందుకే యింత పెద్దపొట్ట...."

తల్లి, వచ్చినావిడ పెద్దగా పకాలున నవ్వడంతో బాబు విస్తుపోయాడు. —జి. విజయలత, కలువాయి.

